

మే 2021

# అరుణతార

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక
సంపుటి: 49 సంచిక: 5 378 పేజీలు 52 రూ. 20/-

## విరసంపై మళ్లీ నిషేధం

# విరసం సాహిత్య పాఠశాల- 11 ఏప్రిల్ 2021, విజయవాడ



విరసం జెండాను ఆవిష్కరిస్తున్న
రాష్ట్ర అధ్యక్షుడు అరసవిల్లి కృష్ణ




అమరుల స్మారక స్థూపం ఆవిష్కరణ



ఎర్రజెండా ఆవిష్కరణ



రాము



సి.ఎస్.ఆర్. ప్రసాద్



విరసం సాంస్కృతిక బృందం



రివేరా



బ్రాహ్మణవాదం పుస్తకావిష్కరణలో
అరసవిల్లి కృష్ణ, పాణి, వరలక్ష్మి



సంపుటి : 48 ◆ సంచిక : 9 ◆ మే 2021 ◆ వెల : రు. 20/-

# రచనపై నిషేధం

**అరసవిల్లి కృష్ణ**

ఏభై ఏళ్ళ విప్లవ రచయితల సంఘం మరో ఏభైలలోకి ప్రవేశిస్తున్న కాలంలో నిషేధానికి గురైంది. భారతదేశ చరిత్రలో రచయితల సంఘం పదిహేనేళ్ల కాలంలో రెండు సార్లు నిషేధపు ఉత్తర్వులను అందుకుంది. అయినప్పటికీ రాజ్య యంత్రాంగంతో తలపడి గతంలో నిషేధాన్ని తొలగించు కోగలిగింది. తాజాగా కాలం సమాధానం చెబుతుంది. వేచి చూడాలి.

విరసం కార్యాచరణను చూసి రాజ్యం ఎందుకు భయ కంపితమవుతున్నది? విప్లవ రచయితల రచనా వ్యాసంగం రాజ్యాన్ని ఏవిధమైన అలజడికి గురి చేస్తున్నది? నిర్బంధం, అక్రమ కేసులు, జైళ్లు నోరు తెరవడం వంటివన్నీ పైకి కనిపించే రాజ్య నిర్బంధాలు. ఏదీ కనబడకుండా కూడా విప్లవ రచయితలను అణిచివేసే యత్నాలను రాజ్యం చేస్తూనే ఉంది. అయినా ఏభై ఏళ్లుగా నిత్యం విరసం సభ్యుల రచన, ఆచరణ సాహిత్యావరణంలో నిరూపితమవుతూనే ఉంది.

విప్లవ రచయితల సంఘం ధిక్కారం పునాదిగా ఆవిర్భవించింది. తొలి ఊపిరిలోనే రాజ్య స్వభావాన్ని, అధికార మార్పిడి అనంతర ప్రజాస్వామ్య మేడిపండు నిజ స్వరూపాన్ని గుర్తించ గలిగింది. ఆ పునాదిపై రాజ్యం, విరసం ఘర్షణ పడుతూనే ప్రయాణం చేసాయి. బహుశా ఏదో ఒక దశలో విరసం కాలగర్భంలో కలగలిసి పోతుందని రాజ్యం భావించింది. కానీ అదేమీ జరగలేదు. సరికదా నూతన ప్రజాస్వామిక ఆకాంక్షలను ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా విరసం ఎత్తి పట్టింది.

ఈ కాలంలో విరసం కొత్త వెలుగులను తెలుగు సాహిత్యంలో నమోదు చేసింది. సాహిత్య ప్రయోజనం పండిత చర్చ కాదు. శ్రమజీవుల పక్షాన సృజనాత్మక చర్చగా వుండాలని స్పష్టం చేసింది. ఆ వెలుగులో ప్రయాణం చేసింది. మూడు తరాల నూతన రచయితలను తయారు చేసింది. విరసం వెలుపల ప్రజాస్వామిక రచయితల భావజాలాన్ని ప్రజల వైపు నుంచి సంపన్నం చేయడంలో క్రియాశీలక భూమిక నిర్వహించింది.

సాహిత్యంలో వర్గ దృక్పథం పునాదిని పటిష్టం చేసింది. సాహిత్య ప్రయోజనం సమ సమాజ స్థాపన కేంద్రంగా వుండాలని, రచయిత తన రాత ద్వారా సమానత్వ భావనలకు బీజం వేయాలని, ఆ వైపుగా తెలుగు సాహిత్యంలో తనదయిన ముద్రను చిరస్థాయిగా వేయగలిగింది.

నిబద్ధత, నిమగ్నత వేరు, వేరు అంశాలు కాదు. రచయితలకు వుండవలసిన సహజ లక్షణం. తన మాట, రాత, పాట ద్వారా అంతరాల సామాజిక అంశాలను సరిచేసే దిశగా రచయితల దృష్టి వుండాలని విరసం అవగాహన. రచయితల కార్యరంగం రచనే. రచయిత జనం కదలికల్లో భాగం. జనం పోరాట రూపాల్లో భాగం. అంతిమంగా రచయిత జనం వైపు నిలబడే సృజనాత్మక జీవి. ఇదే నిమగ్నత. ఈ అవగాహనను విస్తృతపరచడంలో విరసం సాహిత్యావరణలో నిమగ్నత అనే చర్చను బలంగా వుంచగలిగింది. విరసం లేకుంటే ఈ చర్చకు వుండే విలువ ఇంతకాలం నిలబడేది కాదు.

రచయితల సంఘంపై నిషేధం రాజ్య స్వభావాన్ని సూచిస్తుంది. సాహిత్యంలో వర్గపోరాట దృక్పథంతో ఏర్పడిన విరసం తదనంతర కాలంలో దేశంలో బలపడుతున్న సాంస్కృతిక జాతీయ వాదం ముసుగులో విస్తృతమవుతున్న బ్రాహ్మణీయ హిందుత్వతో తలపడింది. తన శక్తినంతా ప్రతిఘటనకు వెచ్చించింది. విరసం ఇప్పుడు ఎదుర్కొంటున్న నిర్బంధానికి ఈ కోణం వున్నది.

జాతీయోద్యమ కాలంలో ఆవిర్భవించిన రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ తదనంతర కాలంలో, అధికార మార్పిడి అనంతర కాలంలో సాంస్కృతిక జాతీయ వాదం పేరిట ముందుకు వచ్చింది. గుడి వెలుపల రాముడు రాజకీయ రాముడిగా మారాడు. మందిరం, మసీదు మూడు దశాబ్దాల పాటు భారత ప్రజా స్వామిక భావనలను ప్రభావితం చేసాయి. ఈ పరిణామాన్ని విరసం తన రచన, ఆచరణ ద్వారా భావజాల రంగంలో ప్రచలితం చేయగలిగింది. మతం, మతతత్వం, మత వర్గతత్వం, బ్రాహ్మణీయ హిందుత్వ ఫాసిజం.. ఇలా సనాతన ధర్మం, కులవ్యవస్థ, దోపిడీ రాజకీయార్థిక వ్యవస్థ, హిందుత్వ కలిసి ఫాసిజం ఎదిగిన తీరును బట్టబయలు చేస్తూ వచ్చింది.

రెండు దశాబ్దాల కాలంలో రెండు సార్లు నిషేధపు ఉత్తర్వులను అందుకోవడం వెనుక విరసం తాత్వికతలోనే వర్గ పోరాట పునాది పై బ్రాహ్మణీయ హిందుత్వతో తలపడాలనే అంశం ఇమిడి ఉంది. తాజా నిషేధం దీనినే సూచిస్తుంది.

విరసం నిషేధం వెనుక పాలక వర్గం కుట్రలను అర్థం చేసుకోకుంటే, దాని రూపాన్ని అవగాహన చేసుకోలేకపోతే విరసం, పాలక వర్గాల మధ్య సంవాదం వలె వుంటుంది. భావజాల సంఘర్షణలో విరసం పాత్రను ఇది తెలియజేస్తుంది. కానీ ఈ సంవాదాన్ని ఇంకా విశాలంగా చూడాలి. అప్పుడు ఈ నిషేదం విరసానికి సంబంధించిన వ్యవహారం కాదని తేలుతుంది. అంతిమంగా ఇది ప్రజాస్వామిక ఆకాంక్షలకు సంబంధించిన వ్యవహారం. భారతీయ జనతా పార్టీ పాలన దీనిని రుజువు చేసింది.

ఇది తెలంగాణ భౌగోళిక సరిహద్దుల నిషేదం మాత్రమే కాదు. పదహారు ప్రజా సంఘాలపై అణిచివేత మాత్రమే కాదు. ఇది ప్రజలపై అణిచివేత. ఈ అణిచివేతను కేవలం ఓట్లు రాజకీయాలలో మాత్రమే చూడకూడదు. భారతదేశ ప్రజాస్వామ్యం వర్గ, బ్రాహ్మణీయ హిందుత్వ పునాదిపై స్థిరంగా వున్నది. దీనిని కూలదోయక పోతే, కనీసం ప్రతిఘటన లేకుంటే విరసం మాత్రమే కాదు, మనుషులే నిషేధించ బడతారు. మానవ సంస్కృతే నిషేధింపబడుతుంది.





సంచిక - 375




తెనాలికి చెందిన పొట్టి పోలేశ్వరరావు గారి సహచరి పొట్టి దుర్గా హేమలత గారు 18.02.2021న గుండెపోటుతో మరణించారు. ఆమె జీవిత కాలము కమ్యూనిస్టు విలువల కోసం, సమాజం కోసం పరితపించారు. ఆమె స్మృతిలో పొట్టి పోలేశ్వరరావుగారు అరుణతారకు - రూ. 51,500/- విరాళంగా ఇచ్చారు. వీరికి కృతజ్ఞతలు, ఉద్యమాభినందనలు. - సం. (మార్చ్ 2021 సంచిక ప్రకటనకు సవరణతో)


**ఎడిటర్**
దువ్వూరి వెంకట రామక్రిష్ణారావు

**వర్కింగ్ ఎడిటర్**
పి. వరలక్ష్మి

**రచనలు పంపించాల్సిన చిరునామా :**
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు-516360.

* email : **arunatara1977@gmail. com**

**Like Page:**
//viplava rachayitala sangahm arunatara

**facebook :**
//viplava rachayitala sangahm virasam

Virasam website : **www. virasam. org**


చందాలు, విరాళాలు పంపవలసిన చిరునామా
అరసవిల్లి కృష్ణ, 6-1/16-7ఎ/1, పెద్దిరాజు స్ట్రీట్, ప్రైజర్‌పేట, విజయవాడ-520001.
చెక్‌లు / డ్రాఫ్టులు / ఆన్‌లైన్‌లో పంపడానికి
A. Krishna, Bank : State Bank of India, A/c. No. 52018355595, IFSC : SBIN0020714, Branch : Vagu Center, Vijaywada.

అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!

విడి సంచిక వెల - రు. 20; సంవత్సర చందా - రు. 240;
రెండు సంవత్సరాల చందా - రు. 450; మూడు సంవత్సరాల చందా - రు. 680;
ఐదు సంవత్సరాల చందా - రు. 1100; దశాబ్ది చందా - రు. 2200/-

**మనవి**

ఏప్రిల్ సంచిక చాలా హడావిడిగా తెచ్చినందు వల్ల అచ్చుతప్పులు ఎక్కువగా ఉన్నాయి. మార్చి30న వర్కింగ్ ఎడిటర్ ఇంటి మీద ఎన్ఐఏ దాడి చేసినప్పుడు లాప్‌టాప్, ఫోన్ తీసికెళ్లడంతో అప్పటికే రెడీగా ఉన్న సంచిక పోయింది. తిరిగి రచనలు సమకూర్చుకొని మొత్తం పని చేయాల్సి వచ్చింది. ముఖ్యంగా కన్‌వర్షన్‌లో వచ్చిన తప్పులు పూర్తి స్థాయిలో చూడలేకపోయాం. ఏప్రిల్ 11 సాహిత్య పాఠశాల కల్లా తేవాలనుకోవడం వల్ల ఈ సమస్య తలెత్తింది. అయితే సాఫ్ట్ కాపీలో తప్పులు సవరించాం. గమనించగలరు- సంపాదకవర్గం

**చందాదారులకు, పాఠకులకు మనవి**

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం విరసంతో సహా 16 ప్రజా సంఘాలను నిషేధించిన విషయం మీ దృష్టిలో ఉందని తలుస్తున్నాము. ఈ నిషేధం తొలగించాలని తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాం. నిషేధం ఎత్తివేత తరువాత మళ్ళీ తెలంగాణ పాఠకులకు, చందాదారులకు అరుణతార అందుబాటులోకి వస్తుంది. ఈ విషయాన్ని గమనించి సహకరిస్తారని ఆశిస్తున్నాం. ఇప్పుడు కేవలం ఆంధ్రప్రదేశ్‌కు పరిమితమై పత్రికను తీసుకువస్తున్నాం. - సంపాదకుడు

# ఈ సంచికలో



## వసంతమేఘం అంతర్జాల పత్రికలో..

# విరసంపై

# మళ్ళీ

# నిషేధం

నిషేధ ఉత్తర్వు:

# తెలంగాణ ప్రభుత్వం

## తెలంగాణ ప్రజా భద్రతా చట్టం, 1992 (యాక్ట్ నెం. 21, 1992) -సీపీఐ (మావోయిస్టు) 16 కొత్త అనుబంధ సంఘాలను చట్ట వ్యతిరేక సంస్థలుగా 30.03.2021 నుంచి ఒక ఏడాది పాటు ప్రకటించే ఉత్తర్వుల ప్రకటన సాధారణ పరిపాలన (ఎస్‌పిఎల్‌డి) విభాగం, జీవో ఎంఎస్: 73

డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్, తెలంగాణ, హైదరాబాద్, ఉత్తరం సి. నెం. 741\E6\TS-SIB (Int) ల 2019-21, తేదీ మార్చి 30,2021.

ఉత్తర్వు

ఈ కింది ప్రకటన తెలంగాణ గెజెట్ ప్రత్యేక సంచిక మార్చి 30, 2021లో ప్రచురించబడుతుంది.

నిషేధిత కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా (మావోయిస్ట్) (16) కొత్త అనుబంధ సంఘాలయిన తెలంగాణ ప్రజా ఫ్రంట్ (టిపిఎఫ్), తెలంగాణ అసంఘటిత కార్మిక సమాఖ్య (టిఎకెఎస్), తెలంగాణ విద్యార్థి వేదిక (టివివి), డెమోక్రటిక్ విద్యార్థి సంఘం (డిఎస్‌యూ), తెలంగాణ విద్యార్థి సంఘం (టివిఎస్), ఆదివాసీ విద్యార్థి యూనియన్ (ఎఎస్‌యు), రాజకీయ ఖైదీల విడుదల కమిటీ (సిఆర్‌పిపి), తెలంగాణ రైతాంగ సమితి (టిఆర్ఎస్), తుడుందెబ్బ (టిడి), ప్రజాకళామండలి (పికెఎం), తెలంగాణ డెమోక్రటిక్ ఫ్రంట్ (టిడిఎఫ్), హిందూ ఫాసిస్ట్ దాడుల వ్యతిరేక వేదిక (ఎఫ్ఎహెచ్ఎఫ్ఓ), పౌరహక్కుల సంఘం (సిఎల్‌సీ), అమరుల బంధుమిత్రుల సంఘం (ఎబిఎంఎస్), చైతన్య మహిళా సంఘం (సిఎంఎస్), విప్లవ రచయితల సంఘాలు (ఆర్‌డబ్ల్యూఏ) ఈ కింద పేర్కొన్న విధంగా హింసాత్మక చర్యలకు, బెదిరింపులు పాల్పడుతూ, హింసాత్మక చర్యలకుపాల్పడే వ్యక్తులను ప్రోత్సహిస్తూ, సహాయం చేస్తూ వున్నాయి, కనుక

1.రాజ్యానికి వ్యతిరేకంగా యుద్ధం చేసేందుకు, ఈ అనుబంధ సంస్థల కార్యకర్తలు గెరిల్లా ఎత్తు గడలను అనుసరిస్తూ, వారి వ్యూహం -ఎత్తుగడల డాక్యుమెంట్ ప్రకారం వివిధ కవర్‌లలో పట్టణ ప్రాంతాలలో సంచరిస్తున్నారు.

2.నూతన ఎత్తుగడలను అనుసరిస్తూ, ఇతర అనేక సంఘాలతో చేతులు కలిపి వారి కార్యక్రమాలను ఉధృతం జేస్తున్నారు. వారు వివిధ సమస్యలను వెలుగులోకి తెస్తూ, కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ప్రకటనలు జేసేలాగా, సమావేశాలు, ఊరేగింపులు నిర్వహించేలా రెచ్చగొడుతూ ఆ సంఘాల సభ్యులను తమ ప్రభావంలోకి తెచ్చుకుంటున్నారు.

3.ఈ అనుభంధ సంస్థల కార్యకర్తలు క్రమం తప్పకుండా మావోయిస్ట్ పార్టీ నాయకత్వంతో సంబంధాలు కలిగివున్నారు. ఛత్తీస్‌ఘఢ్ అటవీ ప్రాంతంలో కలుస్తున్నారు. సిపిఐ (మావోయిస్ట్) ఆదేశాల మేరకు వారు బంజరు భూముల సమస్యపై, విరసం వ్యవస్థాపకుడు పి.వరవర రావు, ప్రొ. జి. ఎన్. సాయిబాబా (తీవ్రవాద శిక్షపడిన ఖైదీ), రోనా విల్సన్ తదితర భీమా కోరేగావ్ కేసులో అరెస్టు చేయబడ్డ వివిధ అనుబంధ సంస్థల నాయకుల విడుదల డిమాండ్ చేయడంతో పాటు వివిధ అనుబంధ కార్యకర్తలపై అమలవుతోందని చెప్పబడుతున్న రాజ్యహింసకు వ్యతిరేకంగా, ఉపా చట్టం, వ్యవసాయ చట్టాలు, సిఏఏ, ఎన్ ఆర్ సిల రద్దు కోసం వివిధ నిరసన కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

4.ఈ అనుబంధ సంఘాల కార్యకర్తలు కొందరు చట్టబద్ధంగా ఏర్పడిన ప్రభుత్వాలకు వ్యతిరేకంగా యుద్ధం జేసేందుకు సీపీఐ (మావోయిస్టు) అజ్ఞాత కార్యకర్తలయ్యారు.

5. సీపీఐ (మావోయిస్టు) ఆదేశాల ప్రకారం పైన పేర్కొన్న 16 సంఘాల ఉద్దేశ్యాలు, లక్ష్యాలు, సభ్యుల ఏర్పాటు జరిగాయి.

2. అందువల్ల పైన పేర్కొన్న కారణాలవల్ల తెలంగాణ ప్రజా ఫ్రంట్ (టిపిఎఫ్), తెలంగాణ అసంఘటిత కార్మిక సమాఖ్య (టిఎకెఎస్), తెలంగాణ విద్యార్థి వేదిక (టివివి), డెమోక్రటిక్ విద్యార్థి సంఘం (డిఎస్‌యూ), తెలంగాణ విద్యార్థి సంఘం (టివిఎస్), ఆదివాసీ విద్యార్థి యూనియన్ (ఎఎస్‌యు), రాజకీయ ఖైదీల విడుదల కమిటీ (సిఆర్‌పిపి), తెలంగాణ రైతాంగ సమితి (టిఆర్ఎస్), తుడుందెబ్బ (టిడి), ప్రజాకళామండలి (పికెఎం), తెలంగాణ డెమోక్రటిక్ ఫ్రంట్ (టిడిఎఫ్), హిందూ ఫాసిస్ట్ దాడుల వ్యతిరేక వేదిక (ఎఫ్ఎహెచ్ఎఫ్ఓ), పౌరహక్కుల సంఘం (సిఎల్‌సీ), అమరుల బంధుమిత్రుల సంఘం (ఎబిఎంఎస్), చైతన్య మహిళా సంఘం (సిఎంఎస్), విప్లవ రచయితల సంఘాలు (ఆర్‌డబ్ల్యూఏ) ప్రభుత్వ పాలనలో, లేక ఈ సమూహానికి అవసరమైన నిత్యావసరాల నిర్వహణ, నరవరాలలో, చట్టపాలనలో జోక్యం కలిగించుకోవడం, శాంతి భద్రతల నిర్వహణకు భంగం కల్గించడం లక్ష్యంగా వుందడం వల్ల, ప్రజల శాంతి భద్రతలకు ప్రమాదం వుండటం వల్ల పైన పేర్కొన్న సంస్థలను చట్టవ్యతిరేక సంఘాలుగా ప్రకటించాల్సిన అవసరం ఏర్పడింది.

3. కనుక తెలంగాణ ప్రజా ఫ్రంట్ (టిపిఎఫ్), తెలంగాణ అసంఘటిత కార్మిక సమాఖ్య (టిఎకెఎస్), తెలంగాణ విద్యార్థి వేదిక (టివివి), డెమోక్రటిక్ విద్యార్థి సంఘం (డిఎస్‌యూ), తెలంగాణ విద్యార్థి సంఘం (టివిఎస్), ఆదివాసీ విద్యార్థి యూనియన్ (ఎఎస్‌యు), రాజకీయ ఖైదీల విడుదల కమిటీ (సిఆర్‌పిపి), తెలంగాణ రైతాంగ సమితి (టిఆర్ఎస్), తుడుందెబ్బ (టిడి), ప్రజాకళామండలి (పికెఎం), తెలంగాణ డెమోక్రటిక్ ఫ్రంట్ (టిడిఎఫ్), హిందూ ఫాసిస్ట్ దాడుల వ్యతిరేక వేదిక (ఎఫ్ఎహెచ్ఎఫ్ఓ), పౌరహక్కుల సంఘం (సిఎల్‌సీ), అమరుల బంధుమిత్రుల సంఘం (ఎబిఎంఎస్), చైతన్య మహిళా సంఘం (సిఎంఎస్), విప్లవ రచయితల సంఘాలు (ఆర్‌డబ్ల్యూఏ) ల చట్టవ్యతిరేక కార్యకలాపాల వల్ల, నేటి నుండి పైసంఘాలను చట్టవ్యతిరేక సంఘాలనే అభిప్రాయానికి ప్రభుత్వం వచ్చింది.

4. అందువల్ల 1. తెలంగాణ ప్రజా ఫ్రంట్ (టిపిఎఫ్), 2.

# ఇది అనాగరికం

ప్రియమైన శ్రీ చంద్రశేఖర్ రావు గారు, మీరు వేగంగా కోలుకుంటున్నారని నమ్ముతున్నాను.

సార్,

మీ ప్రభుత్వం పదహారు ప్రజాస్వామ్య సంస్థలను చట్టవిరుద్ధమని ప్రకటించడం అనాగరికమైనది. ఇది నిజంగా మాకు షాక్ లాంటిది. పూర్వం ఎపిసిఎల్‌సి, ప్రస్తుతం సివిల్ లిబర్టీస్ సంస్థ కూడా ఇందులో ఉంది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ సమయంలో మీరు ఈ సంస్థను ఉద్దేశించి ప్రసంగించారని మీకు గుర్తు ఉండే ఉంటుంది. తెలంగాణ రాష్ట్రం ఏర్పడటంలో భాగంగా చేసే ఉద్యమంలో హక్కుల సంఘం భాగం కావాలని మీరు పిలుపు నిచ్చారు. అటువంటి సంస్థ ఎలా చట్టవిరుద్ధం అవుతుంది? ఇది దాదాపు ఐదు దశాబ్దాలుగా ప్రజాస్వామ్య హక్కుల కోసం పోరాడుతోంది. ఈ పదహారు సంస్థలన్నీ గత మూడు, నాలుగు దశాబ్దాలుగా రాజ్యాంగ చట్రంలో భాగంగానే బహిరంగంగా పనిచేస్తున్నాయి. ప్రతి సంస్థకు దాని స్వంత చట్ట బద్ధమైన లక్ష్యం వుంది. అది వారి ప్రజా కార్యకలాపాలను కొనసాగిస్తుంది. ఈ సంస్థలలో ప్రతి ఒక్కటి ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్నాయి. తెలంగాణ ఉద్యమ సమయంలో మీరు సదరు సంస్థ నాయకులతో చాలా మందితో సంభాషించేవారు. ఈ సంస్థలో వున్న అందరి సభ్యులు ఉన్నత మానవ విలువలకు నిలబడతారు. అవి తెలంగాణ సమాజంలో నైతిక విలువలను పెంపొందిస్తారు.

కరోనా కారణంగా గత ఒక సంవత్సరం ఏ సంస్థ కూడా దాని కార్యకలాపాలను నిర్వహించలేదు. గత ఆరు నుండి ఏడు సంవత్సరాలలో, తెలంగాణలో మావోయిస్టుల వైపు నుండి ఎటువంటి చర్యలు లేవు. సాపేక్ష శాంతి ఉంది. అణచివేత చట్టాలను ఉపసంహరించుకోవడానికి, ఈ సంస్థలను చట్టవిరుద్ధంగా ప్రకటించడానికి ఈ దశలో, ఈ సమయంలో రాష్ట్ర ప్రభుత్వాన్ని ప్రేరేపించినది ఏమిటి? ఇది చాలా బాధ కలిగించే అంశం.

ఇది ప్రజాస్వామ్య వ్యవస్థ అని, రాజ్యాంగ చట్టం ద్వారా పాలించబడుతుందని ప్రభుత్వాలు పేర్కొన్నాయి. ఈ రాజ్యాంగం పౌరులకు అనేక ప్రజాస్వామ్య హక్కులను హామీ ఇచ్చింది. ఆ చట్టపరమైన ప్రమాణాలు, నిబంధనలకు ప్రభుత్వం కట్టుబడి ఉండాలి. మానవ హక్కుల సార్వత్రిక ప్రకటన, దాని ఉపోద్ఘాతంలో అణచివేత ఎల్లప్పుడూ తిరుగుబాటుకు దారితీస్తుందని గట్టిగా చెబుతుంది. మానవ చరిత్ర ఎక్కువగా ఇటువంటి సందర్భాలతోనే నిండి ఉంది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం అటువంటి సుదీర్ఘ అణచివేతలో భాగంగానే పోరాట రూపాన్ని సంతరించుకుంది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాన్ని మావోయిస్టు ఉద్యమంగా పిలవడానికి ప్రయత్నించింది. ఇప్పుడు చట్టవిరుద్ధమని ప్రకటించిన అన్ని సంస్థలు అప్పుడు చురుగ్గా పాల్గొన్నాయి. ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి వీరంతా ఉత్సాహభరితమైన మద్దతుదారులు. తెలంగాణ ప్రజలు స్వేచ్ఛాయుతమైన, ప్రజాస్వామ్య వాతావరణాన్ని కోరుకున్నారు. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో ప్రజలు ఇంత పెద్ద సంఖ్యలో పాల్గొనడానికి ఇది ఒక కారణం. దాదాపు ఒక దశాబ్దం పాటు శాంతి కోసం పనిచేసిన శాంతి కమిటీ సమావేశాలలో, బంతిని బలవంతంగా విసిరితే, అది సమాన శక్తితో తిరిగి బౌన్స్ అవుతుందని మీరు పేర్కొన్నారు. ఒక ఉద్యమానికి నాయకత్వం వహించిన తరువాత మీరు ప్రజాస్వామ్య పోరాటాల విలువను అర్థం చేసుకుని గౌరవించాలని మేము ఆశిస్తున్నాము.

ఈ ప్రజాస్వామ్య ఉద్యమాల సుదీర్ఘ చరిత్రను చూసిన తర్వాత, ఈ సంస్థలను చట్టవిరుద్ధం అని మీరు ప్రకటించడమంటే తెలంగాణ ఉద్యమం సాధించుకున్న ప్రజాస్వామ్య విలువలను తిరస్కరించడమే. ఈ అప్రజాస్వామిక రాజ్యాంగ విరుద్ధమైన జీవో 73 ను ఉపసంహరించుకోవాలని మేము మిమ్మల్ని కోరుతున్నాము. దయచేసి తెలంగాణ ప్రజలు ఆశిస్తున్న ప్రజాస్వామ్య వాతావరణాన్ని కాపాడవలసిందిగా కోరుతున్నాము.

మీ భవదీయుడు,

**ప్రొఫెసర్ జి. హరగోపాల్**

కన్వీనర్,

నిర్బంధ వ్యతిరేక వేదిక

8 - 284 / OU / 263,

O.U. కాలనీ,

షేక్‌పేట,

హైదరాబాద్ -500008.

---

తెలంగాణ అసంఘటిత కార్మిక సమాఖ్య (టిఎకెఎస్), 3. తెలంగాణ విద్యార్థి వేదిక (టివివి), 4. డెమోక్రటిక్ విద్యార్థి సంఘం (డిఎస్‌యూ), 5. తెలంగాణ విద్యార్థి సంఘం (టివిఎస్), 6. ఆదివాసీ విద్యార్థి యూనియన్ (ఎఎస్‌యు), 7. రాజకీయ ఖైదీల విడుదల కమిటీ (సిఆర్‌పిపి), 8. తెలంగాణ రైతాంగ సమితి (టిఆర్‌ఎస్), 9. తుడుందెబ్బ (టిడి), 10. ప్రజాకళామండలి (పికెఎం), 11. తెలంగాణ డెమోక్రటిక్ ఫ్రంట్ (టిడిఎఫ్), 12. హిందూ ఫాసిస్ట్ దాడుల వ్యతిరేక వేదిక (ఎఫ్ఎహెచ్ఎఫ్ఎ), 13. పౌరహక్కుల సంఘం (సిఎల్‌సి), 14. అమరుల బంధుమిత్రుల సంఘం (ఎబిఎంఎస్), 15. చైతన్య మహిళా సంఘం (సిఎంఎస్), 16. విప్లవ రచయితల సంఘం (ఆర్‌డబ్ల్యూఎ) లను తెలంగాణ ప్రజా రక్షణ చట్టంలోని సెక్షన్ 3 సబ్-సెక్షన్ (1), (4) ఇచ్చిన అధికారాలతో 33 జిల్లాలతో కూడిన తెలంగాణ రాష్ట్రంలో చట్టవ్యతిరేకమైనవని తెలంగాణ ప్రభుత్వం ప్రకటిస్తున్నది.

(తెలంగాణ రాష్ట్ర గవర్నర్ ఆదేశాలతో)

సోమేశ్‌కుమార్,

ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి



# ఈ నిషేధం రాజ్యాంగ వ్యతిరేకం

## విరసం తదితర 16 ప్రజా సంఘాలపై తెలంగాణ ప్రభుత్వ నిషేధ ఉత్తర్వులను వ్యతిరేకించండి

విప్లవ రచయితల సంఘం సహా 16 ప్రజా సంఘాలను చట్టవ్యతిరేక సంస్థలుగా తెలంగాణ ప్రభుత్వం ప్రకటించడాన్ని తీవ్రంగా ఖండిస్తున్నాం. రాజ్యాంగంలోని భావ ప్రకటనా స్వేచ్ఛకు, రాజకీయ స్వేచ్ఛకు, సంఘం పెట్టుకొనే హక్కుకు వ్యతిరేకంగా తెలంగాణ ప్రభుత్వం ఈ నిర్ణయం తీసుకున్నది. రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకమైన ఈ జీవో ప్రభుత్వ పాలనా పద్ధతులకు కూడా పూర్తి వ్యతిరేకంగా వెలుగులోకి వచ్చింది. జీవో ఎంఎస్ 73 పేరుతో మార్చి 30న ఈ ఉత్తర్వులను తయారు చేశారు. ఏప్రిల్ 23న పత్రికలకు విడుదల చేశారు. ప్రజాస్వామ్యంలో జీవోలు తయారైన కొద్ది గంటల్లోనే ప్రజలకు బహిరంగపరచాలి. ఈ పారదర్శకతను తెలంగాణ ప్రభుత్వం పాటించలేదు. ఇది పాలనా సూత్రాలకు పూర్తి విరుద్ధం. అంతే కాదు, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి సంతకం లేకుండానే ఆయన పేరు మీద దీన్ని విడుదల చేశారు. తెలంగాణ ప్రజాభద్రతా చట్టం -1992 ప్రకారం ఈ సంస్థలను చట్ట వ్యతిరేక సంస్థలుగా ప్రకటిస్తున్నానని చెప్పుకున్న ప్రభుత్వం ఆ చట్టం ప్రకారమే పాటించాల్సిన పద్ధతులను ఉల్లంఘించింది. చట్ట వ్యతిరేక సంస్థలుగా ఎందుకు ప్రకటించదల్చుకున్నదీ ముందు ఆ సంఘాల బాధ్యులకు తెలియజేయాలి. ప్రభుత్వ ఆరోపణలపై ఆ సంస్థలు తమ వాదనలను, అభ్యంతరాలను వినిపించడానికి ఒక విచారణ కమిటీని హైకోర్టు న్యాయమూర్తులతో ఏర్పాటు చేయాలి. అక్కడ వాదోపవాదాలు జరిగాక ఆ కమిటీ నిర్ధారిస్తేనే చట్టవ్యతిరేక సంస్థలవుతాయి. నిషేధం అమలులోకి వస్తుంది. ఈ మొత్తానికి చట్టం ప్రకారమే మూడు నెలల గడువు ఉంది.

అంతేగాని ప్రభువులవారికి కోపం వచ్చినంత మాత్రాన ప్రజా సంఘాలు చట్ట వ్యతిరేక సంస్థలైపోవు. దశాబ్దాలుగా ప్రజా జీవిత ఉన్నతీకరణకు పని చేస్తున్న సంస్థల కార్యకలాపాలు నేరమైపోవు. దొరవారు తమకు ఇష్టం లేని ఆలోచనలను అణచివేయడానికి చట్టాన్ని అడ్డం పెట్టుకుంటామంటే ప్రజాస్వామ్యంలో కుదరదు. సమాజం మీద నిరంకుశ పెత్తనాన్ని చెలాయించడానికి భిన్నాభిప్రాయాలు గల సంస్థలను చట్టవ్యతిరేకమని అనడం రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకం. ప్రజలందరూ ప్రభుత్వ అభిప్రాయాలకు లోబడి ఉండాలని, వేరే ఆలోచన ఏదీ చేయడానికి వీల్లేదని అంటే భారత రాజ్యాంగం అంగీకరించదు. ప్రభుత్వ విధానాల మీద విమర్శనాత్మకంగా ఉండటానికి, ప్రభుత్వ ఆలోచనలకు భిన్నమైన ఆలోచనలు చేయడానికి, ప్రచారం చేసుకోడానికి భారత రాజ్యాంగం పూర్తి అవకాశం ఇచ్చింది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం మీద విమర్శనాత్మకంగా ఉండటం భావ ప్రకటనా స్వేచ్ఛలో భాగం. విరసం సహా 16 సంఘాల మీద తెలంగాణ ప్రభుత్వం చేసిన ఆరోపణలు చట్ట వ్యతిరేకమని న్యాయ విచారణలో తేలాల్సి ఉంది. కానీ ఈ ప్రక్రియలో ప్రభుత్వం పూర్తి చట్ట వ్యతిరేకంగా ప్రవర్తించిందని మేం చెప్పదల్చుకున్నాం.

ఈ ఉత్తర్వుల్లో ప్రభుత్వం ప్రజాసంఘాల మీద 5 ఆరోపణలు చేసింది. సీపీఐ మావోయిస్టు వ్యూహం ఎత్తుగల ప్రకారం ప్రభుత్వ వ్యతిరేకంగా అర్బన్ గెరిల్లా చర్యలకు అనుబంధంగా ఈ సంస్థలు పని చేస్తున్నాయని చేసిన ఆరోపణ పూర్తి అబద్ధం. ఇదొక నిరాధార అసంబద్ధ ప్రచారం. విరసం సీనియర్ సభ్యులు, ప్రముఖ సాహిత్యకారులు వరవరరావు, ప్రొ. జిఎన్. సాయిబాబ విడుదల కోసం పని చేయడాన్ని కూడా చట్ట వ్యతిరేకంగా ఈ జీవోలో పేర్కొన్నారు. వీరిద్దరి విషయంలోనే కాదు, భీమా కోరేగావ్ కేసులోని ఇతర మేధావులపైన, సీఏఏ, ఎన్ఆర్‌సీలను వ్యతిరేకిస్తూ ఉద్యమించినవారిపైన ఉపా కేసులు ఎత్తివేయాలని కోరుకోవడం కూడా చట్టవ్యతిరేక కార్యకలాపాలుగా ఈ జీవో ఆరోపించింది. ఎవరి మీద ఎలాంటి ఆరోపణలు ఉన్నాసరే బెయిల్ కోరుకోడం, దాని కోసం ఉద్యమించడం చట్టబద్ధమైన హక్కు. వాళ్లు విడుదల అయ్యేదీ లేనిదీ న్యాయ ప్రక్రియలో తేలుతుంది. పౌరులకు ఉన్న ఈ చట్ట పరమైన అవకాశాలను నేరమని ఆపాదించడం చట్టవ్యతికం. ప్రభుత్వం చేసిన ఉపాలాంటి ప్రజాస్వామ్య వ్యతిరేక చట్టాలను రద్దు చేయాలని కోరుకోవడం రాజ్యాంగ ఇచ్చిన హక్కు. ఇది ఎంత మాత్రం చట్టవ్యతిరేకం కానే కాదు.

ఇలాంటి ఆరోపణలతో విడుదల చేసిన ఈ ఉత్తర్వులు చెల్లవని మేం ప్రకటిస్తున్నాం. తన రాజకీయ తాత్విక విశ్వాసాల కోసం సాహిత్య కళా మేధో రంగాల్లో విరసం పని చేస్తున్నది. సరిగ్గా 15 ఏళ్ల కింద అప్పటి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోని వైఎస్ రాజశేఖరరెడ్డి ప్రభుత్వం ఏపీ పబ్లిక్ సెక్యూరిటీ యాక్ట్ ప్రకారం విరసాన్ని నిషేధించింది. అయితే అప్పుడు ప్రభుత్వం న్యాయ సలహా మండలిని ఏర్పాటు చేసింది. విరసం అక్కడ తన మీద ప్రభుత్వం చేసిన ఆరోపణలకు సహేతుక వాదనలు వినిపించింది. ప్రభుత్వం తన వాదనలకు కనీస సాక్ష్యాధారాలు చూపుకోలేకపోయింది. అబద్ధాలకు ఆధారాలు ఎక్కడ ఉంటాయి? ప్రభుత్వం ఓడిపోయింది. విరసం విజయం సాధించింది. మూడు నెలలకల్లా నిషేధ ఉత్తర్వులు వీగిపోయాయి.

మళ్లీ రెండోసారి తెలంగాణ ప్రభుత్వం ఈ ఉత్తర్వులు తీసుకొచ్చింది. ఇది ఈ ప్రభుత్వ దుర్మార్గ, చట్ట వ్యతిరేక, రాజ్యాంగ వ్యతిరేక స్వభావాన్ని తెలియజేస్తున్నది. విరసం తాను ఎంచుకున్న సాహిత్య భావజాల రంగాల్లో ప్రజల పక్షాన, ప్రగతి కోసం చేస్తున్న కార్యాచరణ ప్రభువులకు చిరాకు తెప్పిస్తోంది. భయానికి లోను

# మనం నాలుగు గోడల మధ్యనే ఉండి పోదామా? మనం కొత్త నిరసనల గోడలను నిర్మించొద్దా?

కామ్రేడ్స్,మిత్రులారా! ఎర్రెర్రని మేడే వందనాలు!

పశ్చిమ బెంగాల్లో మరో ఐదేళ్ల పాటు ఏ పార్టీ అధికారంలోకి రాబోతుందో రేపు స్పష్టమవుతుంది. ప్రభుత్వం మారినా, మారకపోయినా ఫాసిస్టు ప్రమాదానికి విరామం ఉండబోదు. తాజా ఉదాహరణగా, ఒక వారం క్రితం బీజేపీయేతర తెలంగాణ ప్రభుత్వ నిర్ణయాన్ని పేర్కొనవచ్చు. మావోయిస్టులకు బహిరంగంగా, చురుకుగా మద్దతిస్తున్నారనే ఆరోపణపై గత నెల 23న తెలంగాణ ప్రభుత్వం 16 ప్రజాస్వామిక సంస్థలపై నిషేధం విధించింది.

ఆ సంస్థల జాబితా : 1) విప్లవ రచయితల సంఘం (విరసం), 2) ప్రజా కళా మండలి, 3) తెలంగాణ ప్రజా ఫ్రంట్, 4) తెలంగాణ అసంఘటిత కార్మిక సమాఖ్య, 5) తెలంగాణ విద్యార్థి వేదిక, 6) డెమోక్రటిక్ స్టూడెంట్స్ ఆర్గనైజేషన్, 7) తెలంగాణ విద్యార్థి సంఘం, 8) ఆదివాసీ స్టూడెంట్స్ యూనియన్, 9) రాజకీయ ఖైదీల విడుదల కమిటీ, 10) తెలంగాణ రైతాంగ సమితి, 11) తుడుం దెబ్బ, 12) తెలంగాణ డెమోక్రటిక్ ఫ్రంట్, 13) హిందూ ఫాసిస్టు వ్యతిరేక వేదిక, 14) పౌర హక్కుల సంఘం, 15) చైతన్య మహిళా సంఘం, 16) అమరుల బంధుమిత్రుల సంఘం

పై అన్ని 16 సంస్థలకు ఒక సుదీర్ఘమైన, ఘన చరిత్ర ఉంది. కొన్ని సంస్థలు వాటి రంగాల్లో అర్ధ శతాబ్దం పాటు భూస్వామ్యానికి, ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడుతున్నాయి. అటువంటి రెండు సంస్థల గురించి మాత్రం ఇక్కడ పేర్కొంటున్నాము.

1. విప్లవ రచయితల సంఘం : విరసంగా ప్రసిద్ధికెక్కిన ఈ సంఘం 1970లో స్థాపించబడి,మహాకవి శ్రీశ్రీ, కె.వి.రమణారెడ్డి, చెరబండరాజు, రావిశాస్త్రి, కొడవటిగంటి కుటుంబరావు, చలసాని ప్రసాద్, వరవరరావు లాంటి తెలుగు సాహిత్య దిగ్గజాలతో ప్రారంభమై ఎందరో తెలుగు సాహిత్యకారులు పనిచేస్తున్న ఒక దీర్ఘకాలిక సంస్థ.

2) అమరుల బంధుమిత్రుల సంఘం: ఇది రాజ్యం అనేక ఆటుపోట్లను తట్టుకుంటూ బూటకపు ఎన్‌కౌంటర్లలో, పోలీసు కస్టడీల్లో మరణించిన అమరుల శరీరాలను స్వాధీనపరచుకొని, వారికి గౌరవప్రదంగా అంత్యక్రియలు నిర్వహించే అమరుల బంధుమిత్రుల పోరాట సంఘం.

తృణమూల్ కాంగ్రెసో, బిజెపినో ఏది రేపు అధికారంలోకి వచ్చినా, మన లాంటి వారందరమూ రాబోయే ప్రభుత్వాలకు టార్గెట్ గానే ఉంటామని తెలంగాణా పరిణామాలు హెచ్చరిస్తున్నాయి. మిత్రులారా,మరి మన కార్యాచరణ ఏమిటి? మనం నాలుగ్గోడలకే పరిమితమై ఉందామా? లేక మన ధైర్యాన్ని కూడదీసుకొని నిరసన గోడలై లేద్దామా?

ఈ సందర్భంగా మేము రచయితలు, కవులు, నాటక రచయితలు, కళాకారులు, సంపాదకులు అవీ ఏమిటీ ప్రజాస్వామిక దృక్పథం ఉన్న ప్రతి ఒక్కరినీ ప్రజాసంఘాలపై తెలంగాణ ప్రభుత్వ నిషేధానికి వ్యతిరేకంగా ఏకమై, ప్రజల గొంతు నొక్కి వేసే, విమర్శలను అణచివేసే ఫాసిస్టు, నిరంకుశ ప్రభుత్వ చర్యలను ధిక్కరిస్తూ ఒక శక్తివంతమైన ప్రజా నిరసనల రక్షక కుడ్యాన్ని నిర్మించమని కోరుతున్నాం.

రిలీజ్ ద పోయెట్ ఉద్యమం తరపున
సవ్యసాచి దేవ్
కృష్ణ బందోపాధ్యాయ్
స్వపన్‌దా సాధికారి
రాహుల్ పురకాయెస్తో
సుద్ధవ్రత దేవ్

మే 1, 2021

చేస్తోంది. ఇది మౌలికంగా సాహిత్యానికి ఉన్న సృజనాత్మక శక్తికి నిదర్శనం. రాజ్యం పదే పదే నిషేధపు ఉత్తర్వులను సిద్ధం చేసుకోవాల్సి రావడం విప్లవ రచయితల విశ్లేషణ పటిమకు రుజువు. రచయితలు ప్రజా జీవితంలో ఉంటే రాజ్యపు క్రూర స్వభావం బట్టబయలవుతూ ఉంటుంది. సాహిత్య రచన అంటేనే భావజాల, సాంస్కృతిక పోరాటం. ఆధిపత్య, హింసాత్మక, దోపిడీ భావజాలాన్ని ప్రశ్నించమనే చైతన్యాన్ని ఇది ప్రజలకు అందిస్తుంది. అందుకు పదే పదే రాజ్యం విరసం మీద కన్నెర్ర చేస్తోంది.

రెండోసారి వచ్చిన ఈ నిషేధ ఉత్తర్వులను కూడా మేం తప్పక ప్రజలు, ప్రగతిశీల మేధావులు, రచయితల మద్దతుతో ఎదుర్కొంటాం. ఒక్క విరసమే కాదు, దశాబ్దాలుగా ప్రజా జీవితంలోని వేర్వేరు జీవన పార్శ్వాల్లో నిబద్ధంగా పని చేస్తున్న మిగతా ప్రజా సంఘాలు కూడా ఈ అప్రజాస్వామిక ఉత్తర్వుల చీకట్ల నుంచి తేజోవంతంగా, మరింత వెలుగులీనుతూ జనం మధ్యకు త్వరలోనే వస్తాయని నమ్ముతున్నాం. ఈ ఉత్తర్వుల్లోని ఆరోపణలు ఎంత ప్రమాదకరమో ఆలోచించమని సమాజానికి విజ్ఞప్తి చేస్తున్నాం. ఈ దురుద్దేశపూరిత, కుట్రపూరిత చట్టవ్యతిరేక ప్రభుత్వ చర్యలను ఖండించాలని అందరినీ కోరుతున్నాం.

అరసవెల్లి క్రిష్ణ (అధ్యక్షుడు) బాసిత్ (ఉపాధ్యక్షుడు)
రివేరా (సహాయ కార్యదర్శి)
కార్యవర్గ సభ్యులు
పి. చిన్నయ్య, ఉజ్వల్, రాంకి, రాము, పాణి, వరలక్ష్మి
సీనియర్ సభ్యులు
క్రిష్ణాబాయి, సిఎస్ఆర్ ప్రసాద్, జి. కళ్యాణరావు,
రత్నమాల, వి. చెంచయ్య, నల్లూరి రుక్మిణి



# తెలంగాణ ప్రభుత్వ నిషేధ ఉత్తర్వులపై విరసం అభ్యంతర పత్రం

**5.5.2021**

టు
సోమేష్‌కుమార్,
ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి,
తెలంగాణ ప్రభుత్వం,
హైదరాబాదు.

ఫ్రం
అరసవెల్లి క్రిష్ణ
అధ్యక్షుడు
విప్లవ రచయితల సంఘం
6-1-౮16-7ఎ౮1
పెద్దిరాజు స్ట్రీట్
ప్రైజర్ పేట
విజయవాడ-520001

**విషయం: జీవో ఎంస్ నెం. 73, తేదీ 30.3.2021, జనరల్ అడ్మినిస్ట్రేషన్ (ఎస్‌పిఎల్‌డి) శాఖ-తెలంగాణ ప్రజా భద్రతా చట్టం-1992-విప్లవ రచయితల సంఘాన్ని చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించడం, దానిపై విరసం అభ్యంతరం, సమాధానం.**

**రెఫరెన్స్: 1. దిన పత్రికలకు 23.4.2021నాడు ప్రభుత్వం విడుదల చేసిన జీవో ఎంస్ 73**

**2. ఆంధ్రజ్యోతి దిన పత్రిక, తేదీ: 24.4.2021, పేజీలు 1, 11**

**3. తెలంగాణ ప్రజా భద్రతా చట్టం, 1992**

పైన ఉదహరించిన రెఫరెన్స్ 3 ప్రకారం ప్రభుత్వం ఒక సంస్థను చట్ట వ్యతిరేకమని పత్రికల్లో ప్రకటన జారీ చేసిన 15 రోజుల్లోగా సంబంధిత సంస్థ తన వాదనను ప్రభుత్వానికి వినిపించే హక్కు ఉన్నది. దీన్ని వినియోగించుకుంటూ విప్లవ రచయితల సంఘం (విరసం) తన వాదనను జీవో ఎంస్ 73లో చేసిన ఆరోపణలపై ప్రభుత్వానికి వివరణ ఇస్తున్నది.

రెఫరెన్స్ 1లో విరసాన్ని చట్ట వ్యతిరేక సంస్థగా గుర్తించడానికి 5 ఆరోపణలు చేశారు. వీటి ఆధారంగా విరసం చట్ట వ్యతిరేక సంస్థ అనే ఉత్తర్వులను విడుదల చేశారు. ఈ ఐదు ఆరోపణలు పూర్తి సత్యదూరం. అవి పూర్తి నిరాధారమైనవి. వాటి ద్వారా విరసం చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించడం అసమంజసం. విరసం పూర్తిగా భారత రాజ్యాంగం కల్పించిన చట్టబద్ధ అవకాశాలన్నీ వాడుకొని, వాటికి లోబడి పని చేసే సంస్థ. కాబట్టి జీవో ఎంఎస్ 73లోని ఆరోపణలు రాజ్యాంగంలోని అధికరణం 19లో పేర్కొన్న భావ ప్రకటనా స్వేచ్ఛకు, వాక్ సభా స్వాతంత్ర్యాలకు, సంస్థా నిర్మాణ స్వేచ్ఛకు భంగకరమని విరసం అభిప్రాయపడుతోంది. విరసం కార్యక్షేత్రమైన సాహిత్య మేధోరంగాల్లో భావ ప్రకటనకు కీలక స్థానం ఉంది. సాహిత్య రచన అంటే భావ ప్రకటనే. సమాజం గురించి, జీవితం గురించి రచయితలు తమ అభిప్రాయాలను కళాత్మకంగా వ్యక్తీకరిస్తారు. భావాల వినిమయానికి, రచయితలు సంఘం పెట్టుకోడానికి, సమావేశాలు నిర్వహించుకోడానికి సాహిత్య రంగంలో చాలా ప్రాధాన్యత ఉంది. రాజ్యాంగంలోని 19వ అధికరణానికి చాలా దగ్గరి విషయాలివి. రాజ్యాంగబద్ధంగా నడవ వలసిన తెలంగాణ ప్రభుత్వానికి విరసాన్ని నిరాధార ఆరోపణలతో నిషేధించే హక్కు లేదు.

విప్లవ రచయితల సంఘాన్ని 1970 జూలై 4న శ్రీశ్రీ, కొడవటిగంటి కుటుంబరావు, రావిశాస్త్రి, కెవి రమణారెడ్డిలాంటి సుప్రసిద్ధ తెలుగు రచయితలు ఏర్పాటు చేశారు. అప్పటికి సీపీఐ (మావోయిస్టు) ఉనికిలోనే లేదు. 2005లో ఆ పార్టీ ఏర్పడింది. అంతక ముందు ముప్పై అయిదేళ్ల కింద ఏర్పడ్డ విరసం ఆ పార్టీకి అనుబంధ సంస్థ అని ప్రచారం చేయడం పూర్తి వాస్తవ విరుద్ధం. ఇందులో ఏ మాత్రం హేతుబద్ధత లేదు. విరసం ఏర్పడ్డప్పటి నుంచి తెలుగు సాహిత్య సాంస్కృతిక రంగాల్లో బహిరంగంగా పని చేస్తున్న స్వతంత్ర సంస్థ. విరసానికి ఏ రాజకీయ పార్టీతోను నిర్మాణపరమైన సంబంధాలు లేవు. విరసం నిర్మాణం, సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలు తన సభ్యుల ఆమోదం మేరకు, సంస్థ ప్రణాళిక-నిబంధనావళికి లోబడి మాత్రమే జరుగుతాయి. హింసాత్మక చర్యలకు పాల్పడే వ్యక్తులను ప్రోత్సహించడం, సహాయం చేయడం, హింసకు-బెదిరింపులకు పాల్పడటం వంటి ఆరోపణలు విరసం మీద ప్రభుత్వం చేసింది. విరసం నిర్వహించే కార్యకలాపాల్లో ఇవి ఉండవు. హింసను విరసం ప్రోత్సహించదు, సరికదా మానవ జీవితంలో హింస ఎక్కడ ఏ రూపంలో ఉన్నా విమర్శిస్తుంది. స్వేచ్ఛ, ఆత్మగౌరవం పరిపూర్ణంగా ఉంటూ, హింస లేనప్పుడే మానవ జీవితానికి నిండైన అర్థం సమకూరుతుందని విరసం విశ్వాసం. సాహిత్యం ఏ హింసా ఘటనను సమర్థించదు. హింస అమలు కావడానికి మూలాలను అన్వేషించి కారణాలను విశ్లేషిస్తుంది. చిత్రిస్తుంది. హింస, దౌర్జన్యాలు అనాగరిక దశకు చెందినవని, చట్టబద్ధ ప్రజాస్వామ్యంలో హింస ఉండకూడదని భావిస్తుంది. హింసా మూలాలను మార్చకుండా హింస లేని సమాజం ఏర్పడ్డం సాధ్యం కాదని అభిప్రాయపడుతుంది. హింస లేని సమాజం నెలకొనడానికి ప్రజల్లో సాంస్కృతిక చైతన్యాన్ని పెంచడానికి సాహిత్యాన్ని కళలను సాధనం చేసుకుంది. హింసకు పాల్పడటం, బెదిరింపులకు దిగడం విరసం అవగాహనకు విరుద్ధం. గత యాభై ఏళ్లుగా మేం సమాజంలో హింస, దౌర్జన్యాలు, బెదిరింపులు ఉండకూడదనే సాహిత్యం రాస్తున్నాం. దళితులపై అగ్రకులాల వారు, స్త్రీలపై పురుషులు, ఆదివాసులపై నాగరికులమనుకొనే వారు, పిల్లలపై పెద్దలు, ఆర్థికంగా బలహీనులపై బలవంతులు, ప్రజలపై ప్రభుత్వం, రాజ్యం హింసకు పాల్పడకూడదని మా తాత్విక విశ్వాసం. ప్రపంచ సాహిత్య చరిత్రలోనే

హింసను ప్రేరేపించేలా రచన చేసిన ప్రగతిశీల సాహిత్యకారులు ఒక్కరు లేరు. సాహిత్య స్వభావమే హింసా వ్యతిరేకం. మానవ జీవితంలోని సున్నితమైన కోణాలను, విలువలను, అనుభవాలను హింస కాలరాస్తుంది. అందుకే హింసా వ్యతిరేకతే సాహిత్య వస్తువు. హింసను వ్యతిరేకిస్తూ మానవత, స్వేచ్ఛ వంటి ఉన్నత విలువలను సాహిత్యం చిత్రిస్తుంది. సాహిత్యం తన భావ ప్రకటన వల్ల మానవ సమాజ నాగరికతా క్రమాన్నే ప్రభావితం చేసింది. విప్లవ రచయితల సంఘం ఈ యాభై ఏళ్లలో రకరకాల హింసా రూపాలకు వ్యతిరేకంగా ప్రజా ఆకాంక్షలను ఎత్తిపట్టింది. ప్రజల పక్షాన నిలబడింది. 'వ్యక్తుల మధ్య అసమానత, ఆధిపత్య సంబంధాలన్నిటినీ విరసం వ్యతిరేకిస్తుంది. శారీరక శ్రమకు, మేధో శ్రమకు మధ్య, పట్టణ, గ్రామీణ ప్రాంతాల మధ్య, విద్యావంతుకు, విద్య లేనివారికి మధ్య, వ్యక్తీకరణ శక్తి ఉన్నవారికీ, లేనివారికీ మధ్య ఉన్న అగాథాన్ని పూడ్చడానికి విరసం చైతన్యయుతంగా పని చేస్తుంది' – అనుబంధం 2 (విరసం ప్రణాళిక-నిబంధనావళి 16 నుంచి).

మానవ అనుభవమే సాహిత్యానికి వనరు. ప్రాచీన కాలంలో ప్రకృతిలో భాగమైన మనిషికి ప్రకృతి వల్ల కలిగే అనుభవమే ఆనాటి కళా సాహిత్యాలకు ఆధారం. మానవ సమాజం ఏర్పడ్డాక ప్రతి దశలోనూ అసమ సంబంధాలే ఉన్నాయి కాబట్టి, వాటి వల్ల కలిగిన మానవ అనుభవమే సాహిత్యానికి ముడి వస్తువు. అసమ సంబంధాల గురించిన ఎరుకే సాహిత్యంలో చైతన్యంగా వ్యక్తమవుతుంది. ప్రతి అసమానతలో హింస ఉంటుంది. అసలు అసమానత అంటేనే హింస. హక్కుల ఉల్లంఘన. అసమానతలకు దోపిడీ పునాదిగా పని చేస్తుంది. దీనికితోడు సాంఘిక, సాంస్కృతిక ఆధిపత్య సంబంధాల వల్ల అసమానతలు కొనసాగుతుంటాయి. అసమానతలు పోవాలని కోరుకోవడం అంటేనే హింస రద్దు కావాలని కోరుకోవడం. దీనికి సమాజంలోని అనేక తలాల్లో మార్పులు జరగాలి. ఇందులో ప్రజల క్రియాశీలమైన, చైతన్యవంతమైన పాత్ర ఉండాలి. ప్రజలను కేవలం ప్రేక్షకులుగా, లబ్ధిదారులుగా, ఓటర్లుగా చూసినంత కాలం అసమానతలు ఉంటాయి. హింస కొనసాగుతూనే ఉంటుంది. సాహిత్యం అసమానతలకు వ్యతిరేకంగా మానవ చైతన్యాన్ని ప్రజాస్వామికీకరిస్తుంది. హింసకు పాల్పడటం, హింసను అనుభవించడం తగదని ఆలోచింపచేస్తుంది. హింసకు వ్యతిరేకంగా సున్నితమైన స్పందనలు కలిగించడమే మానవ జీవితంలో సాహిత్యం నిర్వహించే పాత్ర. మామూలు స్థితిలో కనిపించని, ఎరుకలోకి రాని హింసా బీభత్సాలను, అణగారిపోయిన స్పందనలను, అస్పష్టంగా ఉండపోయిన ఆలోచనలను, అసంబద్ధ క్రమాలను సాహిత్యం వెలుగులోకి తీసుకొస్తుంది. వాటి అసలు అర్థాలను తిరిగి మానవ అనుభవంలోకి తీసుకొస్తుంది. మనుషులకు తెలిసీ తెలియకా హింసకు పాల్పడే, హింసకు లోనయ్యే అనుభవాలన్నిటినీ రచయితలు తమ సాహిత్యంలో చిత్రిస్తారు. విరసం ప్రణాళికలోంచి పైన ఉటంకించిన వాక్యాలు దానికి సంబంధించినవి. అసమానతలు, ఆధిపత్యాలు, హింసా రూపాలు ఎక్కడ ఉన్నా వ్యతిరేకించాలనే అవగాహన సాహిత్య సంస్థగా విరసం ప్రాపంచిక దృక్పథంలో భాగం. అయితే హింస కూడదని చెప్పినంత మాత్రాన సమస్య పరిష్కారం కాదు. హింస ఎంత అమానవీయమో సాహిత్య పఠనం ద్వారా అనుభవంలోకి తేవాలి. హింస నుంచి బైట పడటానికి మనుషులు ఎంత క్లిష్టభరితమైన నాగరికతా ప్రయాణం చేశారో, ఎంత సంఘర్షణకు లోనయ్యారో స్ఫురింపజేయాలి. హింస మనుషుల చుట్టూ ఉండవచ్చుగాక, కానీ మానవులు రూపొందే క్రమంలో హింసకు దూరమయ్యారనే అవగాహన కల్పించాలి. సారాంశంలో మానవ నైజంలో హింస భాగం కాదనే ఆలోచన అందించాలి. అయితే మానవ సమాజం, అందులోని వ్యవస్థలు, వాటి చరిత్ర నిర్మాణమైన తీరు వల్లనే మానవ జీవితంలో అసమానతలు ఉన్నాయి. హింస అమలవుతున్నది. వాటి గురించి ఎరుక కలిగించడమే విరసం లక్ష్యం. విరసం సాహిత్య, సాంస్కృతిక ఆచరణ అంతా దీని చుట్టూ తిరుగుతూ ఉంటుంది.

కానీ జీవో 73లో ప్రధానంగా విరసం హింసను సమర్థిస్తుందని ప్రభుత్వం ఆరోపించింది. పూర్తి నిరాధారమైన ఈ ఆరోపణ మీద ఆధారపడి మిగతా ఆరోపణలన్నీ చేసింది. విరసానికి హింసా స్వభావాన్ని ఆపాదించడాన్ని మేం మౌలికంగానే ఖండిస్తున్నాం. సమాజంలో పెచ్చరిల్లిపోయిన హింసోన్మాదాలను తన సృజనాత్మక కలాపం ద్వారా ఎత్తి చూపుతున్న, విశ్లేషిస్తున్న విరసం మీద తెలంగాణ ప్రభుత్వం హింసారోపణలు చేయడం ఈ కాలానికి చెందిన పారడాక్స్‌గా మేం భావిస్తున్నాం. అందువల్ల విరసం చట్టవ్యతిరేక సంస్థ అని ప్రకటించడానికి జీవో ఎంఎస్ 73లో చూపిన ఐదు కారణాలకు విరసం ఈ కింది విధంగా తన అభ్యంతరాలు చెబుతోంది.

1. ప్రభుత్వం ఆరోపించినట్లుగా సీపీఐ (మావోయిస్టు) వ్యూహం – ఎత్తుగడల ప్రకారం విరసం పని చేయదు. అలాంటి వాటితో విరసానికి ఎలాంటి సంబంధం లేదు. ఇది పూర్తి నిరాధార ఆరోపణ. విరసానికి స్వతంత్ర్యమైన సాహిత్య సాంస్కృతిక లక్ష్యాలు ఉన్నాయి. వీటిని తనదైన తాత్విక పునాది నుంచి ఏర్పరుచుకున్నది. మరే రాజకీయ పార్టీ వ్యూహాలు-ఎత్తుగడలతో దీనికి సంబంధం లేదు. సాహిత్యకారుల సృజనాత్మక రచనా కార్యక్రమానికి తప్పక ఒక తాత్విక దృక్పథం ఉంటుంది. ఉండాలి. దృక్పథం లేకుండా రచన చేయడం సాధ్యం కాదు. విరసం కూడా తన సాహిత్య సాంస్కృతిక కర్తవ్యాలకు తగిన తాత్విక దృక్పథాన్ని ఎంచుకున్నది. సాహిత్య రంగంలో విరసానికి ఉన్న ఈ తాత్విక దృక్పథమే వేరే నిర్మాణాలకు కూడా ఉన్నంత మాత్రాన వాటితో విరసానికి అనుబంధం ఉన్నట్లు చెప్పడానికి వీల్లేదు. అసలు తాత్విక దృక్పథం ఏ ఒక్క నిర్మాణానికో, రాజకీయ పార్టీకో సొంతం కాదు. మానవ జీవితాన్ని, అందులోని వైరుధ్యాలను, వాటికి ఉండగల పరిష్కారాలను అర్థం చేసుకోడానికి ఎవరికైనా ఒక దృక్పథం ఉండాల్సిందే. సమాజంలో ప్రగతిశీలమైన మార్పు రావాలని ఏ రంగంలో కోరుకొనే వారికైనా ఏదో ఒక దృక్పథం ఉంటుంది. ప్రతి రంగానికి దాని స్వభావాన్నిబట్టి ఆ దృక్పథ అన్వయం తప్పనిసరి. రాజకీయ, రాజకీయార్థిక, చరిత్ర, విద్య, సాహిత్య, సాంస్కృతిక తదితర రంగాలనుబట్టి దృక్పథం అన్వయం అవుతుంది. ఆచరణ రూపాలు అంటాయి. విరసానిది సాహిత్య రంగం. కాబట్టి తాను విశ్వసించే తాత్విక దృక్పథం భావజాలం, విలువలు, సంస్కృతి మొదలైన అంశాలకు తగినట్లు అన్వయం అవుతుంది. ఈ కార్యరంగానికి తగిన ఆచరణ రూపాలు ఉంటాయి. భావాల అన్వేషణ, భావాల ఉత్పత్తి, వినిమయం, సంఘర్షణ, సామాజిక వాస్తవికతకు తగిన భావాలను రూపొందించడం, జీవితానుభవం నుంచి భావాలకు సృజనాత్మక రూపాన్ని ఇచ్చి కథలు, కవిత్వం, నవలలు, పాటలు రాయడం, సాహిత్య, సామాజిక విమర్శ అందించడం వంటి పనులు విరసం సభ్యులు చేస్తారు. ఇదంతా విరసం ఎంచుకున్న తాత్విక దృక్పథానికి, ప్రణాళిక నిబంధనావళికి లోబడి స్వతంత్ర్యంగా జరుగుతుంది. అంతేగాని ఇలాంటి తాత్విక దృక్పథం ఉ

న్న ఉన్న నిర్మాణాలన్నీ అనుబంధంలో ఉండాల్సిన పని లేదు. గాంధేయవాదాన్ని అంగీకరించే వ్యక్తులు ఎందరో ఉన్నారు. నిర్మాణాలు ఎన్నో ఉన్నాయి. అంత మాత్రాన అవన్నీ ఒకదానికి ఒకటి అనుబంధం కాదు. గాంధేయవాదం ఒకానొక దృష్టి కోణం. దాన్ని ఎవరైనా స్వీకరించవచ్చు. వాళ్ల మధ్య నిర్మాణ సంబంధం ఉండనవసరం లేదు.

విరసం తన ప్రాపంచిక దృక్పథం ప్రకారం ఏర్పాటు చేసుకున్న ప్రణాళిక, నిబంధనావళి వెలుగులో పని చేయడానికి దాని సభ్యులతో కూడిన అత్యున్నత బాడీ అయిన సర్వసభ్య సమావేశం మార్గ నిర్దేశం చేస్తుంది. 'విరసం సర్వసభ్య సమావేశమే విరసంలో అత్యున్నత సంస్థ. విధాన నిర్ణయాలు చేయడానికి, కార్యనిర్వాహక వర్గాన్ని, కార్యవర్గాన్ని ఎన్నుకోడానికి దానికి అధికారం ఉంది. సభ్యత్వాన్ని ఆమోదించడంలో, రద్దు చేయడంలో దానిదే తుది అధికారం (విరసం -నిబంధనావళి 6 ఉ, అనుబంధం-2). కాబట్టి విరసాన్ని ఏదో రాజకీయ పార్టీ వ్యూహం ఎత్తుగడల్లో ఇరికించడాన్ని మేం అంగీకరించడం లేదు.

జీవో 73లోని ఈ మొదటి అంశంలోనే.. రాజ్యానికి వ్యతిరేకంగా యుద్ధం చేసేందుకు విరసం గెరిల్లా ఎత్తుగడగల ప్రకారం పట్టణాల్లో వివిధ కవర్లలో పని చేస్తున్నదనే మరో ఆరోపణ చేశారు. ఇది పూర్తి వాస్తవ వ్యతిరేకం. రచయితల సంస్థగా విరసానికి ఈ వ్యవస్థ స్వభావం మీద కొన్ని కచ్చితమైన వైఖరులు ఉన్నాయి. అలాగే రాజ్యం మీద కూడా విమర్శలు ఉన్నాయి. చారిత్రకంగా రాజ్యం ఎలా ఏర్పడిందో, ఎలాంటి పాత్ర పోషిస్తున్నదో, ఇప్పుడున్న రాజ్యానికి ఎందుకు కొన్ని ప్రత్యేక స్వభావాలు ఉన్నాయో తన ప్రాపంచిక దృక్పథం నుంచి విశ్లేషిస్తుంది. ఈ రాజ్య వ్యవస్థలో రావాల్సిన మార్పుల గురించి కూడా విరసానికి కొన్ని శాస్త్రీయమైన అభిప్రాయాలు ఉన్నాయి. ఆధునిక, ప్రజాస్వామ్య సమాజంలో అన్ని రకాలుగా సమానత్వం సాధించడం అత్యున్నత విలువ. దానికి సాటిరాగల లక్ష్యం మరొకటి లేదు. సమానత్వాన్ని, వ్యక్తి స్వేచ్ఛను, సాంఘిక సంకెళ్లు లేని ప్రగతిదాయకమైన సమిష్టితత్వం సాధించడానికి సమాజంలో, రాజ్యంలో ఎలాంటి మార్పులు రావాల్సి ఉన్నదో విరసానికి కొన్ని అభిప్రాయాలు ఉన్నాయి. బహుశా ప్రపంచవ్యాప్తంగా ఆలోచనాపరులందరూ, రచయితలందరూ విడిగాగాని, సంఘటితంగాకాని ఆయా కాలాల్లో ఇలాంటి ఎన్నో ఆలోచనలు చేసినవాళ్లే. మనుషుల వ్యక్తిగత జీవితం, సామాజిక జీవితం అర్థం కావడానికి, ప్రగతిదాయకమైన విలువల మీద అవి పటిష్టం కావడానికి, సారాంశంలో ఉన్నత మానవీయ సంబంధాలు రూపొందడానికి ఇలాంటి ఆలోచనలు పురికొల్పాయి. మనకు తెలిసిన చరిత్ర అంతా ఇలాంటి అన్వేషణల ఫలితమే.

సాహిత్య సంస్థగా యాభై ఏళ్లుగా విరసం ఈ పని చేస్తున్నది. భారత రాజ్యాంగం ప్రకారం వేర్వేరు భావజాలాలు గల వ్యక్తులు, సంస్థలు సామాజిక రాజకీయార్థిక సాంస్కృతిక సమస్యల గురించి విశ్లేషించే హక్కు ఉంది. దీన్ని విరసం సహా అన్ని రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాలు, పత్రికలు, వ్యక్తులు పరిపూర్ణంగా వినియోగించుకోవాలి. అప్పుడే రాజ్యాంగం ప్రవచించే ప్రజాస్వామ్యం సారవంతం అవుతుంది. రాజ్యం మీద విమర్శలకు, విశ్లేషణలకు చోటు లేనప్పుడు అది నియంతృత్వం అనిపించుకుంటుందేగాని ప్రజాస్వామ్యం కాజాలదు. ఈ స్ఫూర్తితో విరసం తన ప్రాపంచిక దృక్పథం నుంచి రాజ్యం గురించి, ప్రభుత్వం గురించి, ఈ వ్యవస్థ పని తీరు గురించి విశ్లేషిస్తోంది. ఇది భావజాల సాంస్కృతిక కృషి. విరసం తన ప్రణాళిక ప్రకారం ఈ పని చేస్తున్నది. ఆ ఆలోచనాత్మక కృషిని రాజ్యంపై యుద్ధమని అనడం, పట్టణ గెరిల్లా ఎత్తుగడలు అనడం పూర్తి నిరాధార ఆరోపణ. తద్వారా ప్రజాస్వామ్య క్షేత్రంలో ఒక సాహిత్య సంస్థ బాధ్యతాయుత కార్యాచరణను అవమానపరచడమే. విరసం కార్యరంగానికి సంబంధం లేని దురారోపణ చేయడం ప్రభుత్వ బాధ్యతారాహిత్యం.

**2.** జీవో ఎంఎస్ 73లోని రెండో అంశంలో మరికొన్ని ఆరోపణలు చేశారు. అవి కూడా నిరాధారమైనవి. మా ప్రజా ఆచరణను వక్రీకరించే ఉద్దేశంతో చేసినవే. విరసం అనేక కొత్త ఎత్తుగడలతో ఇతర సంఘాలతో చేతులు కలిపి కార్యక్రమాలు నిర్వహిస్తున్నామని, వివిధ సమస్యలను వెలుగులోకి తెస్తున్నామని, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు వ్యతిరేకంగా పని చేస్తున్నామని అందులో రాశారు.

విరసానికి గతంలో ఎలాంటి ఎత్తుగడలు లేవు. ఇప్పుడు కొత్తగా అనుసరిస్తున్న ఎత్తుగడలు అసలే లేవు. అయితే మేం ఇతర సంఘాలతో వివిధ సందర్భాల్లో కలిసి పని చేసే మాట వాస్తవం. ముఖ్యంగా విరసం సాహిత్య సంస్థ కాబట్టి సాంస్కృతిక విషయాలపై ఇతర సాహిత్య, కళా సంఘాలతో, వేదికలతో, వ్యక్తులతో కలిసి సభలు నిర్వహిస్తుంటాం. దీన్ని విరసం వాళ్లతో దాన్ని 'చేతులు కలపడం' అనడానికి వీల్లేదు. ఆ మాట అంటే అవతలి వాళ్లను అవమానించడమే. సాహిత్య సాంస్కృతిక విషయాలపై అందరం కలిసి నిర్వహించడమంటే అవి మా అందరి ఉమ్మడి కార్యక్రమాలని అర్థం. ప్రజా సమస్యలపై రచయితలు, మేధావులు అందరూ కలిసి సంతకాలతో ప్రకటనలు విడుదల చేసినప్పుడు అందులో సంస్థగా విరసం భాగమవుతుంది.

ఇక వివిధ ప్రజా సమస్యలను వెలుగులోకి తేవడం రచయితల, బుద్ధిజీవుల నైతిక బాధ్యత. ప్రజల సమస్యలు వెలుగులోకి రావడానికి అనేక మార్గాలు ఉన్నప్పుడే అది ప్రజాస్వామ్యమనిపించుకుంటుంది. తమ పాలనలో ప్రజా సమస్యలు వీలైనన్ని మార్గాల్లో వెలుగులోకి వచ్చే వాతావరణాన్ని ప్రభుత్వాలు ప్రోత్సహించాలి. తద్వారానే ప్రజాస్వామ్యం సంపద్వంతం అవుతుందని ఆనందించాలి. ఏ కారణం వల్లనైనా తమ కంటపడని, తాము పట్టించుకోని సమస్యలను రచయితలు వేర్వేరు సృజనాత్మక మార్గాల ద్వారా గ్రహించి, వాటి స్వభావాన్ని, మూలాలను సమాజంలో చర్చనీయాంశం చేయడాన్ని ప్రజాస్వామ్య ప్రభుత్వాలు హర్షించాలి. అంతేగాని ప్రజా సమస్యలను వెలుగులోకి తేవడమే నేరమని, 'ప్రజా భద్రత'కు భంగమని అనుకోనవసరం లేదు. ఈ జీవో 73 అయితే దాన్ని నేరచర్యగా వర్ణించింది.

ప్రజా సమస్యలకుగాని, అవి పరిష్కారం కాకుండా నాన్చివేతకు గురికావడానికి కాని, తద్వారా ప్రజలు ఇబ్బందులపాలయ్యేందుకు గాని ప్రభుత్వమే కారణమైతే ఆ సంగతి కూడా సమాజంలో రచయితలు చర్చనీయాంశం చేయాలి. విరసం అదే చేస్తున్నది. కానీ ఈ జీవో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ప్రకటనలు, సమావేశాలు, ఊరేగింపులు చేసేలా విరసం రెచ్చగొడుతున్నదని ఆరోపించింది. విరసం ఎవరినీ ఎలాంటి పనులకు రెచ్చగొట్టదు. 'రెచ్చగొట్టడం' అనే మాట విరసానికి నేర స్వభావాన్ని ఆపాదించడమే కాక, అవతలి వైపు ఉన్న ప్రజలను చైతన్య రహితులుగా, వివేక హీనులుగా చిత్రిస్తోంది. ప్రజలను తక్కువ చేసే ఏ మాటా ప్రజాస్వామ్యంలో ప్రభుత్వానికి గౌరవాన్ని ఇవ్వదు.

అయితే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల విధానాలను వ్యతిరేకించడం కూడా రాజ్యాంగబద్ధ హక్కు. ప్రతిపక్షాలన్నీ చేసేది ప్రభుత్వ విధానాలను వ్యతిరేకించడమే. ఆ పని ప్రతిపక్షాలు మాత్రమే చేయాలనే నిబంధన

రాజ్యాంగంలో లేదు. ప్రజాజీవితాన్ని నిర్ణయించే రాజకీయార్థిక సాంఘిక సాంస్కృతిక విషయాలన్నీ అధికార, ప్రతిపక్షాలకు అప్పగించి ప్రజలు మౌనంగా ఉండాలని రాజ్యాంగంలో లేదు. ఆధునిక సమాజాల్లో రాజ్యాంగ యంత్రం ఉన్నట్లే పౌర సమాజం కూడా ఉంటుంది. అది క్రియాశీలంగా ఉంటూ ప్రజా జీవితాన్ని ప్రభావితం చేసే నిర్ణయాలు పాలకులు తీసుకున్నప్పుడు వాటి మంచి చెడ్డలను పట్టించుకోవాలి. తద్వారా ప్రజానుకూల పాత్ర పోషించాలి.

విరసం గత యాభై ఏళ్లుగా పౌర సమాజంలో బాధ్యతాయుతంగా పని చేస్తున్నది. సాహిత్య, మేధో సంస్థగా తన రచనల ద్వారా ప్రజలను ఆలోచింపజేసే ఆచరణ కొనసాగిస్తున్నది. ఏది హేతుబద్ధమో, ఏది ప్రజాస్వామికమో, ఏది ఉన్నత మానవీయ విలువలకు దోహదం చేస్తుందో పరిశీలించమని సూచిస్తున్నది. మానవ జీవితంలో సాహిత్యకారులు చేయగల పని ఇది మాత్రమే. నిజ జీవితంలోని అనుభవాన్నే రచయితలు సాహిత్యంలో చిత్రించి, దాని మీద పాఠకుల్లో సున్నితమైన ప్రేరణ కలిగించి సరికొత్తగా ఆలోచించడానికి దారి చూపుతారు. ప్రభుత్వ విధానాలపై, వ్యవస్థ పనితీరుపై రచయితలు ఒక కాంతిని ప్రసరింపజేస్తారు. సాహిత్య ప్రభావమంటే ఇదే. దీన్ని 'వ్యతిరేకించడం', 'రెచ్చగొట్టడం' లాంటి పదాలతో వక్రీకరించడం, నేరచర్యలుగా వర్ణించడం అభ్యంతరకరం.

ఈ పాయింట్‌లో ఇంకో ఆరోపణ కూడా ఉంది. ఇతర అనేక సంఘాలతో కలిసి పని చేస్తూ, ఆ సంఘాల సభ్యులను తమ ప్రభావంలోకి ఆకర్షిస్తున్నారని హేతురహితమైన అభియోగం చేశారు. విరసానికి ఒక తాత్విక దృక్పథం ఉన్నట్లే మిగతా సాహిత్య సంస్థలకు, అందులో పని చేసే వ్యక్తులకు కూడా ఒక దృక్పథం ఉంటుంది. దాని ప్రకారమే వాళ్లు పని చేస్తుంటారు. అందరికీ అమోదమయ్యే ఉమ్మడి కార్యక్రమాలకు సిద్ధమవుతుంటారు. అంతేగాని వాళ్లు విరసం ప్రభావంలోకి రావడమనేది ఉండదు. సాహిత్య రంగంలోనైనా, మొత్తంగా ప్రజా క్షేత్రంలోనైనా దృక్పథాల గురించి, ప్రభావాల గురించి తెలియకపోవడం వల్ల, తెలిసినా దురుద్దేశపూర్వకంగా విరసంపై ఈ ఆరోపణ చేశారని భావిస్తున్నాం.

**3.** జీవో ఎంఎస్ 73లోని మూడో పాయింట్‌లో చాలా అభ్యంతరకర ఆరోపణలు చేశారు. విరసం సభ్యులు క్రమం తప్పకుండా మావోయిస్ట్ పార్టీ నాయకత్వంతో సంబంధాల్లో ఉన్నారని, ఛత్తీస్‌ఘడ్ అటవీ ప్రాంతంలో కలుస్తున్నారని ఆరోపించారు. ఇది పూర్తి నిరాధారం. బహిరంగ ప్రజా జీవితంలో ఉండే విరసం సభ్యులు సీపీఐ మావోయిస్టును కలిసే అవకాశం లేదు. అవసరం కూడా లేదు. అలాగే సిపిఐ (మావోయిస్ట్) ఆదేశాల మేరకు విరసం వివిధ సమస్యలపై కార్యక్రమాలు నిర్వహిస్తున్నట్లు కూడా ఇందులో ఆరోపించారు. విరసం తన ప్రణాళికకు అనుగుణంగా సర్వసభ్య సమావేశంలో, కార్యవర్గంలో తన కార్యాచరణను రూపొందించుకుంటుంది. ఆ మేరకు పని చేస్తుంది. ఇవి పూర్తి పారదర్శకమైనది. సందేహాలకు, వక్రీకరణలకు, ఆరోపణలకు తావు లేని బహిరంగ, చట్టబద్ధ ఆచరణ కొనసాగిస్తోంది. విరసాన్ని సీపీఐ (మావోయిస్టు) ఆదేశిస్తుందనడం అసంగతం. ఆ అధికారం సీపీఐ మావోయిస్టుతో సహా మరే రాజకీయ పార్టీకిగాని, సంస్థకుగాని లేదు. విరసం తన ప్రణాళిక ప్రకారం పని చేసే స్వతంత్ర సంస్థ అని మరోసారి తెలియజేస్తున్నాం.

అలాగే బంజరు భూముల సమస్యపై, విరసం వ్యవస్థాపకుడు పి.వరవర రావు, ప్రొ. జి. ఎన్. సాయిబాబా, రోనా విల్సన్ తదితర భీమా కోరేగావ్ కేసులో అరెస్టయిన వారి విడుదల కోసం విరసం పని చేయడం ఒక నేరంగా ఇందులో ఆరోపించారు. అలాగే ఇతర సంఘాల నాయకులు, కార్యకర్తలపై అమలువుతున్న రాజ్యహింసకు వ్యతిరేకంగా పని చేయడం నేరంగా పేర్కొన్నారు.

సీపీఐ (మావోయిస్టు) ఆదేశాలతో వివిధ సమస్యలపై విరసం పని చేస్తుందనే మాట ఎంత అబద్ధమో, ఇలాంటి సమస్యలపై విరసం పని స్వతంత్ర్యంగా తన అవగాహన మేరకు పని చేస్తోందనే మాట అంతే సత్యం. దేశంలో, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో, తెలంగాణ రాష్ట్రంలో ఇప్పటికీ భూమి సమస్య పరిష్కారం కాలేదు. ప్రతి పార్టీ తాము అధికారంలోకి వస్తే భూములు పంచుతామని చెప్పేదే. భూ పంపిణీ గురించి అనేక చట్టాలు వచ్చాయి. కమిషన్లు ఏర్పడ్డాయి. అయినా భూమి సమస్య అలాగే ఉన్నదని ప్రభుత్వ ప్రకటనలే చెబుతున్నాయి. దేశంలో, తెలంగాణలో అసమ భూసంబంధాలు ఉన్నాయి. దశాబ్దాల తరబడి ప్రభుత్వం ఏం చేసినా అవి మారడం లేదు. చివరికి బంజరు భూముల సమస్య కూడా అపరిష్కృతంగానే ఉన్నది. కాబట్టి బంజరు భూముల సమస్య ఎందుకు ఉన్నదో ప్రభుత్వం ఆలోచించుకోవాలి. సమస్య ఉన్నప్పుడు సమాజంలో దాని మీద పోరాటం జరుగుతుంది. ఆ పోరాటాలు ముందుకు వచ్చినప్పుడు సాహిత్య సంస్థగా విరసం అది న్యాయమైనదే అని అంటుంది. మద్దతు ఇస్తుంది.

అలాగే ప్రజాస్వామిక హక్కుల ఉల్లంఘన జరిగినప్పుడు విరసం తన ప్రణాళిక-నిబంధనావళికి లోబడి వ్యతిరేకిస్తుంది. రాజ్యహింసకు వ్యతిరేకంగా పని చేస్తుంది. 'రాజ్యహింస' అనే మాట ఈ ఉత్తర్వులో పేర్కొన్నారు. అంటే రాజ్యహింస కొనసాగుతున్నదని ప్రభుత్వం అంగీకరించినట్లే. ప్రజాస్వామ్య వ్యవస్థలో రాజ్యం అనేది హింసకు పాల్పడ్డాక రచయితలు దాన్ని వ్యతిరేకించాల్సిందే. అక్రమ నిర్బంధాన్ని ప్రయోగించడం తగదని, చట్టబద్ధ పాలన కొనసాగించాలని ప్రభుత్వానికి పౌర సమాజంలో భాగంగా విరసం హితవు చెబుతుంది. ఇది నేరం కాకపోగా బాధ్యత. ప్రభుత్వాలు చట్టబద్ధత కోల్పోతే ప్రజాస్వామ్యమే సంక్షోభంలో పడుతుందనే విమర్శను పాలకులు స్వీకరించాలి. అంతేగాని హక్కుల ఉల్లంఘనను, రాజ్యహింసను ఖండించడమే నేరమని ఈ జీవో పేర్కొనడం ఆశ్చర్యంగా ఉంది. పైగా ప్రజాస్వామిక విలువలపై ఆధారపడి, పౌర స్ఫూర్తితో ఈ పని భారత పౌరులు ఎవరైనా చేయవచ్చు. దీనికి అసంగతమైన, నిరాధారమైన సీపీఐ మావోయిస్టు ఆదేశాలను లంకె పెట్టడం అభ్యంతరకరం.

ఇక విరసం సంస్థాపక సభ్యుడు వరవరరావు, సీనియర్ సభ్యుడు ప్రొ. సాయిబాబ తదితరులు విడుదలకు, భీమాకోరేగావ్ కేసులోని మిగతా మేధావుల విడుదలకు విరసం పని చేయడాన్ని కూడా చట్టవ్యతిరేక కార్యకలాపంగా ఆరోపించారు. ఇది అభ్యంతరకరం. మొదటి ఇద్దరు విరసం సభ్యులు కాబట్టి వారి విడుదల కోసం విరసం తప్పక పని చేస్తుంది. అలాగే మిగతా మేధావులను కూడా అక్రమ ఆరోపణలతో నిర్బంధించారని విరసం అభిప్రాయం. వారిపై పెట్టిన కేసుకు ఎలాంటి ఆధారాలు లేవని మా వాదన. కాబట్టి వారికి బెయిల్ ఇవ్వాలని, విడుదల చేయాలని కోరుతున్నాం.

బెయిల్ కోరుకోవడం నిందితులుగా ఆరోపణలు ఎదుర్కొనే పౌరులందరి హక్కు. వారి తరపున ఎవరైనా ఈ డిమాండ్ మీద పని చేయవచ్చు. ఇది పూర్తి చట్టబద్ధమైన వ్యవహారం. న్యాయ ప్రక్రియలో భాగం. కేసుల స్వభావం ఏదైనా సరే బెయిలు కోసం కోర్టులో ప్రయత్నించవచ్చు. పౌర సమాజంలో దాని కోసం ప్రజాస్వామిక

పద్ధతులన్నీ వినియోగించుకొని అభిప్రాయాన్ని కూడగట్టవచ్చు. దాని కోసం ప్రజాస్వామిక ఉద్యమాలు నిర్మించవచ్చు. బెయిలు ఇచ్చేదీ లేనిదీ న్యాయస్థానంలో తేలుతుంది. కానీ బెయిలు కావాలని కోరుకోవడం, దాని కోసం పని చేయడమే చట్టవ్యతిరేకమని జీవో 73 పేర్కొనడం ఆశ్చర్యం. సాయిబాబా, వరవరరావులకు బెయిలు ఇవ్వాలని విరసం మాత్రమే కాదు. దేశంలోని ప్రధాన ప్రతిపక్షం కాంగ్రెస్ నాయకుల దగ్గరి నుంచి ఎందరో రాజకీయ నాయకులు డిమాండ్ చేశారు. కేవలం ఈ ఇద్దరి విషయంలోనే కాదు, ఇంకా దేశంలోని అనేక మంచి రచయితలు, పాత్రికేయులు, ప్రజా మేధావుల అక్రమ అరెస్టులను ఖండిస్తూ వాళ్లకు బెయిలు ఇవ్వాలని ఎందరో కోరుకుంటున్నారు. వాళ్లందరూ సీపీఐ (మావోయిస్టు) ఆదేశాలతోనే ఈ డిమాండ్ చేస్తున్నారని ఆరోపించగలరా? వాళ్లందరి న్యాయ ఆకాంక్షను చట్టవ్యతిరేక కార్యకలాపం అనగలరా? నేర విచారణ ప్రక్రియలో భాగమైన బెయిల్ కోసం ప్రయత్నించడం కూడా నేరమే అవుతుందా?

ఉపా చట్టం రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకమని ఎందరో న్యాయ కోవిదులు, రాజ్యాంగ నిపుణులు విశ్లేషించారు. ప్రజాస్వామ్యంలో అధికారంలో ఉన్న వాళ్లు తమ రాజకీయ, భావజాల ప్రత్యర్థుల గొంతు నొక్కడానికి ఇలాంటి అప్రజాస్వామిక, అమానుష చట్టాన్ని తీసుకవచ్చారనే విమర్శలు ఉన్నాయి. ఆ చట్టాన్ని దాన్ని రద్దు చేయాలని దేశంలో ఎందరో కోరుతున్నారు. విరసం కూడా ఈ దిశగా తన విమర్శ ప్రకటిస్తోంది. ఈ చట్టం సహా మూడు వ్యవసాయ చట్టాలను, సీఏఏ, ఎన్ఆర్సీలను రద్దు చేయాలని దేశవ్యాప్తంగా అనేక భావజాలాలు, రాజకీయాలు ఉన్నవారందరూ కోరుతున్నారు. ప్రభుత్వం చేసే చట్టాలన్నిటినీ పౌరులందరూ విధిగా శిరసావహించాలని రాజ్యాంగంలో లేదు. వాటిలో కొన్నిటి మీద కానీ, అన్నిటి మీద కానీ అసంతృప్తిని, అభ్యంతరాన్ని పౌరులు వ్యక్తం చేయవచ్చు. కొన్ని చట్టాలను ఏకంగా రద్దు చేయాలని కోరే హక్కు కూడా భారత పౌరులకు ఉన్నది. కేంద్రం తెచ్చిన ఎన్ఆర్సీ, సీఏఏల మీద తెలంగాణ ప్రభుత్వం కూడా అసమ్మతిని తెలియజేసింది. కానీ ఇప్పుడు ఈ జీవోలో మాత్రం సీఏఏ, ఎన్ఆర్సీల రద్దు కోసం విరసం నిరసన తెలపడాన్ని చట్టవ్యతిరేక కార్యకలాపంగా ప్రకటించింది. ఇది తీవ్ర అభ్యంతరం. ఇది పౌరులుగా మా హక్కును నిరాకరించడమేగాక, దాన్ని నేరంగా చిత్రించడం రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకం.

**4. ఈ జీవో ప్రకారం** చట్ట వ్యతిరేక సంస్థలుగా ప్రకటించిన 16 సంఘాల్లో భాగంగా విరసం సభ్యులు కొందరు, చట్టబద్ధంగా ఏర్పడిన ప్రభుత్వాలకు వ్యతిరేకంగా యుద్ధం చేసేందుకు సీపీఐ (మావోయిస్టు) అజ్ఞాత కార్యకర్తలయ్యారని ఆరోపించారు. ఇది పూర్తి నిరాధార ఆరోపణ. ‘ విరసం సమాజ జీవిత ఉపరితల రంగాల్లో అభివృద్ధి నిరోధక భావజాలానికి, విలువలకు వ్యతిరేకంగా పోరాడుతోంది. ఈ పోరాట క్రమంలో బోల్షివిక్ విప్లవంలోను, చైనా విప్లవంలోనే రచయితల, మేధావుల పాత్రను విరసం మార్గదర్శకంగా స్వీకరిస్తుంది. కళల గురించి, సంస్కృతి గురించి మార్క్స్, ఏంగెల్స్, లెనిన్‌ల సిద్ధాంతాల్ని, మావో ఏనాన్ ప్రసంగాల్లోని విప్లవ ప్రజా సాంస్కృతిక పంథాని, గోర్కి, లూషన్‌ల రచనలను, చైనా సాంస్కృతిక విప్లవ స్ఫూర్తిని విరసం స్వీకరిస్తుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక సాహిత్య సృజనలో ప్రేమ్‌చంద్ ఆదర్శాన్ని, విప్లవ సాంస్కృతిక కార్యాచరణలో పాణిగ్రాహి ఒరవడిని విరసం స్వీకరిస్తుంది. కబీర్, వేమనలు మొదలుకొని పూలే, జాషువాల వరకు భారతీయ సాహిత్యంలోని ధిక్కార వారసత్వాన్ని, అనుకూలాంశాలను విరసం స్వీకరిస్తుంది. దేశ, దేశాంతర ప్రజా సంస్కృతులోని పోరాటాంశను, ధిక్కార ధోరణిని స్వీకరించి ప్రస్తుత యుగ అవసరాలకు అనుగుణమైన ప్రజాసాహిత్యాన్ని, సంస్కృతిని అభివృద్ధి చేయడానికి విరసం కృషి చేస్తుంది.

ఈ ప్రణాళికతో ఏకీభవించే సృజనాత్మక రచయితలకు, కళాకారులకు, సాంస్కృతిక కార్యకర్తలకు, చరిత్ర, తత్వశాస్త్రం, విద్య, విజ్ఞాన శాస్త్రం, సామాజిక శాస్త్రాలు వంటి అంశాల్లో కృషి చేసేవారికి విరసం సభ్యత్వం ఇస్తుంది...’ (అనుబంధం : 2 విరసం ప్రణాళిక-నిబంధనావళి 17, 18 నుంచి..)

విరసం కార్యరంగాన్ని ప్రణాళిక ఇంత స్పష్టంగా, వివరంగా నిర్దేశిస్తోంది. ఈ రంగాల్లో బహిరంగ ప్రజా జీవితంలో, కళా మేధో, సృజనాత్మక ప్రక్రియల్లో పని చేసేవారికే విరసంలో సభ్యత్వం ఉంటుంది. దీనికి భిన్నంగా జీవో 73లోని 4వ అంశంలో ఆరోపించినట్లు విరసం సభ్యులు ఎన్నడూ అజ్ఞాత కార్యకర్తలుగా పని చేయలేదు. సీపీఐ (మావోయిస్టు) కార్యకర్తలుగా పని చేయలేదు. ఇది పూర్తి నిరాధార ఆరోపణ.

**5. ఈ అంశంలో** దాదాపుగా పైన పేర్కొన్న ఆరోపణలే మరోసారి చేశారు. మావోయిస్ట్ పార్టీ ఆదేశాల ప్రకారం పైన పేర్కొన్న 16 సంఘాల్లో భాగంగా విరసం ఉద్దేశ్యాలు, లక్ష్యాలు, సభ్యుల ఏర్పాటు, పని పద్ధతులు ఉన్నాయనే అభియోగం చేశారు. విరసం ఉద్దేశాలు, లక్ష్యాలు సాహిత్య సాంస్కృతిక పరమైనవి. ఈ రంగాల్లో పని పద్ధతి ప్రధానంగా సృజనాత్మక ప్రక్రియల ద్వారా ఉంటుంది. ఈ పని పద్ధతులు అన్నీ ప్రజా క్షేత్రానికి చెందినవి. ఆ రకంగా చట్ట పరిధిలో కొనసాగేవి. ఈ పని పద్ధతులను విరసం సభ్యులందరూ ఆచరిస్తారు. కొనసాగిస్తారు. వీటిని సమాజం పట్ల బాధ్యతగల సాహిత్యకారులుగా మేం మా చైతన్యంతో మేం ఎంచుకొని నిర్దేశించుకున్నవి. సాహిత్య చరిత్రలో ఎప్పటి నుంచో ప్రజా, విప్లవ రచయితలందరూ ఆయా కాలాల్లో స్వచ్ఛందంగా స్వీకరించిన కర్తవ్యాలు ఇవి. ఆ వారసత్వంలో భాగంగానే విరసం కూడా ఈ లక్ష్యాలను నిర్వచించుకున్నది. సీపీఐ (మావోయిస్టు ఆదేశాల మేరకు ఈ లక్ష్యాలను, పని పద్ధతులను ఏర్పరుచుకున్నామని అనడం నిరాధారం. దీన్ని మేం అంగీకరించడం లేదు.

ఈ ఆరోపణలు చేసి, వీటిని అడ్డం పెట్టుకొని విరసాన్ని చట్టవ్యతిరేక సంస్థగా ప్రకటించడంపట్ల మేం అభ్యంతరం చెబుతున్నాం. ఈ జీవోలోని 2వ అంశంలో ‘ విరసం చట్టపాలనలో జోక్యం కలిగించుకోవడం, శాంతి భద్రతల నిర్వహణకు భంగం కల్గించడం లక్ష్యంగా వుందడం వల్ల ప్రజల శాంతి భద్రతలకు ప్రమాదం ఏర్పడిందని, అందువల్ల చట్టవ్యతిరేక సంఘంగా ప్రకటించాల్సిన అవసరం ఏర్పడింద’ని రాశారు. విరసం ఎన్నడూ ప్రభుత్వ పాలనలో జోక్యం చేసుకోలేదు. ప్రజాస్వామ్యంలో ప్రజల శాసన అధికారాన్ని గౌరవించి అధికారంలో ఉన్న వారు చట్టబద్ధంగా పాలన సాగించాలని విశ్లేషిస్తూ వచ్చింది. చట్టబద్ధ పాలనకు ప్రభుత్వమే భంగం కలిగించినప్పుడు రాజ్యాంగం పౌరులకు కల్పించిన రాజకీయ, భావ ప్రకటనా హక్కులను అర్థవంతంగా వినియోగించుకొని ఈ విమర్శ పెడుతూ వచ్చింది. అంతేగాని చట్టం ద్వారా కొనసాగాల్సిన ప్రభుత్వ పాలనలో విరసం ఎన్నడూ జోక్యం కల్పించుకోలేదు. శాంతిభద్రతలకు విరసం భంగం కల్పించలేదు. ప్రజల శాంతి భద్రతలకు భంగం కల్పించకపోగా రాజ్యాంగం నిర్దేశించిన ఆదేశిక సూత్రాలకు కట్టుబడి ప్రభుత్వం ప్రజల శాంతి భద్రతలకు పూర్తి రక్షణ కల్పించాలని, చట్టబద్ధ

హామీ ఇవ్వాలని, అమలు చేయాలని విరసం కోరుతూ వచ్చింది.

విరసం కార్యరంగం ప్రభుత్వ పాలన పరిధిలోనిది కాదు. విస్తృత ప్రజా సామాజిక రాజకీయార్థిక సాంస్కృతిక జీవితానికి సంబంధించింది. 'సామ్రాజ్యవాద, దళారీ పెట్టుబడిదారీ, భూస్వామ్య శక్తులు దేశాన్ని ఆర్థికంగా కొల్లగొడుతూ సాహిత్య, సాంస్కృతిక కళా విద్యా రంగాల్లో ప్రజలు ఉద్యమాల ద్వారా సాధించుకున్న ప్రజాస్వామిక విలువలను నిర్మూలించి, ప్రజలది కాని పరాయి సంస్కృతిని, జీవన విధానాన్ని బలవంతంగా రుద్దడానికి ప్రయత్నిస్తున్నాయి. మానవ సంబంధాలను విచ్ఛిన్నం చేసి సరుకుల సంబంధాలుగా మార్చివేస్తున్నాయి. కుహనా విలువలపై మోజు పెంచుతున్నాయి. భక్తి, యోగా విశ్వాసాల పేరుతో హిందూ మతోన్మాదాన్ని, బ్రాహ్మణీయ సంస్కృతిని పెంచి పోషిస్తున్నాయి. కళా, సాహిత్య రంగాల్లో సెక్స్‌ను, హింసను ప్రధానాంశంగా ప్రవేశపెట్టి యువతను నిర్వీర్యపరుస్తున్నాయి. స్త్రీ, పురుషులలో శరీర సౌందర్యంపట్ల తప్పుడు విలువలను ప్రయత్నపూర్వకంగా పెంచిపోషిస్తున్నాయి. లంపెనిజాన్ని, వ్యక్తివాదాన్ని ప్రేరేపిస్తున్నాయి. సకల మానవతా విలువలను విధ్వంసం చేస్తున్నాయి...' (విరసం ప్రణాళిక: 15 నుంచి..) ఇంత విశాలమైన కార్యరంగంలో సాహిత్య, కళా మాధ్యమాల ద్వారా విరసం పని చేస్తున్నదే కాని ప్రభుత్వ పాలనలో జోక్యం చేసుకోదు. కాబట్టి చట్టపాలనలో విరసం జోక్యం చేసుకుంటోందనే ఆరోపణ నిరాధారమైంది.

తన ప్రణాళిక ప్రకారం విరసం పని చేయడానికి ప్రధానంగా సభలు, సమావేశాలు నిర్వహిస్తోంది. వీటిని కూడా పోలీసు అనుమతి అవసరమైన రూపంలో నిర్వహించదల్చినప్పుడు తప్పని సరిగా చట్టబద్ధంగా వ్యవహరించాం. పోలీసుల అనుమతి మేరకే అలాంటి కార్యక్రమాలు చేపట్టాం. పోలీసులు అనుమతి ఇవ్వకపోయినా, ఇచ్చి రద్దు చేసినా మేం కార్యక్రమాలు విరమించుకున్నాం. విరసం కార్యక్రమాల వల్ల ప్రజా జీవితంలో చిన్న ఆటంకం ఎన్నడూ కలగలేదు.

అందువల్ల ప్రభుత్వ ఆరోపణలకు పైన చెప్పిన ప్రతివాదనల ద్వారా తేలేది ఏమంటే, ప్రభుత్వ నోటిఫికేషన్‌లో ఆరోపించినట్లుగా చట్టబద్ధ పాలనకు విరసం అవరోధం కలిగించడం లేదు. ప్రజా భద్రతా నిర్వహణను విరసం భంగపరచడం లేదు. ప్రజా శాంతికి విరసం ఆటంకం కాదు. అందువల్ల నోటిఫికేషన్‌లో ఆరోపించినట్లు విరసంను చట్టవ్యతిరేక సంస్థగా ప్రకటించడానికి హేతుబద్ధ ఆధారాలు ఏమీ లేవు. విరసంలాంటి సాహిత్య సాంస్కృతిక సంస్థను నిషేధించడం రాజ్యాంగంలోని భావ ప్రకటనా స్వేచ్ఛకు, సంస్థా నిర్మాణ స్వేచ్ఛకు భంగకరం. అంతర్జాతీయంగా అనేక ఒడంబడికలు గౌరవించిన భావ ప్రకటనా స్వాతంత్ర్యానికి ఈ చర్య వ్యతిరేకం.

అందువల్ల జనరల్ అడ్మినిస్ట్రేషన్ (ఎస్‌పిఎల్‌డి) శాఖ ద్వారా ప్రభుత్వం 30 మార్చి 2021నాడు జారీ చేసిన జీవో ఎంఎస్ 73 రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకమని విరసం భావిస్తోంది. కాబట్టి ఈ ఉత్తర్వులను ఉపసంహరించాలని విరసం డిమాండ్ చేస్తోంది.

ఈ సందర్భంగా మీ దృష్టికి ఒక ముఖ్యమైన విషయం తీసుకవస్తున్నాం. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో ఏపీ పబ్లిక్ సెక్యూరిటీ యాక్ట్‌ను వినియోగించుకొని అప్పటి ప్రభుత్వం ఆగస్టు 17, 2005న విప్లవ రచయితల సంఘాన్ని జీవో ఎంఎస్ 373 ద్వారా నిషేధించింది. దాని మీద ప్రజా భద్రతా చట్టం ప్రకారం అదే రోజు 609 నెంబర్‌తో అధికార పత్రం విడుదల చేస్తూ ఒక సలహా మండలిని ఏర్పాటు చేసింది. హైకోర్టు రిటైర్డ్ న్యాయమూర్తి జస్టిస్ టిఎల్ఎన్ రెడ్డి అధ్యక్షుడిగా, జస్టిస్ వి. నీలాద్రిరావు (హైకోర్టు రిటైర్డ్ జడ్జి), జస్టిస్ ఎ. గోపాల్‌రావు (హైకోర్టు రిటైర్డ్ జడ్జి) లతో ఏర్పడ్డ ఈ కమిటీ ముందు విరసం తన ప్రతి వాదనలు వినిపించింది. ప్రస్తుత నోటిఫికేషన్‌లో ఏ ఆరోపణలు చేశారో అవే ఆరోపణలు పదిహేనేళ్ల కింద చేశారు. ఇదే ప్రజాభద్రతా చట్టాన్ని వాడుకున్నారు. విరసం మీద ఆ రోజు చేసిన ఆరోపణల్లో ప్రభుత్వం ఒక్కదాన్ని కూడా ఆ కమిటీ ముందు సహేతుకంగా, సాక్ష్యాధారాలతో నిరూపించుకోలేకపోయింది. దీంతో ప్రభుత్వ ఆరోపణలు పూర్తిగా వీగిపోయాయి. విరసాన్ని చట్ట వ్యతిరేక సంస్థగా గుర్తించడానికి ఆధారాలు లేవని విచారణ కమిటీ తేల్చి చెప్పింది. 11.11.2005 నాడు జీవో ఎంస్ 503 ద్వారా ఆగస్టు 17, 2005నాటి జీవో 373ను రద్దు చేశారు. దీనికి సంబంధించిన నకలు పత్రాలను అనుబంధం 3, 4లో చేర్చుతున్నాం.

2005 నవంబర్‌లో నిషేధం ఎత్తివేశాక ఈ పదిహేనేళ్లలో విరసం గతంలాగే తన బహిరంగ, చట్టబద్ధ, సాహిత్య సాంస్కృతిక కార్యాచరణ కొనసాగిస్తున్నది. ఈ కాలంలో విరసం తన సభ్యులతో సహా తెలుగు సాహిత్యరంగంలోని ప్రముఖులు, యువ రచయితలు, ఔత్సాహిక రచయితలతో కలిసి 16 కథల వర్క్‌షాపులు నిర్వహించింది. 4 కవిత్వం వర్క్‌షాపులు, ఒక వ్యాస ప్రక్రియ వర్క్‌షాపులు నిర్వహించింది. 2005లో నిషేధం ఎత్తివేశాక 2006 జూన్ 10, 11 తేదీల్లో తన ఇరవయ్యో మహా సభలు రచయిత ప్రజల మనిషి అనే అంశం మీద నిర్వహించింది. ఇందులో అప్పటి ఉమ్మడి తెలుగు రాష్ట్రంలోని సుప్రసిద్ధ రచయితల మొదలు మూడు తరాల కవులు, రచయితల పాల్గొన్నారు. అప్పటి నుంచి యథావిధిగా ఒక ఏడాది మహా సభలు, మరో ఏడాది సాహిత్య పాఠశాల నిర్వహిస్తోంది. ఇందులో మేం ఏ చట్ట వ్యతిరేక అంశాలు చర్చించలేదు. సరికదా, మానవ జీవితాన్ని ఉన్నతీకరించే అనేక అంశాలు ఇతివృత్తాలుగా వీటిని నిర్వహించాం. ఇందులో తెలుగు రాష్ట్రాల్లోని ప్రముఖ విశ్వవిద్యాలయాల ఆచార్యులు, సీనియర్ పాత్రికేయులు, పరిశోధకులు, సుప్రసిద్ధ కవులు, రచయితలు, ప్రజా ఉద్యమ కార్యకర్తలు పాల్గొన్నారు. ఇవన్నీ బహిరంగంగా వేలాది మంది సమక్షంలో జరిగినవే. ఇందులో ఏ రహస్యం లేదు. కుట్ర లేదు. చట్టవ్యతిరేక వ్యవహారం లేదు. అయినా మళ్లీ 2005నాటి ఆరోపణలతో తెలంగాణ ప్రభుత్వం విరసం మీద చట్టవ్యతిరేక సంస్థ అనే ముద్ర వేసింది. ఈ ఉదంతం ఏం చెబుతోందంటే.. ఒకసారి నిరూపించుకోలేక, కొట్టివేతకు గురైన అవే ఆరోపణలను మళ్లీ వాడుకొని మరోసారి ఈ జీవో ఎంఎస్ 73ను తయారు చేశారు. న్యాయ ప్రక్రియలో కనీస సంబద్ధత లేని వ్యవహారం ఇది. కాబట్టి ఈ జీవో మీద విచారణ దాకా వెళ్లనవసరం లేకుండానే దీన్ని రద్దు చేసుకోమని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాం.

అనుబంధం 1 : మరోసారి భావ ప్రకటనా స్వేచ్ఛ, సంఘం పెట్టుకొనే హక్కు గురించి..

*అనుబంధం 2: విరసం ప్రణాళిక-నిబంధనావళి*

అనుబంధం 3 : 2005 ఆగస్టు 17న ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విరసాన్ని నిషేధిస్తూ విడుదల చేసిన జీవో ఎంఎస్ 373

అనుబంధం 4: 2005 నవంబర్ 11న నిషేధం ఎత్తివేస్తూ విడుదలైన జీవో ఎంస్ 503

ఇట్లు

అరసవెల్లి క్రిష్ణ 

## ఈ నిషేధం తగదు

తెలంగాణ ప్రభుత్వం 16 సంఘాలను సంవత్సరం కాలం పాటు చట్ట విరుద్ధమైనవిగా ప్రకటించడాన్ని మానవ హక్కుల వేదిక తీవ్రంగా ఖండిస్తూంది. ఈ సంఘాలలో పౌరహక్కుల సంఘం (సిఎల్‌సి), విరసం, తెలంగాణ ప్రజా ఫ్రంట్, కమిటీ ఫర్ ద రిలీస్ ఆఫ్ పొలిటికల్ ప్రిసనర్స్, తుడుం దెబ్బ, చైతన్య మహిళా సంఘం వున్నాయి. ఇది రాజకీయ విశ్వాసాలను నేరంగా ప్రకటించి, నిరసన గొంతు నొక్కివేయడానికి రాజ్యం చేస్తున్న దారుణ ప్రయత్నమని మానవ హక్కుల వేదిక భావిస్తూంది. ఇది ప్రజాస్వామిక నియమాలను కాలరాయడమే అవుతుంది.

ఈ సంఘాలను చట్టవ్యతిరేకమైనవిగా ప్రకటించడానికి ఉపయోగించిన తెలంగాణ పబ్లిక్ సెక్యూరిటీ చట్టం, 1992 శిక్షాస్మృతిగా ముసుగు ధరించిన రాజకీయ పరికరం తప్ప మరోటి కాదు. ఇది చట్టవిరుద్ధం చేయడానికి ప్రయత్నిస్తున్నది హింసను కాదు – చరిత్రలో రాజ్యం పుట్టినప్పటి నుండి నిషేధించబడిన రాజకీయాలను, సామాజిక క్రియాశీలతను. ఇవి పాలకవర్గాలకు సహించనివి. ఇటువంటి విధానం ప్రాథమిక స్వేచ్ఛలను ప్రభావితం చేస్తుంది, ప్రజాస్వామ్యంలో ఆమోదయోగ్యం కాదు.

16 సంఘాలు చట్టవ్యతిరేకమైనవని ప్రకటించిన జి.ఓ నం. 73/30-3-2021 మౌలిక స్వేచ్ఛలను కాలరాచివేస్తుంది, ప్రజాస్వామ్యం అనే భావనకే తీవ్ర నష్టాన్ని కలగచేస్తుంది. తెలంగాణ ప్రభుత్వం సరైన ఆలోచనతో వెంటనే నోటిఫికేషన్ ఉపసంహరించుకొంటుందని హెచ్‌ఆర్ఎఫ్ హృదయపూర్వకంగా భావిస్తోంది.

**విఎస్. కృష్ణ**
**ఎస్. జీవన్ కుమార్**
మానవ హక్కుల వేదిక
తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ సమన్వయకమిటీ సభ్యులు
24-4-2021
హైద్రాబాద్

## తెలంగాణ రాష్ట్రంలో విద్యార్థి సంఘాల పై పెట్టిన నిషేధాన్ని ఎత్తి వేయాలి. నిషేదం పెట్టడం అంటే రాజ్యాంగం కల్పించిన హక్కును హరించడమే.

తెలంగాణ రాష్ట్రంలో వివిధ విద్యార్థి సంఘాలను ప్రభుత్వం నిషేదించడాన్ని భారత విద్యార్థి ఫెడరేషన్ (ఎస్.ఎఫ్.ఐ.) – తెలంగాణ రాష్ట్ర కమిటీ ఖండిస్తోంస్తుంది. ఈ మేరకు రాష్ట్ర అధ్యక్ష, కార్యదర్శులు ఆర్.ఎల్.మూర్తి, టి.నాగరాజు ఒక ప్రకటన విడుదల చేశారు. మలిదశ తెలంగాణ ఉద్యమాన్ని నిర్వహించుటకు ప్రజాస్వామ్యబద్ధంగా, రాజ్యాంగం కల్పించిన హక్కు లో భాగంగా ఏర్పడ్డ టీవీఎస్, టీవీవీ, డిఎస్‌యూ, ఆదివాసీ విద్యార్థి సంఘాల పై ప్రభుత్వం నిషేదం పెట్టడం అంటే తెలంగాణలో భావ ప్రకటన స్వేచ్ఛ హరించడం అని అన్నారు. వెంటనే విద్యార్థి సంఘాలపై నిషేధాన్ని ఎత్తి వేయాలని ఎస్.ఎఫ్.ఐ. ప్రభత్వాని డిమాండ్ చేస్తుంది. తెలంగాణ మలిదశ ఉద్యమంలో తెలంగాణ నినాదాన్ని విద్యాలయాల్లో వినిపించిన విద్యార్థి సంఘాలను తెలంగాణ రాష్ట్రంలో నిషేదించడం అంటే ప్రజాస్వామ్యం ఖూని చేయడమేన్నారు. విద్యార్థి సంఘాలు, విరసం సహా 16 ప్రజాసంఘాలను నిషేధించడాన్ని ఎస్.ఎఫ్.ఐ. వ్యతిరేకిస్తోంది.

**ఆర్.ఎల్.మూర్తి**
(రాష్ట్ర అధ్యక్షుడు)
**టి.నాగరాజు**
(రాష్ట్ర కార్యదర్శి)
భారత విద్యార్థి ఫెడరేషన్ (ఎస్.ఎఫ్.ఐ)
తెలంగాణ రాష్ట్ర కమిటీ

## విద్యార్థి సంఘాల పై నిషేధాన్ని ఎత్తి వేయాలి

మలిదశ తెలంగాణ ఉద్యమాన్ని నిర్వహించుటకు ప్రజాస్వామ్య బద్ధంగా, రాజ్యాంగం కల్పించిన హక్కు లో భాగంగా ఏర్పడ్డ TVS, TVV, DSU, ఆదివాసి విద్యార్థి సంఘాల పై ప్రభుత్వ నిషేధాన్ని ఎత్తి వేయాలని AISF విజ్ఞప్తి చేస్తుంది. నాటి సీమాంధ్ర ముఖ్యమంత్రులు తెలంగాణ నేల పై తెలంగాణ ఉద్యమాన్ని నిర్బంధాలతో అణచివేసిన ఆనాటి పరిస్థితుల్లో కూడా తెలంగాణ నినాదాన్ని విద్యాలయాల్లో వినిపించిన విద్యార్థి సంఘాలైన TVS, TVV పై నిషేధాన్ని ప్రభుత్వం సమీక్షించాలని కోరుతున్నాం.

నేడు ప్రభుత్వం నిషేదం ప్రకటించిన విద్యార్థి సంఘాల్లో, గతంలో పనిచేసిన నాయకులు నేడు అధికార టీఆర్ఎస్, బీజేపీ, ప్రతిపక్ష కాంగ్రెస్‌లో నాయకులుగా పనిచేస్తున్న విషయాన్ని ప్రభుత్వం పరిగణనలోకి తీసుకోవాలని కోరుతున్నాము.

TVS, TVV, DSU, ఆదివాసి విద్యార్థి సంఘాల రాజకీయ విశ్వాసాలతో AISFకి ఏకీభావం లేకపోయినా... ప్రజాస్వామ్యబద్ధంగా, రాజ్యాంగ బద్ధంగా తెలంగాణ సమాజ ప్రయోజనాల పరిరక్షణ కోసం పోరాటం చేసుకునే వెసులుబాటును ప్రభుత్వం కల్పించాలని కోరుతున్నాము.

అభినందనలతో
**ఆర్.ఎన్ శంకర్**, రాష్ట్ర ఆర్గనైజింగ్ కార్యదర్శి
**క్రాంతి రాజ్**, కార్యదర్శి, ఓయూ

## తెలంగాణ ప్రజా అసెంబ్లీ సంఘాల పత్రికా ప్రకటన

**తెలంగాణ ప్రభుత్వం 16 ప్రజా సంఘాలను "చట్టవిరుద్ధంగా" ప్రకటించిన జి.ఓ. ను ఉపసంహరించాలి**
**సంఘ నిర్మాణ హక్కు రాజ్యాంగం ఇచ్చిన హక్కు**
**ప్రభుత్వం కొవిడ్ ఆరోగ్య సంక్షోభాన్ని పరిష్కరించటంపై తన శక్తినంతా కేంద్రీకరించాలి**

అనేక ప్రజా సంఘాలు, ప్రజాస్వామిక హక్కుల కోసం పనిచేసే వేదికలతో ఏర్పడిన "తెలంగాణ ప్రజా అసెంబ్లీ" భాగస్వాములమైన మేము తెలంగాణ ప్రభుత్వం 16 ప్రజాసంఘాలను ఒక ఏడాది పాటు "చట్టవిరుద్ధం" గా ప్రకటించటం పట్ల తీవ్ర ఆందోళన వ్యక్తం చేస్తున్నాము. ఈ ప్రకటన ఏకపక్షమైనదే గాక, దేశమంతా తీవ్రమైన కోవిడ్ ఆరోగ్య సంక్షోభంలో విలవిలలాడుతున్నప్పుడు ప్రజల ప్రాణాలను కాపాడటం తప్ప మరేదీ ముఖ్యం కాకూడని సమయంలో వెలువడటం సమంజసం కాదు. సమాజంలోని అన్ని సెక్షన్ల ప్రజల ప్రజాస్వామిక, మానవ హక్కుల పరిరక్షణ కోసం పనిచేస్తూ రాజ్యాంగ విలువలలో

విశ్వాసం వున్న సంస్థలుగా మేము ఈ చర్యను నిర్ద్వంద్వంగా ఖండిస్తున్నాము. 16 సంఘాలను "చట్టవిరుద్ధంగా" ప్రకటించిన జి.ఓ. ను రాష్ట్ర ప్రభుత్వం వెంటనే ఉపసంహరించాలని డిమాండ్ చేస్తున్నాము.

మార్చ్ 30వ తేదీన రాష్ట్ర ప్రభుత్వం విడుదల చేసిన జి.ఓ. నెం.73 తెలంగాణ పబ్లిక్ సెక్యూరిటీ చట్టం, 1992 కింద 16 ప్రజాసంఘాలను "చట్టవిరుద్ధం"గా పేర్కొంది. ఈ జి.ఓ. అదే తేదీ నుండి అమలులోకి వస్తుంది. ఇవన్నీ నిషేధిత భారతకమ్యూనిస్ట్ (మావోయిస్టు) పార్టీ కి 'అనుబంధ సంస్థలు" అని ప్రభుత్వం వాదిస్తున్నది.

ఈ 16 సంఘాలను "చట్టవిరుద్ధం" గా పేర్కొనటానికి ఈ జిఓలో చెప్పిన కారణాలు ఏమిటంటే. అవి "వ్యక్తులను హింసాత్మక చర్యలకు పురికొల్పటం లేదా సహాయపడటం చేస్తున్నాయి"; "ఈ సంఘాల కార్యకర్తలు పట్టణప్రాంతాలలో తిరుగుతూ పట్టణగెరిల్లా కార్యకలాపాలను అనుసరిస్తున్నారు"; "ఊపా చట్టం, వ్యవసాయ చట్టాలను, సిఏఏ/ ఎన్ఆర్సిలను రద్దు చేయాలని నిరసన ప్రదర్శనలు చేయటం; "వరవర రావు, ప్రొఫెసర్ సాయిబాబా, రోనావిల్సన్‌లను విడుదల చేయాలని డిమాండ్ చేయటం, "అనేక సంస్థలతో చేతులు కలిపి వాటి సభ్యులను తమ సంస్థలలో చేరేటట్లు ఆకట్టుకోవడం, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు వ్యతిరేకంగా రెచ్చగొట్టే ప్రకటనలు ఇవ్వటం, అనేక సమస్యలను లేవనెత్తి సమావేశాలు, ర్యాలీలు నిర్వహించటం" మొదలైనవి. సామాజిక న్యాయం కోసం సంఘటితపడే పౌరుల స్వేచ్ఛ పట్ల బలంగా విశ్వాసం కలిగిన ప్రజాస్వామిక సంఘాలుగా మేము ఈ క్రింది విధంగా ప్రకటిస్తున్నాము:

భారత రాజ్యాంగం ప్రకారం సకారణమైన పరిమితులలో సంబంధం కలిగి వుండే స్వేచ్ఛ ప్రతి ఒక్క సంస్థకు వుంది. అందుకే వ్యక్తులు చట్టాన్ని ఉల్లంఘించారనే నిర్దిష్ట ఆరోపణ వ్యక్తులపై లేకుండా మొత్తం సంస్థనే "చట్టవిరుద్ధం" అని ప్రకటించటం అంగీకారం కాదు, అప్రజాస్వామికం. ఈ 16 సంస్థలు చాలా సంవత్సరాలుగా పౌర హక్కులు, ప్రజాస్వామిక -మానవ హక్కులు, ఆదివాసీ హక్కులు, రైతుల హక్కులు, కార్మికుల హక్కులు, మహిళా హక్కులు, సాంస్కృతిక అవగాహన మొదలైన అంశాలపై పనిచేస్తూ వస్తున్నాయి. వాటిలో కొన్ని విద్యార్థులు, రచయితల సంఘాలు, రాజకీయ ఖైదీల విడుదలకి పనిచేసే అమరుల బంధు మిత్రుల సంఘాలు. ప్రజల మధ్య పనిచేస్తున్న సంఘాలను ఏకపక్షంగా "చట్టవిరుద్ధం" అని ఈ జిఓలో ప్రకటించటానికి సరైన స్పష్టత కానీ సమర్థనీయమైన కారణం కానీ లేదు. విరసం, పౌరహక్కుల సంఘం సహా 16 సంఘాలను తెలంగాణ ప్రభుత్వం నిషేధించడాన్ని ఖండిస్తున్నాం.

ప్రజల బాగోగుల కోసం పనిచేసే సంఘాలు ప్రజల హక్కుల పట్ల ప్రభుత్వ బాధ్యతల పట్ల అవగాహనను పెంచటం ప్రభుత్వానికి ఇష్టం లేదని జిఓలో పేర్కొన్న కారణాలు స్పష్టం చేస్తున్నాయి. వరవరరావు లేదా ప్రొఫెసర్ సాయిబాబా లేదా రానావిల్సన్‌వంటి రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని డిమాండ్ చేయటం, ఊపా వంటి చట్టాలకు వ్యతిరేకంగా నిరసన తెలియ చేయటం నేరమెట్లా అవుతుంది? దేశం మొత్తం రైతు వ్యతిరేక వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా నిరసన వ్యక్తం చేస్తున్నప్పుడు, తెలంగాణ ప్రభుత్వం సైతం వాటిని మొదట్లో వ్యతిరేకించినప్పుడు వాటికి వ్యతిరేకంగా నిరసన తెలియచేయటం నేరమెట్లా అవుతుంది? సి.ఏ.ఏ.-ఎన్.ఆర్.సి./ఎన్.పి.ఆర్. లు రాజ్యాంగ విరుద్ధం అని తెలంగాణ అసెంబ్లీలో తీర్మానమే చేసినప్పుడు వాటిని వ్యతిరేకించటం ఈ సంఘాలను "చట్టవిరుద్ధం" గా ప్రకటించటానికి కారణం ఎట్లా అవుతుంది.

2014 లో తెలంగాణ రాష్ట్రం ఏర్పడినప్పటినుండి ప్రజలు సంఘటితపడటం, అసమ్మతి తెలియజేయటం పై నిరంతరం దాడులు జరుగుతున్నాయి. ధర్నా చౌక్‌ను మూసివేయటం దగ్గర నుండి ఇటీవల రెండు రాష్ట్రాలలోను ఉద్యమకారుల ఇళ్లపై ఎన్.ఐ.ఏ.దాడుల వరకు గత 7 ఏళ్లలో రాజ్యం యొక్క వైఫల్యాలను, అత్యాచారాలను ప్రశ్నించే ప్రస్వామిక అవకాశాలు పూర్తిగా కుంచించుకుపోతున్నాయి. ప్రజాస్వామిక చట్రంలో బహిరంగంగా పని చేయాలనుకునే సంఘాలకు అవకాశాలు లేకుండా ప్రభుత్వం చేపట్టిన చర్యలు ప్రతికూల ఫలితాలను ఇస్తున్నాయి.

మిగిలిన దేశమంతా ఎదుర్కుంటున్నట్లే తెలంగాణ కూడా తీవ్ర కోవిడ్ ఆరోగ్య సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నది. ఇటువంటి సమయంలో ప్రభుత్వాలు తన వనరులను ఇతర అంశాల కు మళ్లించటం సమంజసం కాదు. మన ప్రభుత్వం తన శక్తిని వనరులను, దృష్టినంతటినీ అందరికీ టీకాలు అందించటం, కోవిడ్ బారిన పడిన వారికి హాస్పిటళ్లలో పడకలు అందుబాటులో ఉంచటం, అవసరమైన వైద్య సదుపాయాలు, రక్తం, ప్లాజ్మా, ఆక్సిజెన్ సరఫరా అందించటం మొదలైనవాటి పైన కేంద్రీకరించాలి.

రాష్ట్ర ప్రభుత్వం ప్రస్తుత ఆరోగ్య సంక్షోభ తీవ్రతను గుర్తించి, ఈ అసాధారణ సమయంలో ఎటువంటి అప్రజాస్వామిక, దురుద్దేశపూరిత చర్యలకు పాల్పడదని ఆశిస్తున్నాము. తెలంగాణ ప్రభుత్వం తన నిర్ణయాన్ని పునరాలోచించి 16 సంఘాలను "చట్టవిరుద్ధంగా" ప్రకటించిన జి.ఓ. 73 ను వెంటనే ఉపసంహరించాలని కోరుతున్నాము.

**జీవన్ కుమార్**, మానవ హక్కుల వేదిక
**మీరా సంఘమిత్ర**, ప్రజా ఉద్యమాల జాతీయ వేదిక
**కన్నెగంటి రవి**, రైతు స్వరాజ్య వేదిక
**పి. శంకర్**, దళిత బహుజన ఫ్రంట్
**ఆశాలత**, మహిళా రైతుల హక్కుల వేదిక
**అంబటి నాగయ్య**, తెలంగాణా విద్యావంతుల వేదిక
**కె. సజయ**, కేరింగ్ సిటిజన్స్ కలెక్టివ్
**ఆర్. వెంకట రెడ్డి**, సామాజిక కార్యకర్త
**ఎం. రాఘవాచారి**, పాలమూరు అధ్యయన వేదిక
ఏప్రిల్, 24 2021

## విరసం సహా 16 ప్రజా సంఘాలపై విధించిన నిషేధాన్ని వెంటనే ఎత్తివేయాలి!

సిపిఐ (మావోయిస్టు) పార్టీకి అనుబంధంగా వున్నాయనే పేరిట విప్లవ రచయితల సంఘం (విరసం), సిఎల్‌సి, సిఎంఎస్ తదితర 16 ప్రజా సంఘాలను తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం నిషేధించడాన్ని మా పార్టీ-సిపిఐ (ఎం-ఎల్) న్యూడెమొక్రసీ తీవ్రంగా ఖండిస్తున్నది. రాజకీయ సంస్థలు, ప్రజా సంఘాలు, ప్రజాస్వామికవాదులు, మేధావులు యీ నిషేధాన్ని ఖండించవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నది. నిషేధం ఎత్తివేత కోసం అందరూ డిమాండ్ చేయవలసినదిగా కోరుతున్నది.

తెలంగాణ రాష్ట్ర సాధనలో ప్రముఖంగా పాల్గొన్న సంస్థలు, నాయకులు కలిగిన సంస్థలు అనేకం యీ నిషేధిత జాబితాలో వున్నాయి. విరసం, పౌర హక్కుల సంఘం (సిఎల్‌సి), చైతన్య మహిళా సంఘం (సిఎంఎస్), ప్రజా కళా మండలి (పికెఎం) లాంటి ప్రజా సంఘాలు తెలంగాణలోనూ, తెలుగు నేల మీదా అనేక దశాబ్దాలుగా

పనిచేస్తున్నాయి. ఇలాంటి ప్రజా సంఘాలను మావోయిస్టు పార్టీకి అనుబంధం పేరిట నిషేధించడం ముమ్మాటికీ నిరంకుశమని మా పార్టీ–సిపిఐ (ఎం–ఎల్) న్యూడెమోక్రసీ తెలియజేస్తున్నది. ఈ నిషేధం భారత రాజ్యాంగం కల్పించిన భావ ప్రకటనా స్వేచ్ఛపై దాడిగానే చూడాలి. బహిరంగంగా ప్రజల మధ్యవుండి పనిచేస్తున్న కార్యకర్తలపై, రచయితలపై ఆంక్షలు పెట్టి, అరెస్టులు సాగించడానికి, జైళ్లల్లో కుక్కడానికి తప్ప యీ నిషేధం మరెందుకూ పనికి రాదు. ఇది ప్రజాస్వామ్యానికి గొడ్డలి పెట్టు లాంటిదని స్పష్టం చేస్తున్నాము.

"నక్సలైట్ల అజెండానే మా అజెండా అని ఉద్యమ కాలంలో స్వయంగా కెసిఆర్ యే ప్రకటించి, తెలంగాణ రాష్ట్రాన్ని సాధించుకున్న ఆరేళ్ళ తరువాత విరసం సహా 16 ప్రజా సంఘాలపై నిషేధం విధించడం నీతిబాహ్యమైన చర్యగా, నిరంకుశ చర్యగా భావిస్తున్నాము.

తెగించి కొట్లాడి సాధించుకున్న తెలంగాణ రాష్ట్రంలో నిషేధాలు, ఆంక్షలు, అడ్డంకులు, అవరోధాలు ఎంత మాత్రమూ వుండరాదని మా పార్టీ కోరుకుంటున్నది. ఇలా వ్యవహరించడం తెలంగాణ ప్రజల ఆకాంక్షయే గాకుండా ఆశయమని మా పార్టీ మరోసారి స్పష్టం చేస్తున్నది.

16 సంఘాలపై విధించిన నిషేధాన్ని వెంటనే ఎత్తివేయాలని మా పార్టీ–సిపిఐ (ఎం–ఎల్) న్యూడెమోక్రసీ తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నది. నిర్బంధం, అణచివేత సమస్యకు పరిష్కారం కాదని మరోసారి ప్రభుత్వానికి గుర్తు చేస్తున్నది.

**(సాదినేని వెంకటేశ్వరరావు)**
రాష్ట్ర కార్యదర్శి
సిపిఐ (ఎం–ఎల్) న్యూడెమోక్రసీ
తెలంగాణ రాష్ట్ర కమిటీ

## విరసం సహా 16 ప్రజా సంఘాలపై విధించిన నిషేధాన్ని వెంటనే ఎత్తివేయాలి!

హైదరాబాద్ పత్రికా ప్రకటన రచయితల, హక్కుల సంఘాల పై నిషేధమా? విరసం, పౌర హక్కుల సంఘం లాంటి రచయితల, హక్కుల సంఘాలతోపాటు 16 ప్రజా సంఘాలను నిషేధించడం ప్రజాస్వామ్య హక్కులను, ప్రశ్నించే వారిని లేకుండా చేసే నిర్బంధకాండ అని సీపీఐ (ఎం–ఎల్) న్యూడెమోక్రసీ తెలంగాణా రాష్ట్ర కమిటీ తరపున భావిస్తున్నాము.

ఇప్పటికే భీమా కొరెగావ్ కేసులో అంతర్జాతీయ విమర్శను, నిరసనను ఎదుర్కొంటున్న బీజేపీ ఫాసిస్టు చర్యకు, ఇది తోడు చర్యగా భావిస్తున్నాము.

రచయితలు, హక్కుల ఉద్యమ నాయకులు తీవ్రవాదులు కాదు. వారు పీడిత ప్రజానీకం గొంతులుగా పనిచేస్తారు. పని చేయనివ్వాలి. వారి నుంచి రాజ్యాంగ విధులకు విరుద్ధంగా ఏమైనా దొర్లితే క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ ప్రకారం చర్యలు తీసుకోవచ్చు. కానీ ఆ సంస్థల కార్యకలాపాలను నిషేధించే చర్య తెలంగాణాలో ఎమర్జెన్సీ కాలంను గుర్తుకు తెస్తుంది.

తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు కోసం పోరాడింది మరింత ప్రజాస్వామ్యం గురించి, ప్రజా హక్కుల గురించి.. విశాల దృక్పథం కోసం.., కానీ తెలంగాణా రాష్ట్రంలో ప్రజల హక్కుల ఆట, పాట, రాత నిషేధానికి గురైతే... చీకటి తెలంగాణా అవుతుంది..

నిషేధం ఉత్తర్వులను వెనకకు తీసుకోవాలి. ప్రజాస్వామిక హక్కులను ప్రభుత్వం గౌరవించాలి.

**డి.వి.కృష్ణ**
రాష్ట్ర కార్యదర్శి, తెలంగాణా రాష్ట్ర కమిటీ
సీపీఐ (ఎం–ఎల్) న్యూడెమోక్రసీ
**పోటు రంగారావు**
రాష్ట్ర సహాయ కార్యదర్శి,
సీపీఐ (ఎం–ఎల్) న్యూడెమోక్రసీ
తేది 24.4.2021

## 16 ప్రజా సంఘాలపై నిషేధం ఎత్తివేయాలి – పీడీఎస్‌యూ

ప్రజా సమస్యలను పరిష్కరించాలని అనునిత్యం పోరాడుతున్న ప్రజా సంఘాలపై విధించిన నిషేధాన్ని వెంటనే ఎత్తివేయాలనీ పీడీఎస్ యూ రాష్ట్ర అధ్యక్ష కార్యదర్శులు జూపాక శ్రీనివాస్ బోయిన్‌పల్లి రాము ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నాము.

కేసీఆర్ ప్రభుత్వం నిషేధించిన ప్రజా సంఘాలు, తెలంగాణ ఉద్యమంలో క్రియాశీల పాత్ర పోషించాయి. తెలంగాణ ఏర్పడిన తరువాత కూడా ప్రజా సమస్యలను నిత్యం వెలికి తీస్తూ, వాటి పరిష్కారంకై ప్రభుత్వాలకు వివిధ రూపాలలో విన్నవిస్తూ తమ పోరాటన్ని కొనసాగిస్తున్నాయి. సమస్యలు వెలికితీసి, ప్రభుత్వం చేస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలను ఎప్పటికప్పుడు ఎండగడుతున్న విధానాన్ని ప్రభుత్వం జీర్ణించుకోలేకనే ప్రజా సంఘాలను నిషేధించింది.

ఈ నిర్ణయం రాజ్యాంగ హక్కులకు, స్ఫూర్తికి విరుద్ధమైనది. ప్రజాస్వామ్యానికి పాతర వేసే నిర్ణయం ఇది. కావున, వెంటనే 16 ప్రజాసంఘాలపై నిషేధాన్ని ఎత్తివేసి ప్రజా సమస్యలను పరిష్కరించే దిశగా ప్రభుత్వాలు ఆలోచించాలని కోరుతున్నాం.

**బోయినపల్లి రాము**
రాష్ట్ర ప్రధాన కార్యదర్శి
28.04.2021

## రాష్ట్రంలోని 16 ప్రజా సంఘాలని నిషేధించిన తెలంగాణా ప్రభుత్వ నిరంకుశాధికార వైఖరిని ఎన్ సీ ఎచ్ ఆర్ ఓ తీవ్రంగా ఖండిస్తోంది

ఏప్రిల్ 23, 2021 నాడు తెలంగాణా ప్రభుత్వం సుప్రసిద్ధమైన విరసంతో సహా 16 ప్రజా సంఘాలని నిషేధించింది. ఈ 16 సంఘాలని నిషేధించడానికి కారణం వాటికి నిషేధిత పార్టీ ఐన కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) తో సంబంధాలుండడం అనేది ప్రభుత్వ వాదన. ఈ సంఘాలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలని రెచ్చగొడుతున్నాయని, "అర్బన్ గెరిల్లా ఎత్తుగడలని" అనుసరిస్తున్నాయని కూడా ప్రభుత్వ వాదన.

ఈ వాదనలని బలపరిచే సాక్ష్యాలని ప్రభుత్వం చూపించలేదు. అంతే కాకుండా, ఈ సంఘాల సభ్యులు 2016 నుంచి జైలులో ఉన్న, 90 శాతం వికలాంగుడైన ప్రొ జీ ఎన్ సాయిబాబా విడుదల కోసం జరుగుతున్న ప్రయత్నాలలో పాలు పంచుకున్నారని, అది కూడా నిషేధానికి కారణమనే ఒక భయంకరమైన, అసాధారణమైన వాదన తెచ్చింది. 15 మంది కార్యకర్తలూ, రచయితలూ, విద్యావేత్తలూ

ప్రస్తుతానికి జైల్లో ఉన్న ఎల్గార్ పరిషద్ - భీమా కోరేగావ్ కేసుని కూడా తెలంగాణా ప్రభుత్వం పేర్కొంది. ఆ కేసుకి సంబంధించి జైల్లో ఉన్న రోనా విల్సన్, వరవరరావుల విడుదల కోసం ఈ నిషేధిత సంఘాలు ప్రయత్నిస్తున్నాయని ప్రభుత్వ ఆరోపణ.

మానవ హక్కుల సంఘాల జాతీయ సమాఖ్య తెలంగాణ ప్రభుత్వ నిరంకుశ వైఖరిని ఖండిస్తూంది. ఈ సంఘాల నిషేధానికి కారణంగా ప్రభుత్వం చూపిన ఎల్గార్ పరిషద్ కేసు ఒక కట్టు కథని స్పష్టంగా తేలిపోయింది. ఈ కేసులో నిందితుల నేరాలకి ప్రధానమైన సాక్ష్యాలుగా చూపించిన రోనా విల్సన్ ల్యాప్ టాప్‌లో ఫైళ్లని, బయట నుంచి నాటారని వాషింగ్టన్ పోస్ట్. పత్రిక దర్యాప్తులో తేలింది.

అంతే కాకుండా, అన్యాయమైన, అమానుషమైన, ప్రొ జీ ఎన్ సాయిబాబా నిర్బంధం కూడా నిరాధారమైన ఆరోపణలపై జరిగింది. ఆయన ఆరోగ్య పరిస్థితి దృష్ట్యా ఈ నిర్బంధం మరీ అన్యాయమైనది.

తెలంగాణా ప్రభుత్వ నిరంకుశ వైఖరిబారిన పడ్డ 16 ప్రజా సంఘాలకీ ఎన్ సీ ఎచ్ ఆర్ ఓ సంఘీభావం తెలుపుతోంది, ప్రభుత్వ దౌర్జన్యమైన ఎత్తుగడలని ఖండిస్తోంది.

**ప్రొ పి. కోయా**
ప్రధాన కార్యదర్శి
ఎన్ సీ ఎచ్ ఆర్ ఓ
న్యూ ఢిల్లీ
ఏప్రిల్ 25, 2021

## ఇది అప్రజాస్వామికం

మహాత్మా గాంధీ, జార్జ్ బెర్నాడ్ షా వంటి అహింసావాదులు కీర్తించిన ప్రముఖ కవి పిబి షెల్లీ ఒకానొక సందర్భంలో "కవులు, సాహిత్యకారులు ఈ ప్రపంచానికి అప్రకటిత శాసనకర్తలు" అని స్పష్టం చేశాడు. రాజులు, ఫ్యూడల్ ప్రభువులు రాజ్యాలు ఏలుతున్న 18 వ శతాబ్దం లోనే షెల్లీ అంత గొప్ప మాట చెప్పాడు. సమాజంలో సాహిత్యకారుల స్థానం ఏమిటో విస్పష్టంగా ప్రకటించాడు. అలాంటిది ఇవాళ మనం 21వ శతాబ్దపు ఆధునిక ప్రజాస్వామిక యుగంలో ఉన్నాం అని చెప్పుకుంటూ తెలంగాణ ప్రభుత్వం విరసం, ప్రజా కళామండలి వంటి రచయితల, కళాకారుల సంఘాల సహా మొత్తం 16 సంఘాలను నిషేధించడం అత్యంత అప్రజాస్వామిక చర్యగా మేం భావిస్తున్నాం. సాహిత్య కళారూపాలు నడుస్తున్న చరిత్రను, సమకాలీన సమాజపు ఆకాంక్షలను నమోదు చేసే భావ వినిమయ వాహకాలు. అటువంటి భావ వాహకాల పీక నులమడం పూర్తి అప్రజాస్వామిక చర్యగా మేం భావిస్తున్నాం. ఇది రాజ్యాంగం కల్పించిన భావ ప్రకటనా స్వేచ్ఛ, సంఘం పెట్టుకునే హక్కులపై దాడిగా మేం పరిగణిస్తున్నాం. తెలంగాణ ప్రజల అస్తిత్వ ఆకాంక్షల నుండి, ప్రజాస్వామిక పోరాటాల నుండి, అనేక మంది త్యాగాల నుండి ఆవిర్భవించిన తెలంగాణ రాష్ట్రంలో ఇటువంటి నిషేధాల సంస్కృతిని నాగరిక సమాజం ఎంత మాత్రం హర్షించదని మేం భావిస్తున్నాం. విరసం తదితర ప్రజా సంఘాలపై తెలంగాణ ప్రభుత్వం విధించిన నిషేధాన్ని తక్షణమే ఉపసంహరించుకోవాలని మీ ప్రభుత్వాన్ని మేం సమిష్టిగా ఏకోన్ముఖంగా కోరుతున్నాం.

-సాహితీ స్రవంతి
-జాషువా సాంస్కృతిక వేదిక
-ఆంధ్రప్రదేశ్ షార్ట్ ఫిల్మ్స్ అసోసియేషన్
- సి ఉమామహేశ్వరరావు
సినీ దర్శకుడు, సంగమం కన్వీనర్
- ఫోరమ్ ఫర్ ఆర్టిస్ట్స్
-ఆంధ్రా ఆర్ట్స్ అకాడెమీ
-సాహితీ తపస్వి పోలవరపు కోటేశ్వరరావు కళా పీఠం

## తెలంగాణలో ప్రజా సంఘాలపై నిషేధాన్ని ఎత్తివేయాలి..!

శ్రీ గౌరవ చీఫ్ జస్టిస్ నూతలపాటి వెంకటరమణగారికి..

మీ సామాజిక చైతన్యం రాజ్యాంగ హక్కులను రక్షించాలి

భారత దేశ అత్యున్నత న్యాయస్థానం 48వ ప్రధాన న్యాయమూర్తిగా మీ ప్రమాణ స్వీకారం చేసిన 24 గంటల ముందే పబ్లిక్ సెక్యూరిటీ యాక్ట్ ప్రకారం తెలంగాణ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి సోమేష్‌కుమార్ మార్చి 30 నిర్ణయాన్ని శుక్రవారం ప్రకటిస్తూ తెలంగాణలో 16 పౌర, విద్యార్థి, రచయితల సంఘాలను ఏడాదిపాటు నిషేధించారు. ఇందులో పౌర హక్కుల సంఘం, విరసం, తుడుందెబ్బ, తెలంగాణ డెమోక్రటిక్ ఫ్రంట్ మొదలైనవి ఉన్నాయి. తెలంగాణ ముఖ్యమంత్రి కె. చంద్రశేఖరరావు ఉమ్మడి రాష్ట్రంలో పౌరహక్కుల పునరుద్ధరణ పోరాటానికి ఏపీసీఎల్‌సీ అధ్యక్షుడిగా పని చేస్తానని అన్నాడు. పౌరహక్కుల ఉద్యమంలో బాలగోపాల్, కన్నబిరాన్ కృషి మీకు తెలియంది కాదు. విరసం తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో ముందుండి పని చేసి భావజాల వ్యాప్తికి కాళోజీ, ప్రొ. జయశంకర్ వంటి వారితో కలిసి పని చేసింది. గొప్ప సాహిత్యాన్ని సృష్టించింది. పలు కోర్టుల్లో పౌరులు విప్లవ రాజకీయాలను విశ్వసించడం నేరం కాదని తీర్పు ఇచ్చినా పాలకుల ఒత్తిడితో, కొత్త చట్టాల వరదులో పలు నిషేధాలు, నిర్బంధాలు ఎడ తెగని ఖైదులు సాధారణమయ్యాయి. డెబ్బై దాటిన భారత ప్రజాస్వామిక ప్రస్థానంలో ప్రజలు ఎంతో సంయమనాన్ని సొంతం చేసుకున్నారు. మీ మాటల్లో చెప్పాలంటే వ్యక్తులుగా ఈ పరిస్థితిని నరిదిద్దేందుకు, వ్యవస్థలో మార్పు తీసుకొచ్చేందుకు ఎంత ఎదురీతతోనైనా ప్రయత్నిస్తూనే ఉండాలి. సత్వర న్యాయం అందించేందుకు న్యాయ సేవల అథారిటీ చైర్మన్‌గా ఎన్నో చర్యలు తీసుకున్న మీరు ఈ నిర్బంధ చట్టాలను, చర్యలను నిలవరించడంలో వెనుకాడరని ఆశిస్తున్నాను.

**చెరుకు సుధాకర్,**
తెలంగాణ ఇంటి పార్టీ

## ప్రజా సంఘాల పై నిషేధం విధించడం ప్రజాస్వామ్యమా..?

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటులో కవిగా, రచయితగా తన బాధ్యతను నిర్వర్తించిన వరవరరావు గారిని, ఆచార్య సాయిబాబా గారి ని అక్రమంగా అరెస్ట్ చేస్తే వారి ని విడుదల చేయమని కోరడం చట్ట వ్యతిరేకమా..!

చట్ట వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడుతున్న పాలకులను ప్రశ్నించడం చట్ట వ్యతిరేకమా..!

ఇది అంబేద్కర్ గారు వ్రాసిన భారత రాజ్యాంగం లో వుందా...!
లేక మీ స్వప్రకటిత రాజ్యంగమా..!

(మిగిలినది 22వ పేజీలో...)

# కొత్త పోరాట ప్రపంచంలోకి




విప్లవ రచయితల సంఘం సాహిత్య పాఠశాల ఏప్రిల్ 11, ఆదివారం విజయవాడలో జరిగింది. ఈ కార్యక్రమం వాస్తవానికి మార్చి 12, 13 తేదీల్లో జరగవలసి ఉండింది. ఆంధ్రప్రదేశ్‌లో స్థానిక సంస్థల ఎన్నికల వల్ల మార్చి 11, 12 తేదీలకు వాయిదా పడింది. ఈ మధ్య కాలంలో కొవిడ్ వైరస్ తీవ్రమైంది. సకెండ్ వేవ్ మరింత ఉద్రిక్తంగా అతి పెద్ద సామాజిక విషాదంగా పరిణమించింది. ప్రజారోగ్యం దృష్ట్యా సాహిత్య పాఠశాలను ఒక్కరోజుకు కుదించకతప్పలేదు. అయినప్పటికీ 280 మంది ప్రతినిధులతో గొప్ప ఆశావహంగా, ఉత్తేజపూరితంగా మరో యాభైల్లోకి విరసం ప్రయాణానికి సైద్ధాంతిక, సాహిత్య భరోసాతో కార్యక్రమం జరిగింది. కొవిడ్ ప్రమాదంతోపాటు, మార్చి 31న రెండు తెలుగు రాష్ట్రాల్లో విరసం తదితర ప్రజాసంఘాల సభ్యులు 30 మంది ఇండ్ల మీద ఎన్ఐఏ దాడులు జరిగి ఉన్నాయి. బహుశా ఎమర్జెన్సీ తర్వాత విప్లవ రచయితలు, కళాకారులు, మేధావులు, పౌర ప్రజా సంఘాల నాయకులు, కార్యకర్తల ఇండ్ల మీద ఇంత పెద్ద ఎత్తున దాడులు జరగడం ఇదే కావచ్చు. ఆ మరుసటి రోజు నుంచే ఎన్ఐఏ విచారణలు మొదలయ్యాయి. ఆ రకంగా కూడా తీవ్ర ఉద్రిక్త పరిస్థితుల్లో సాహిత్యపాఠశాల ఆలోచనాత్మకంగా జరిగింది. బహుశా నిర్బంధాల మధ్య మొక్కవోని ఆచరణే, విశ్వాస ప్రకటనే చరిత్రపట్ల గొప్ప నమ్మకాన్ని ఇస్తాయి. ఆ కాలమే అద్భుతమైన ఆలోచనా సంఘర్షణకు దారి చూపుతుంది. అలా విరసం సాహిత్య పాఠశాల ఫాసిస్టు కల్లోలంలో రూపొందుతున్న కొత్త పోరాట ప్రపంచం దిశగా సాగింది.

ప్రొ. శేషయ్య వేదిక మీద, కా. యాన్‌మిర్దాల్ హాల్లో, కా. పెద్ది క్రిష్ణ ప్రాంగణంలో పతాకావిష్కరణతో కార్యక్రమం మొదలైంది. విరసం జెండాను అధ్యక్షుడు కా. అరసవిల్లి క్రిష్ణ ఆవిష్కరించారు. ఎర్రజెండాను రాంగుడా అమరుడు కా. మున్నా తల్లి కా. శిరీష, అమరులు సుధాకర్, చంటి సోదరి అనసూయ ఆవిష్కరించారు. అమరవీరుల స్థూపాన్ని అమరుడు విజయ్‌కుమార్ తండ్రి రాజారావు, అమరుడు సూర్యం మేనత్త శోభ ఆవిష్కరించారు. విరసం పతాక గీతాన్ని, ఎర్రజెండా, అమరుల పాటలను తంగెళ్ల సుదర్శన్ ఆధ్వర్యంలో విరసం కళాబృందం పాడింది. ఈ సాహిత్య పాఠశాల ప్రతినిధులకు విరసం సభ్యుడు, సాహిత్య విమర్శకుడు శివరాత్రి సుధాకర్ ఆహ్వానం పలికారు. ప్రారంభోపన్యాసం చేయాల్సిన కా. మురళి (అజిత్, కేరళ) కరోనా తీవ్రత వల్ల రాలేకపోయారు. కానీ ఆయన ఫాసిస్టు సందర్భంలో విప్లవ సాహిత్య సాంస్కృతికోద్యమం గురించి చాలా లోతైన, వివరణాత్మకమైన ప్రసంగ పత్రాన్ని పంపించారు. దీన్ని కా. సీఎస్ఆర్ ప్రసాద్ అనువాదం చేయగా, విరసం సహాయ కార్యదర్శి కా. రివేరా చదివి వినిపించారు. తర్వాత మురళి ఇంగ్లీషులో రాసిన క్రిటికింగ్ బ్రాహ్మణిజం అనే పుస్తకం తెలుగు అనువాదాన్ని (అనువాదం: రవి నర్ల, అరవింద, మెట్టు రవీందర్) విరసం ప్రచురించింది. ఈ పుస్తకాన్ని కా. వరలక్ష్మి ఆవిష్కరించి పరిచయం చేశారు. మొదటి సెషన్ ముగింపుగా సాహిత్య పాఠశాల కీనోట్ పేపర్‌పై కా. పాణి ప్రసంగించారు.

భోజన విరామం తర్వాత ఫాసిజానికి వ్యతిరేకంగా పీడిత అస్తిత్వాల ధిక్కారం అనే అంశంపై సమావేశం జరిగింది. దీనికి విరసం సీనియర్ సభ్యుడు కా. సీఎస్ఆర్ ప్రసాద్ అధ్యక్షత వహించారు. ఫాసిజం కమ్యూనిస్టుల సమస్య మాత్రమే కాదని, ఈ దేశంలోని పీడిత అస్తిత్వ సమూహాలని ఒక్కటై పోరాడాల్సిన అవసరం ఉందని అన్నారు. పీడిత అస్తిత్వాల విముక్తి గురించి, ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో పీడిత అస్తిత్వాల పాత్ర గురించి విప్లవ సాహిత్యోద్యమానికి ఉన్న అవగాహనను వివరించారు. ఈ సెషన్‌లో దానీ, మల్లీశ్వరి, కరిముల్లా, మంచికంటి మాట్లాడారు. ఈ సమావేశంలో పాల్గొనాల్సిన స్కైబాబ పంపిన పత్రాన్ని అరసవిల్లి క్రిష్ణ, కాత్యాయనీ విద్మహే పంపిన పత్రాన్ని మల్లీశ్వరి చదివి వినిపించారు.

ఆ తర్వాత రైతాంగ పోరాట సంఘీభావ వేదికపై విప్లవ కవులు

మేడక యుగంధర్ కవి సభ నిర్వహించారు. నాగేశ్వర్, శివరాత్రి సుధాకర్, మందరపు హైమవతి, అనిల్‌డ్యాని, శాకమూరి రవి తదితరులు కవిత్వం చదివారు. ముగింపు సభ కా. అరసవిల్లిక్రిష్ణ అధ్యక్షతన జరిగింది. ఇందులో పౌరహక్కుల సంఘం నాయకుడు ఆంజనేయులు, విరసం సీనియర్ సభ్యురాలు నల్లూరి రుక్మిణి, అక్రమ నిర్బంధంలో ఉన్న ప్రగతిశీల కార్మిక సమాఖ్య కొండారెడ్డి సహచరి లక్ష్మి, లా విద్యార్థిని క్రాంతి తండ్రి ఆంటోని, రివేరా మాట్లాడారు. ఈ సమావేశానికి రావాల్సిన వివి కుమార్తె సహజ పంపిన లేఖను వరలక్ష్మి చదివి వినిపించారు. అలాగే ఈ సాహిత్య పాఠశాలను ఉద్దేశించి భీమాకోరేగావ్ కేసు పరిస్థితి, ఖైదీల స్థితి, సాయిబాబా, స్టాన్‌స్వామిలాంటివాళ్ల అనారోగ్యంపై ఒక అడ్వొకేట్ పంపిన లేఖను రాంకి చదివి వినిపించారు.

కరోనా కట్టడి, ఎన్‌ఐఏ కేసులు, దాడుల నేపథ్యంలో కూడా విరసం సాహిత్యపాఠశాల ఎప్పటిలా ఉత్తేజపూరితంగా జరిగింది. వర్తమాన పోరాటాల మీదేగాక, శ్రామికవర్గం, పీడిత అస్తిత్వ సమూహాలు కలిసి సొంతం చేసుకోవాల్సిన కొత్త పోరాట ప్రపంచం గురించి కూడా గొప్ప ఆశను కలిగించేలా పాఠశాల జరిగింది. అనేక కొత్త ఆలోచనలకు తలుపులు తెరిచింది. ఫాసిస్టు కల్లోల కాలంలోనే పటిష్టమైన సిద్ధాంత పోరాటం కూడా జరుగుతుందనడానికి ఉదాహరణగా సాహిత్య పాఠశాల జరిగింది.

కా. రాము ఆధ్వర్యంలో పుస్తకావిష్కరణ జరిగింది. పి. చిన్నయ్య కథా సంపుటిని శివరాత్రి సుధాకర్, త్రిపురనేని మధుసూదనరావు లేఖలను ఎన్. వేణుగోపాల్, వసంతగానం (యాభై వసంతాల విప్లవ సాహిత్య సిద్ధాంతం) ను కెఎన్ మల్లీశ్వరి, వివి లౌకికవాదం వ్యాసాలు తెహజీబ్‌ను డానీ, చెంచయ్య రాసిన చరిత్రలో కుసుమ ధర్మన్న పుస్తకాన్ని దివికుమార్, అశోక్ కుంబం రాసిన కాషాయ ఫాసిజం పుస్తకాన్ని రమాసుందరి, రివేరా కవిత్వం సబ్జెక్ట్ కరెక్షన్‌ను వంశీకృష్ణ, తూర్పు ముఖాన కెనరీ దీర్ఘ కవితను మందరపు హైమవతి, అరుణతార ఏప్రిల్ సంచికను అశోక్‌కుమార్, అరుణ్ రైతాంగ ఉద్యమ వ్యాసాలు పిడికిళ్లు మొలిచిన పంట చేలును జర్నలిస్టు నరేష్, శ్రీనివాసగౌడ్ కవిత్వం ధైర్య వచనం కోదం కుమార్, తెంగెళ్ల సుదర్శన్ పాటల సంపుటి తంగేడు పూల పాటను నాగేశ్వర్ ఆవిష్కరించారు.

---

(20వ పేజి తరువాత...)

ప్రశ్నించకూడదని కూడ జి.వోలు తెస్తారా..!

అలా అయితే అధికార పార్టీలు కూడ ప్రతిపక్షాలను, ప్రజా సంఘాలను ఎదురు ప్రశ్నించొద్దు..

అలా ప్రశ్నిస్తే మీరు తెచ్చిన జి.వో నెంబర్ 73 మీకు కూడ వర్తిస్తది కదా..!

తెలంగాణ సమాజం లోని ప్రతిపక్షాలకు కూడ వర్తిస్తది గదా..!

జి.వోల పేరుతో నోర్లు మూసే పద్ధతి ఏమి పద్ధతి

ప్రజాస్వామ్య వ్యవస్థలో ఉన్నామా..! లేక నియంతల పాలనలో ఉన్నామా..!

ప్రజాస్వామ్యంలో ప్రజల మధ్య నివసిస్తున్న, ప్రజా సమస్యల పై, ప్రజాస్వామిక,హక్కుల పరిరక్షణ కోసం పోరాడుతున్న వ్యక్తుల పైన, సంస్థల పైన, సంఘాల పైన నిషేధం విధించడం ప్రజాస్వామిక పద్ధతా?

తెలంగాణ రాష్ట్ర సాధనోద్యమంలో ఈ పదహారు సంఘాలు ప్రజాస్వామిక బద్ధంగా క్రియాశీలక భూమిక పోషించిన సంగతి యాది మర్చినరా..! మీరు నిషేధించిన పదహారు సంస్థలు సంఘ విద్రోహ శక్తులైతే వారితో ఆనాడు ఎందుకు కలిసి పనిచేసినట్లు..? ఒకప్పుడు ఈ నిర్బంధాన్ని ఎదుర్కొన్నది మీరే కదా..అధికారంలోకి వచ్చినంక ఇంత తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించడం దేనికి సంకేతం.? మీరంటున్న ఆ సంస్థలు నిన్ననో, మొన్ననో, ఇవాళనో, లేక తెలంగాణ వచ్చినంకనో పుట్టుకొచ్చిన సంస్థలు కావు కదా.

మీరు కూడ ఆ సంస్థలతో కలిసి పనిచేసినవారేగదా.!

మీరు మరియు ఆ నిషేధిత పదహారు సంస్థలు అనేక సంవత్సరాలు గా ప్రజల పక్షాన పోరాడినవారే కదా.!

మీరు అధికారానంతరం ఉద్యమాన్ని మర్చినా, ప్రజ సమస్యలను మర్చినా వారైతే ప్రజా సమస్యలకు అంకితమై ఉద్యమిస్తున్నది వాస్తవం కాదా.!

సమైక్యాంధ్ర పాలకులు కూడ గతంలో ప్రజా సంఘాలపై నిషేదం విదించినరు గదాఆ..! ప్రజా సంఘాల పట్ల వారికి మీకున్న అభిప్రాయాల్లో తేడా ఏమిటి..? వాస్తవానికి తెలంగాణ ప్రాంతంలో ప్రజా సంఘాలపై నిషేదం విధించడం ఇది మొదలేమి కాదు. చివరిదేమి కాదు. కాని తెలంగాణ రాష్ట్ర ఏర్పాటులో ప్రజా సంఘాల రోల్ వెలకట్టలేనిది గదా..! తెలంగాణ భావజాల వ్యాప్తిలోను, ఉద్యమ నిర్మాణంలోను ఒక్క మాటలో చెప్పాలంటే తెలంగాణ ఉద్యమాన్ని రాజకీయ పార్టీలు అలిసిపోయి ఎత్తేసినప్పుడుల్లా సజీవంగా వుంచింది ఈ పౌర సమాజమే కదా.. ఈ తతంగాన్నంత యాది మర్చినరా..! ప్రజా సంఘాల పోరాటాల ఫలితంగా ఏర్పడిన రాష్ట్రంలో అధికారంలోకి వచ్చిన స్వయం పాలకులు ప్రజా సంఘాలకు ఇచ్చే గౌరవం ఇదేనా..! పైగా అర్బన్ ప్రాంతాలలో గెరిల్లా దళాలను తయారుచేస్తున్నరనే అపవాదం మోపుతున్నరు. ఇదేనా తెలంగాణ ఉద్యమ స్ఫూర్తి నుండి నేర్చుకున్నది..? రాష్ట్రం వచ్చిన తర్వాత ఆ పదహారు సంఘాలు చేసిన సంఘ విద్రోహక చర్యలేమిటో నిరూపించగలరా..!ప్రజా క్షేత్రంలో వారు చేస్తున్న కార్యక్రమాలు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు వ్యతిరేకం అనడం అనైతికమైన చర్య కాదా..!

అసంబద్ధమైన చట్టాలు తీసుకొచ్చి ఎలాంటి ఆధారాలు లేకుండా ఏండ్ల తరబడి జైలల్లో విచారణ ఖైదీలుగా నిర్బంధించబడిన కవులను, రచయితలను, హక్కుల నేతలను విడుదల చేయమని కోరడం నేరమా..! ప్రశ్నించడమే రాజ్యవ్యతిరేకమని భావిస్తే ప్రజాస్వామ్య ఉనికికే ప్రమాదం. ప్రజాస్వామ్యాన్ని పౌర హక్కులను గౌరవించడం అలవర్చుకోవాలి గాని..అణచివేత ధోరణులతో ఆధిపత్యం చెలాయిస్తమనడం మంచి పద్ధతి కాదనేది చైతన్యవంతమైన తెలంగాణ సమాజం ఆశిస్తుంది.

పాలకులకు అధికారం ఎప్పటి కి శాశ్వతం కాదు.మార్పు అనేది సహజం ప్రభుత్వాలు ఆ వైపుగా పాలనా విధానాలు రుపొందించాలి

రాజ్యంగం నిర్దేశించిన మార్గంలో నిర్మించబడే చట్టాలకే ప్రజామోదం వుంటది. అలాంటి చట్టాలు శాశ్వతం. రాజ్యాంగంలో పొందుపర్చిన హక్కులు శాశ్వతం. ఎవరైనా రాజ్యాంగానికి లోబడే వ్యవహరించాలి. ఆ కోణంలో పాలన జరగాలనేదే పౌర సమాజం ఆకాంక్ష.

పందుల సైదులు
తెలంగాణ విద్యావంతుల వేదిక
హైదరాబాద్, రాష్ట్ర కమిటీ

# మన సంస్కృతులను బ్రాహ్మణీయ భావజాలం నుండి విముక్తి చేద్దాం!

**కె. మురళీధరన్**



కామ్రేడ్స్

భారత దేశంలోనూ, ప్రపంచవ్యాప్తంగానూ విప్లవోద్యమంలో అమరులైన వీరులందరికీ ఎర్రెర్ర దండాలు! మీ అందరికీ ఎర్రెర్ర దండాలు!

విప్లవ సాంస్కృతిక పతాకను అవిచ్ఛిన్నంగా గత యాభై సంవత్సరాలుగా ఎత్తిపట్టిన విప్లవ రచయితల సంఘం మన దేశంలోని సాంస్కృతిక సంఘాలలో విలక్షణమైనది. తీవ్రమైన అణచివేతను ఎదుర్కొంటూ కూడా విరసం ఈ బాధ్యతను నిర్వర్తించింది, నిర్వర్తిస్తుంది. గత యాభై యేళ్ళ కాలంలో విరసం నిషేధానికి గురైంది, నాయకులు జైళ్ళపాలయ్యారు. విరసం ప్రచురణలను నిషేధించారు. అభివృద్ధి నిరోధక రాజ్యం విరసం నాయకులను, కార్యకర్తలను హత్యలు కూడా చేసింది. అయినా శ్రామికవర్గ భావజాలమైన మార్క్సిజం, లెనినిజం- మావోయిజానికి కట్టుబడి వున్నానని విరసం ఎలాంటి తడబాటు లేకుండా ప్రకటిస్తూనే వున్నది. ప్రజా ప్రయోజనాల కోసం ధైర్యంగా కట్టుబడి వుంది. భారతదేశంలో మావోయిస్టు ఉద్యమానికి పునాదులు వేసిన నక్సల్బరీ సాయుధ రైతాంగ ఉద్యమం నుండి అది పొందిన ఉత్తేజాన్ని కొనసాగిస్తూనే వున్నది.

ఇలాంటి అద్భుతమైన విప్లవాత్మకమైన సంస్థ జరుపుతున్న సమావేశాన్ని ఉద్దేశించి మాట్లాడడానికి ఆహ్వానాన్ని పొందడం నిజంగా గొప్ప గౌరవం. ఇలాంటి అవకాశాన్ని ఇచ్చినందుకు విరసం నాయకత్వానికి నా ధన్యవాదాలు. నా వ్యాస సంకలనం "క్రిటికింగ్ ఆఫ్ బ్రాహ్మినిజం" అనే పుస్తకాన్ని తెలుగులోకి అనువాదం చేసినందుకు వారికి నా కృతజ్ఞతలు.

ఈ సమావేశంలో బ్రాహ్మణీయ హిందూ ఫాసిజం గురించి ప్రసంగించమని నిర్వాహకులు నన్ను కోరారు. సైద్ధాంతికమైన విమర్శకంటే, బ్రాహ్మణవాదాన్ని ఎదుర్కోవడానికి అవసరమైన ఆచరణాత్మక సాంస్కృతిక కర్తవ్యాల మీద నేను దృష్టి కేంద్రీకరించాలని వాళ్ళ అభిప్రాయం. సంఘపరివార్ ఫాసిస్టు మూకలు ప్రతిరోజూ ఎక్కడో ఒకచోట అమానవీయమైన నేరాలకు పాల్పడడాన్ని, ప్రజాస్వామిక హక్కులను అణచివేయడాన్ని మనం చూస్తూనే వున్నాం. వర్తమానంలో మనం జీవిస్తున్న ఇలాంటి ప్రమాదకరమైన సందర్భంలో ఆచరణాత్మక కర్తవ్యాలమీద దృష్టి కేంద్రీకరించడం చాలా అవసరం. అయినా ఆ కర్తవ్యాలకు అవసరమైన నేపథ్యాన్ని, భూమికను తెలియజేయడం కోసం నేను కొంతమేరకు సైద్ధాంతికమైన అంశాలను కూడా ప్రస్తావిస్తాను.

బూర్జువా పాలనలో అణచివేతకు గురవుతున్న దేశాలలోని ఆధునిక పాలకవర్గాలు చాలా తరచుగా ఫాసిస్టు భావజాలానికి లోనవుతాయి. గతంలో భూస్వామ్యపాలనలో అమలులో వున్న 'ఫర్మానాల ద్వారా పాలన'ను నిరంకుశత్వంతో మిళితం చేస్తారు వాళ్ళు. హిట్లర్, ముస్సోలినీల కాలంలోని ఫాసిస్టు ప్రభుత్వాలు కూడా ఇలానే చేశాయి. బూర్జువా ప్రజాస్వామ్యంలోని చట్టబద్ధ పాలనను తోసిపుచ్చి ఫర్మానాల ద్వారా పాలన అమలులోకి వచ్చింది. మూడవ ప్రపంచదేశాలలో బూర్జువా పాలనా రూపమైన పార్లమెంటరీ వ్యవస్థ వునికిలో వున్నప్పటికీ దానిలో అంతర్గతంగా, వ్యవస్థాపరంగా చాలా లోపాలున్నాయి. ఆధునిక బూర్జువా పాలన సునాయాసంగా భూస్వామ్య నిరంకుశ పాలనగా మారిపోవడం ఇలాంటి దేశాలలో ఎప్పుడూ వుండే ఒక స్థితి.

రాజ్యాంగబద్ధమైన హక్కులను కలిగివున్న పార్లమెంటరీ వ్యవస్థ నుండి ప్రజాస్వామిక హక్కులను బహిరంగంగా అణచివేయడానికి మార్పు చెందడం ఖచ్చితంగా ఒక విలక్షణమైన సంఘటన. ప్రస్తుత కాలంలో దీనికి వ్యతిరేకంగా విశాల ప్రజా ప్రతిఘటన తప్పనిసరిగా రూపొందుతుంది. ప్రజాబాహుళ్యంలో పెరుగుతున్న ప్రజాస్వామిక చైతన్యానికి ప్రతిఫలనం అది. ప్రజలు స్వయంగా చేసిన పోరాటాల ఫలితమది. ప్రపంచ వ్యాప్తంగా సమాచారం వ్యాప్తి చెందడం ద్వారా ప్రజలు తమ ఎరుకను అభివృద్ధి చేసుకుంటున్నారు. ఇదంతా పాలకవర్గాల స్పృహలో వున్న విషయం. ఆ కారణంగానే వాళ్ళు ఫాసిజాన్ని స్థాపించడానికి అవసరమైన రాజకీయ, సాంస్కృతిక పునాదిని ఏర్పరుచుకోవడానికి చైతన్యయుతంగా సిద్ధమవుతారు.

ఫాసిస్టు పాలనను న్యాయబద్ధమైన, రాజ్యాంగ ఆమోదం గల పాలనా రూపంగా ప్రజలచేత గుర్తింప చేయడానికి వాళ్ళు ప్రయత్నిస్తారు. అన్ని ప్రజాస్వామిక హక్కులను, కార్మికుల, పాలకవర్గాలలోని తమ వ్యతిరేకుల హక్కులను అణచివేయడం ఇందులో భాగం. మోడి పాలనద్వారా ఆర్‌యస్‌యస్ మనదేశాన్ని ఆ వైపుగా నెడుతోంది. అయితే ఆ స్థితి ఇంకా పూర్తిగా రాలేదు. మనం ఒక ధోరణిని ఉద్యమం నుండి తప్పనిసరిగా వేరుచేసి చూడాలి. ఫాసిస్టు పాలనకు సంబంధించిన బలమైన లక్షణాలు వర్తమానంలో పెరుగుతున్నాయి. అయినా ఇప్పటికీ పరిస్థితి 1975 నాటి అత్యవసర పరిస్థితిలాగా లేదు.

దళితులను, నడిమి కులాలను, ఆదివాసీలను తమ శ్రేణులలో భాగంగా. చేసుకోవడానికి ఆర్‌యస్‌యస్ శక్తివంతంగా పనిచేస్తోంది. అణచివేతకు గురవుతున్న కులాల నుండే ఒక శిష్ట వర్గం తలెత్తింది. వాళ్ళ దోపిడీ ప్రయోజనాలు పెరుగుతున్న కొద్దీ దానితో సమానంగా వాళ్ళు బ్రాహ్మణీకరణ చెందుతున్నారు. తమ సాంఘిక హోదాను పెంచుకోవడానికి, తమ ప్రస్తుత ప్రయోజనాలకు అనుగుణంగా వుండేటట్లు వాళ్ళంతట వాళ్ళే గతంలోని తమ పోరాటాలను 'శుద్ధి' చేసుకొంటున్నారు. వాళ్ళను తమలో సంలీనం చేసుకోవాలనే ఆర్‌యస్‌యస్ వ్యూహం, ఈ శిష్టుల ఆలోచనలు పరస్పర ఆధారాలు. అందుచేతనే కేవలం కుల ఆధారిత ఐక్య సంఘటనల ద్వారా ఆర్‌యస్‌యస్ ఎత్తుగడలను ప్రతిఘటించడానికి చేసే ప్రయత్నాలకు ఖచ్చితంగా అవరోధాలు ఎదురవుతాయి.

తమ ఆధిపత్యానికి అనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టటానికి పాలకవర్గాలు చేస్తున్న ప్రయత్నాలను బహిరంగంగా మిలిటెంట్‌గా ఎదుర్కోవడం మన కర్తవ్యం. ఆ ఉద్యమానికి బ్రాహ్మణవాద విమర్శను మనం కేంద్రంగా చేసుకోవాలి. గాంధీ– నెహ్రూ తరహా సాధుపూర్వకమైన బ్రాహ్మణవాదం ద్వారా ఈ కర్తవ్యం పూర్తికాదు. వాళ్ళు ప్రదర్శించిన ఉదారవాదం, ప్రజాస్వామ్యం వంటివన్నీ పైపై మెరుగులు మాత్రమే. వాళ్ళు మన సమాజ నేపథ్యంలో ప్రజాస్వామికీకరణకు చెందిన మౌలికమైన సమస్యలను పట్టించుకోలేదు. ఆర్‌యస్‌యస్, దాని అనుచరవర్గం అమలు పరుస్తున్న బ్రాహ్మణీయ ఫాసిస్టు ఎజెండాకు వ్యతిరేకంగా అర్థవంతమైన పోరాటాన్ని గతంలోని బ్రాహ్మణీయ వ్యతిరేక భక్తి ఉద్యమాలలోకి వేళ్ళూనిన ప్రజా ఉద్యమాలు మాత్రమే చేయగలవు. అయితే ఆ వుద్యమాలను ప్రతిపాదించిన విలువలను, బోధనలను వల్లెవేసుకుంటే చాలదు. కావల్సింది కిందిస్థాయి నుండి ప్రారంభమైన ఉద్యమాలు. వర్గం, కులం, లైంగికత, జాతి, మతమైనారిటీ, జాతీయత, ప్రాంతీయత, పర్యావరణ అంశాలకు సంబంధించిన ఉద్యమాలన్నింటినీ ప్రోత్సహించాలి. ఈ ఉద్యమాల ద్వారా విశాలమైన రాడికల్ ప్రజాస్వామిక వేదికను నిర్మాణం చేయాలి. దాని ద్వారా ఏకాభిప్రాయంగల ప్రతిఘటనను రూపొందించాలి. పాలకవర్గాలను, ఆర్‌యస్‌యస్ దాని ఫాసిస్టు మూకలను ఎదుర్కోవడం కోసం శక్తివంతమైన నిరంతరాయంగా పనిచేసే ఉద్యమాన్ని నిర్మాణం చేయాలంటే ఇది తప్పనిసరి.

ఈ విశాలమైన చట్రంలోనే సాంస్కృతిక రంగంలో మన కర్తవ్యాలను నిర్దేశించుకోవాలి. ఇది రెండు బాధ్యతలను మన ముందుంచుతున్నది. అవి పరస్పర సంబంధితాలే అయినప్పటికీ దేనికదే ప్రత్యేకమైనవి. ఒకటి, సాధ్యమైనంత సమగ్రంగా పాలకవర్గాల ఆధిపత్య ఏకాభిప్రాయ సాధన కుట్రను బహిర్గతం చేసి సవాల్ చేయడం. రెండవది, ఆధిపత్య ప్రతిఘటనా ఏకాభిప్రాయాన్ని వ్యక్తీకరించడం, ప్రచారం చేయడం. దాని మూలాలు మన ప్రజల ప్రజాస్వామిక సాంప్రదాయాలలో వేళ్ళూనుకుని వుండాలి. ఈ రెండింటిలోనూ ఖచ్చితంగా రెండవ కర్తవ్యమే నిర్ణయాత్మకమైనది.

బ్రాహ్మణవాదాన్ని మనకు సంబంధించని, బయటివిషయంగా చూడకూడదు. అది ఖచ్చితంగా మన జీవితంలో, పెంపకంలో, సాంఘిక అలవాట్లలో, భాషలో అంతర్భాగం. "ఇతరులను" తనలో సంలీనం చేసుకోవడం ద్వారా బ్రాహ్మణవాదం ఆధిపత్యాన్ని సాధించి చెలాయిస్తుంది.

సంఘ్ పరివార్ ఉత్తర భారతదేశానికి చెందిన వైష్ణవ నమ్మకాలను, క్రతువులను ప్రోత్సహించడానికి నిరంతరం ప్రయత్నిస్తున్నది. ఇలా చేయడం ద్వారా హిందూవాదంతో కూడిన ఒక భారతీయ గుర్తింపు నమూనాను ప్రజలచేత ఆమోదింపచేసి అమలు చేయాలని ఆలోచిస్తున్నది. తన బ్రాహ్మణీయ హిందూ ఫాసిస్టు ప్యాకేజీలో ఇది అంతర్భాగం. జాతీయ, ప్రజాస్వామిక సాంస్కృతిక విలువలను, ప్రజల గుర్తింపులను తక్కువ చేయడం, వాటిని పూర్తిగా రద్దు చేయడం దాని లక్ష్యం. ఫాసిస్టు దాడిని ఎదుర్కోవడంలో ప్రజలను నిరాయుధులను చేయడానికి అది ఈ విధంగా ప్రయత్నిస్తోంది. బ్రాహ్మణవాదాన్ని సవాలు చేస్తూ, ప్రత్యామ్నాయ సంస్కృతులను వ్యాప్తి చేయడం కోసం ఉపఖండం అంతటా చెలరేగిన భక్తి ఉద్యమాలు, సాంస్కృతిక పునరుజ్జీవన ఉద్యమాల వ్యక్తీకరణ ప్రజల భాషలో, నుడికారంలో జరిగిందని మనం మర్చిపోరాదు.

భారత పాలకవర్గాల– భూస్వామ్యవర్గమైనా, దళారీ బ్యూరోక్రాటిక్ బూర్జువావర్గమైనా– భావజాలానికి బ్రాహ్మణవాదం నిత్యం కేంద్రకంగా వుంటూ వచ్చింది. బ్రిటీష్ పాలనాకాలంలో ఈ వర్గాల మధ్య మిత్రత్వం రూపొందడంలోనూ, అభివృద్ధి చెందడంలోనూ ఇది ప్రధాన అంశంగా వుండింది. అయితే ఈ బ్రాహ్మణవాదం మధ్య యుగాలనాటి సాంప్రదాయక కుల ఆధారిత భూస్వామ్యం కాదు. వలసవాద, ఆధునికత వత్తిళ్ళ కారణంగానూ, ప్రభావాల కారణంగానూ దీని నమూనా మారి కొత్త రూపాన్ని ధరించింది. కింది నుంచి వస్తున్న డిమాండ్లకు, వత్తిళ్ళకు అనుగుణంగా దీని వ్యక్తీకరణ, దృక్పథం కూడా మారుతూ వచ్చింది.

1960ల నాటి నుండి ఆధిపత్య ఏకాభిప్రాయం తీవ్రమైన సంక్షోభాన్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. సామ్రాజ్యవాదం మీద ఆధారపడడం అనే వాస్తవం, పాలకులు ప్రవచిస్తున్న 'సామ్యవాద, లౌకిక, ప్రజాస్వామిక' భావనల డొల్లతనం ఎప్పటికప్పుడు మరింతగా బహిర్గతమయ్యాయి. జాతి ఉద్యమాలు, వివిధ సెక్షన్ల ప్రజా ఉద్యమాలు రాజ్య న్యాయబద్ధతను సవాల్ చేయడం విస్తృతమైంది. నక్సల్బరీ సాయుధ రైతాంగ తిరుగుబాటు దేశాన్నంతటినీ కుదిపివేసింది. ఇందిరాగాంధీ పాలనలో ప్రజాకర్షక విధానాలతో కూడిన ఫాసిస్టు పాలన ద్వారా ఆధిపత్యాన్ని పునరుద్ధరించడానికి ఒక ప్రయత్నం జరిగింది. అది కూడా విఫలం కావడంతో కుల ఆధారిత రిజర్వేషన్లు, లౌకికవాదం వంటి అంశాలకు సంబంధించిన భావజాలాన్ని కొత్త నమూనాలో రూపొందించాల్సిన అవసరం ఏర్పడింది. రాజ్య అజమాయిషీలోని పబ్లిక్ సెక్టార్ ఆర్థిక నమూనా క్రమక్రమంగా కుప్పకూలి పోయింది. నామ మాత్రంగా వున్న స్వీయ ఆధారిత ఆర్థిక వ్యవస్థ స్థానంలో బహుళజాతి కంపెనీలు లోతుగా చొచ్చుకుపోయాయి. సోవియట్ యూనియన్ కుప్పకూలటం, 1990లలో ప్రపంచీకరణ ఎజెండాను పెద్ద ఎత్తున ప్రోత్సహించడంతో ఆర్థికవ్యవస్థ ఒక గొప్ప మార్పుకు గురైంది.

నాకు తెలిసినంతవరకు విరసం వ్యవస్థాపక నాయకత్వం, తదనంతర కాలానికి చెందిన కార్యకర్తలు ప్రధాన స్రవంతికి చెందిన సాంస్కృతిక నమూనాలను బద్దలు కొట్టి ప్రజా సంస్కృతిని క్రియాశీలకంగా ప్రోత్సహించారు. భాషకు సంబంధించి చాలా విప్లవాత్మక మార్పులు జరిగాయి. అయినప్పటికీ ఈనాడు మనం ఎదుర్కొంటున్న వాస్తవాల దృష్ట్యా మనం ప్రతి అంశాన్ని మార్పుకు గురిచేయాలని మిమ్మల్ని నేను కోరుతున్నాను. వలసవాద ఆధునీకరణను, ప్రజాస్వామికీకరణకు

(మిగిలేది 40వ పేజీలో...)

# ఫాసిస్టు కల్లోలంలో రూపొందుతున్న కొత్త పోరాటాల ప్రపంచం

పాణి

## మరో యాభైల్లోకి విరసం

మిత్రులారా, కామ్రేడ్స్..

కరోనా నిర్బంధాన్ని, ఎన్ఐఏ సహా అనేక రాజ్య నిర్బంధాలను అధిగమించి ఈ సాహిత్య పాఠశాలకు వచ్చిన మీ అందరికీ విప్లవాభివందనాలు. అనేక కారణాల వల్ల ఇక్కడికి రాలేకపోయినప్పటికీ మనసంతా ఇక్కడే నిలుపుకున్న మిత్రులకూ ఉద్యమాభివందనాలు.

ఈ సాహిత్య పాఠశాల ప్రోగ్రాం ప్రకటించినప్పటి నుంచి విరసం చాలా సాహసానికి సిద్ధమవుతోందని కొందరు అన్నారు. కానీ ఎన్ఐఏ పడగ నీడన జరుగుతున్న ఈ సభకు వచ్చిన మీరు అసలైన సాహసికులు. విరసం యాభై ఏళ్లుగా అయినా, మరో యాభైల్లోకైనా చేస్తున్న ఈ ప్రయాణమైనా మీరు లేకుండా సాధ్యం కాదు. ఈ కాలం పొడవునా విరసం చేసిన, చేస్తున్న సాహసానికంటే విరసం చుట్టూ మీ వంటి అభిమానుల సాహసమే విలువైనది. గొప్పది.

మూడు తరాలుగా తెలుగు నేల మీద లక్షలాది మంది అభిమానులు విప్లవ సాహిత్య సాంస్కృతికోద్యమానికి ఉన్నారు. బహుశా మరే సాహిత్యోద్యమానికి ఇంత మంది అభిమానులు, మిత్రులు ఉండకపోవచ్చు. విప్లవ సాహిత్యానికి పాఠకులుగా, శ్రోతులుగా, విరసం భావాల ప్రసారానికి మాధ్యమంగా మీరంతా లేకుంటే విప్లవ రచయితల సంఘం ఉనికే లేదు. అత్యంత ప్రమాదభరితమైన, దు:ఖకరమైన ఈ కన్నీటి ప్రయాణం మేం ఒక్కళ్లమే చేయగలిగేది కాదు.

ఈ సభలో ఉండాల్సిన విరసం వ్యవస్థాపక సభ్యుడు వరవరరావు సుదీర్ఘ జైలు జీవితం తర్వాత ఆరు నెలల మెడికల్ బెయిల్ అనే గృహ నిర్బంధంలో ఉన్నారు. మరో సీనియర్ సభ్యుడు ప్రముఖ కవి ప్రొ. సాయిబాబా జీవిత ఖైదుగా ఉన్నారు. ఈ సభలో తప్పక ఉండవలసిన ఆంధ్రప్రదేశ్‌లోని పది మంది వివిధ ప్రజా సంఘాల నాయకులు, సభ్యులు జెయిళ్లలో ఉన్నారు. ఈ రోజు ఇక్కడికి వద్దామని అనుకున్న ఎందరో మిత్రులు ఎన్ఐఏ విచారణలో ఉండి రాలేకపోయారు. మాతోపాటు ఈ వేదిక మీద ఉండవలసిన ప్రజా కళామండలి కళాకారులు ఒక్కరు కూడా రాలేని నిర్బంధంలో ఉండిపోయారు.

అయినా ఇక్కడ మనం సమావేశమయ్యాం. అట్లని ఇది కష్టకాలమని, అణచివేతకాలమని, బాధా సమయమని మేం అనుకోవడం లేదు. ఇప్పుడే కాదు. గతంలో కూడా అనుకోలేదు. ఇది చాలా ఉద్విగ్న, విషాద కాలమే కాదు. గొప్ప ఉత్సాహ కాలం కూడా. ఇది కన్నీటి కాలమే కాదు. గొప్ప ఆశావహ కాలం. యాభై ఏళ్లుగా చాలా కష్ట నష్టాలు అనుభవించి ఉండవచ్చు, కానీ విప్లవం గురించి మా స్వప్నాలు చెదిరిపోలేదు. మేం బాధలు అనుభవించి ఉండవచ్చుగాని ధైర్యాన్ని కోల్పోలేదు. చరిత్రపట్ల మా తార్కిక విశ్వాసాలు మరింత గట్టిపడ్డాయి. ఇది పోరాటాల కాలం కాదని చెప్పడానికి చాలా మంది తమ మేధస్సునంతా వెచ్చిస్తున్నారు. కానీ ఇది అత్యద్భుత పోరాట కాలమని చెప్పడానికి ఈ రోజు మీ ముందుకు ఇలా వచ్చాం. రచయితలుగా మేం ఈ విశ్వాస ప్రకటన తప్ప మరేమీ చేయలేం. ఇదంతా కేవలం కల్పన కాదు. మార్క్సిస్టులుగా మా విశ్లేషణ. దాన్ని మీ ముందు ప్రకటించడానికే ఈ సభలు. ఇది కల్లోల వర్తమానమే. ఇక్కడి నుంచే విరసం మరో యాభైల్లోకి ప్రయాణిస్తోంది. రూపొందుతున్న ఈ కొత్త పోరాట ప్రపంచంతోనే తప్ప ఒంటరిగా ప్రయాణించడం మాకు సాధ్యం కాదు. అంతిమంగా ఈ దేశ ప్రజల విముక్తి పోరాటాలు లేకుండా విరసం భవిష్యత్తు లేదు. విరసానికి భరోసా ఏమంటంటే అలుపులేని ఈ ప్రజా పోరాటాల సంప్రదాయమే. అది అవిచ్ఛిన్నమైనది. ఉజ్వలమైనది. అదే ఆలంబన. అదే ఉత్తేజం.

ప్రొ. శేషయ్యగారు.. మా తరం విరసం నాయకత్వానికి ఆయన అచ్చమైన మార్క్సిస్టు ఉపాధ్యాయుడు. ఆయన విప్లవ విద్యార్థి ఉద్యమం నుంచి బయల్దేరాడు. జీవితమంతా తెలుగు సమాజాల్లోనే కాదు, యావత్ దేశంలోనే పౌర హక్కుల పరిరక్షణ కోసం పని చేశాడు. పౌరహక్కుల ఉద్యమానికి ఉదారవాదమనే వేరు పురుగు సోకిన వేళ దాన్నుంచి కాపాడ్డానికి ఆయన హక్కుల నాయకుడిగా సాహసికంగా ముందుకు వచ్చి నిలబడ్డాడు. ఈ కరోనా కాలం ఆయన్ను అర్ధాంతరంగా ఎగరేసుకపోయింది. ఆయన స్మృతిలో ప్రొ. శేషయ్య వేదిక మీద ఈ సాహిత్య పాఠశాల జరుపుకుంటున్నాం.

కామ్రేడ్ యాన్‌మిర్డాల్.. వలస వ్యతిరేక ప్రజా పోరాటాలకు, వలసానంతర సమాజాల్లోని విప్లవ పోరాటాలకు సన్నిహిత మిత్రుడు. నా అధ్యయన పరిమితి వల్ల నేను ఆయన పేరు మొదటిసారి 'రెడ్ స్టార్ ఓవర్ ఇండియా' పుస్తకంతోనే విన్నాను. ప్రపంచ విప్లవ ప్రజలకు దండకారణ్యాన్ని పరిచయం చేయడానికి ఆయన ఇక్కడికి వచ్చాడు. దండకారణ్య విప్లవోద్యమాన్ని ఆయన విస్తారమైన ప్రపంచ విప్లవోద్యమ అవరణలోంచి స్థూల, సూక్ష్మ స్థాయిల్లో చూశాడు. ఇప్పుడు మనం నూరేళ్ల భారత కమ్యూనిస్టు ఉద్యమ సందర్భంలో కూడా ఉన్నాం. ఇన్నేళ్లలో భారత కమ్యూనిస్టులు ఏం చేశారని ప్రశ్నించే వాళ్లు చాలా మంది మన చుట్టూ ఉన్నారు. అంతా ఈనకాచి నక్కలపాలైందని చెప్పడానికి ఉబలాటపడుతున్నవాళ్లు ఉన్నారు. నిజమే.. చాలా ఆటుపోట్లు ఉన్నాయి. వైఫల్యాలు ఉన్నాయి. కానీ భారత విప్లవోద్యమం ఇవాళ ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలోనే ఒక గుణాత్మక సంకేతంగా ఉన్నది. యాన్‌మిర్డాల్ భారత్‌పై అరుణతారలో ఈ విశ్లేషణే చేశాడు. ఇరవై ఒకటో శతాబ్ది విప్లవ ప్రపంచంలో ఆయన దండకారణ్యాన్ని గుర్తించాడు. అలాంటి విప్లవ మేధావి యాన్‌మిర్డాల్ హాల్లో ఈ పాఠశాల జరుపుకుంటున్నాం.

కామ్రేడ్ పెద్ది క్రిష్ణ.. ఆయన జీవితంలో చాలా ఆటుపోట్లు. అనేక సంక్షోభాలను ఎదుర్కొన్నాడు. ఒక కాలంలో తీవ్ర నిర్బంధాన్ని అనుభవించాడు. పెద్దగా వ్యక్తీకరణ ఉన్నవాడు కూడా కాదు. కానీ విప్లవ రాజకీయాలను అంటిపెట్టుకొని జీవించాడు. చివరి దాకా విరసం సభ్యుడిగా ఉండి అనారోగ్యంతో చనిపోయాడు. ఆయన పేరును ఈ ప్రాంగణానికి పెట్టుకున్నాం.

ఫాసిస్టు కల్లోలంలో రూపొందుతున్న కొత్త పోరాట ప్రపంచం.. అనే ఇతివృత్తం మీద ఈ సాహిత్య పాఠశాల జరుగుతున్నది. యాభై ఏళ్లు పూర్తి చేసుకొని మరో యాభైల్లోకి విరసం ఈ కొత్త పోరాట ప్రపంచంతో కలిసి చరిత్రలోకి కొనసాగుతున్నది. అంటే ఈ వర్తమాన పోరాటాలను ఎలా అర్థం చేసుకోవాలి, ముఖ్యంగా ఈ ఫాసిస్టు కల్లోలాన్ని ఎలా అర్థం చేసుకోవాలి, దానికి వ్యతిరేకంగా సాగే పోరాటాలు బలపడటానికి ఎలాంటి అవకాశాలు ఉన్నాయి, ఫాసిజాన్ని ఓడించి విప్లవాన్ని విజయవంతం చేయడానికి ఈ సంక్షోభంలోనే మూలాలు ఎలా ఉన్నాయి, దీనికి తగినట్లు సాహిత్య సాంస్కృతికోద్యమాన్ని రాబోయే రోజుల్లో నిర్మించడానికి సిద్ధాంత, భావజాల రంగాలను ఎలా సిద్ధం చేయవలసి ఉన్నది..? అనే విషయాలు ఈ కీనోట్‌లో మీతో పంచుకోవాలని విరసం భావిస్తోంది.

ఇది చాలా విస్తారమైన అంశం. దీని మీద మీతో సహా చాలా మందికి అనేక అభిప్రాయాలు ఉంటాయి. ఉండాలి కూడా. అన్నీ కలిస్తేనే ఒక సమగ్రమైన అవగాహన అవుతుంది. ప్రజాస్వామిక, లౌకిక, విప్లవ శిబిరాలన్నీ ఈ విషయం గురించి లోతైన అంతర్మథనంలో ఉన్నాయని నాకు తెలుసు. అలాంటి అవసరం ముంచుకొచ్చింది. అయితే మనమేమీ నిరాయుధంగా లేం. యథాలాపంగా లేం. ఇప్పటి దాకా కూడా చాలా లోతైన అవగాహనతోనే, పటిష్టమైన ఆచరణతోనే ఉన్నాం. మన గత, వర్తమాన ప్రయాణమంతా శుష్కప్రాయమని అనుకున్నామంటే మనకు భవిష్యత్తు లేనట్లే. ప్రజలను అవమానపరిచినట్లే. ఇప్పటి దాకా మనకున్న అవగాహనలను మథించి కొత్త భావజాల, సిద్ధాంత కొనసాగింపును సాధించాల్సి ఉన్నది. ఇవాళ్టి మన సూత్రబద్ధ వైఖరులను చాలా విస్తరించుకోవాల్సి ఉన్నది. కొత్త వివరణలు ఇచ్చుకోవాల్సి ఉన్నది. కొన్ని పాత అభిప్రాయాలు వదిలించుకొని కొత్త అవగాహనలను సంతరించుకోవాల్సి ఉన్నది.

నిజానికి ఇప్పుడే కాదు. విరసం గత యాభై ఏళ్లలో విప్లవ సాహిత్యోద్యమ కర్తవ్యాలను అనేక సార్లు ఇలాంటి ప్రాతిపదికల మీద పదే పదే పునర్నిర్వచించుకొన్నది. గొప్ప కొనసాగింపును సాధించగలిగింది. అందు వల్లే ఈ యాభై ఏళ్లలో అనేక కల్లోలాలను ఈది ఇక్కడి దాకా వచ్చింది. తెలుగు ప్రజల, భారత ప్రజల పోరాట చరిత్రలో తనకొక చరిత్రను నిర్మించుకున్నది. ఈ స్ఫూర్తితో ఇప్పుడు మరింత గట్టిగా ఈ పనికి సిద్ధమైంది. కాబట్టి దీనికి సంబంధించిన కొన్ని మౌలిక విషయాలను మాత్రమే ఈ కీనోట్ పేపర్‌లో మీ ముందు పెడతాను.

ఈ పత్రంలో మూడు ముఖ్యమైన విషయాలు ఉన్నాయి. 1. వర్తమాన ప్రపంచంలోని పోరాటాలను అర్థం చేసుకోవడం, 2. రూపొందుతున్న భవిష్యత్ గురించిన సిద్ధాంత చట్రం, 3. నిర్దిష్టంగా విప్లవ సాహిత్య సాంస్కృతిక వ్యూహం.

1. మనం గత కొన్నేళ్లుగా అనేక ప్రజా సంచలనాలను చూస్తున్నాం. ఆ మాటకొస్తే భారతదేశంలో గత ఆరేడు దశాబ్దాలుగా నిరంతరం ప్రజా పోరాటాలు జరుగుతూనే ఉన్నాయి. అవి 'ప్రధాన స్రవంతి' గుర్తించేవి కావచ్చు. పట్టించుకోనివీ కావచ్చు. వ్యవస్థ కేంద్ర స్థానంలోంచి, అంచుల్లోంచి, ఊహించని మూలల నుంచి ప్రజా ఉద్యమాలు ముందుకు వస్తున్నాయి. అయితే ఈ వర్తమాన ప్రజా పోరాటాలకు ఒక ప్రత్యేకత ఉన్నది. దీన్ని రెండు మూడు వైపు నుంచి చూడాలి. అవేమంటే..

ఒకటి: వామపక్ష, విప్లవ పోరాటాలన్నీ అడుగంటిపోయాయనే తీవ్ర దుష్ప్రచారం జరుగుతున్న తరుణంలో ఈ ఉద్యమాలు జరుగుతున్నాయి. రెండు: ఫాసిజం పై చేయి సాధించిన తరుణంలో భయం, ఆందోళన, రాజీ తప్ప ఇక ఏ ప్రజా వ్యక్తీకరణకు చోటు లేని స్థితి ఏర్పడిందనే నిరాశాపూరిత వాదనలు చెలరేగుతున్న తరుణంలో ఈ పోరాటాలు జరుగుతున్నాయి. మూడు: అంతిమంగా ఈ దుర్మార్గ వ్యవస్థలో సర్దుకపోయి బతకడం కంటే (ఈ వ్యవస్థకు చిన్న చిన్న మెరుగులు దిద్దుకుంటూ) వేరే గత్యంతరం లేదనే వాదన బలపడుతున్న సమయంలో ఈ పోరాటాలు జరుగుతున్నాయి. విచిత్రమేమంటే ఈ వాదనలు చేస్తున్నవాళ్లు ఒక తరహా కాదు. మార్క్సిస్టులుగా పేరు మోసిన వాళ్లు ఒక వైపు, బూర్జువా వ్యవస్థ సమర్థకులు ఇంకో వైపు ఉన్నారు.

గతంలో జరిగిన ప్రజాస్వామిక పోరాటాలకు ఇప్పటి పోరాటాలకు ఉన్న ఒక తేడా ఇదే. భావజాల పరంగా ఇది చాలా ప్రత్యేకమైన కాలం. ఇలాంటి కాలంలో ఈ మహత్తర పోరాటాలు జరుగుతున్నాయి.

గత కొన్నేళ్లుగా దేశవ్యాప్తంగా విశ్వవిద్యాలయాల్లో విద్యార్థులు, అధ్యాపకులు వెల్లువలా ఉద్యమాలు చేశారు. దాడులు, కేసులు, జైలు జీవితాలు అనుభవిస్తున్నారు. విశ్వవిద్యాలయాలు భావ సంఘర్షణ కేంద్రాలు కావాలనే మాటను ఈ పోరాటాలు మరోసారి నిరూపించాయి. నిజంగానే అనేక కొత్త అధ్యయనాలకు, సూత్రీకరణలకు, నినాదాలకు ఈ ఉద్యమాలు ఊపిరి పోశాయి. కొత్త పోరాట రంగం కొత్త మేధో రంగాన్ని నిర్మిస్తుందనే వాస్తవాన్ని నిరూపించాయి.

సరిగ్గా అలాంటిదే సీఏఏ, ఎన్ఆర్‌సీ వ్యతిరేక ఉద్యమం. ఈ దేశంలోని ముస్లింలను ఒంటరివాళ్లను చేసి, ఈ నేలకు పరాయివాళ్లను చేయాలనే కుట్రను ఈ ఉద్యమం ఓడించింది. బహుశా సంఘ్ శక్తుల నిరంకుశ ఫాసిస్టు విధానాలకు అతి పెద్ద ఎదురు దెబ్బ ఈ ఉద్యమం వల్ల కలిగింది. ముస్లిం ప్రజల నుంచి హిందుత్వ ఫాసిస్టులకు ఇంత ప్రతిఘటన గతంలో జరిగి ఉండకపోవచ్చు. దీనికి ఒక కారణం ఉంది. ఈ సమస్య ముస్లింలది మాత్రమే కాదని, దేశ ప్రజలందరిదనే వైఖరిని మన దేశంలోని లౌకిక ప్రజాస్వామిక విప్లవ పీడిత అస్తిత్వ శక్తులు తీసుకోవడం వల్ల సంఘ్ పరివార్ కుట్ర బట్టబయలైంది. ఆ రకంగా ఈ ఉద్యమం సకల ప్రజానుకూల శక్తుల ఐక్యతను చాటింది. ఫాసిజానికి వ్యతిరేకంగా భిన్న శక్తులు కలవగల అవకాశాలను ఈ ఉద్యమం ముందుకు తేవడమే కాదు, అలాంటి కలయికను రుజువు చేసింది. భారత సామాజిక చరిత్ర గురించి, సాంస్కృతిక సహజీవన వారసత్వం గురించి, సామాజిక వైవిధ్యం గురించి ఎన్నో కొత్త ఆలోచనలకు, అన్వేషణలకు ఈ ఉద్యమం ప్రేరణ అయింది.

పై రెండూ ప్రధానంగా భావజాల, సాంస్కృతిక, పాలనా రంగాలకు సంబంధించినవైతే గత నాలుగు నెలలుగా జరుగుతున్న రైతాంగ ఉద్యమం నేరుగా దోపిడీ రాజకీయార్థిక వ్యవస్థపై ధిక్కారం. మూడు వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా మొదలైన ఈ ఉద్యమం కార్పొరేట్లకు, సంఘ్‌పరివార్ ఫాసిజానికి వ్యతిరేకంగా గొప్ప ఆశను ప్రోది చేస్తున్నది. వ్యవహారంలో ఢిల్లీ రైతుల పోరాటంగా ఇది గుర్తింపు పొందింది. పంజాబ్, హర్యాణా ధనిక రైతుల పోరాటంగా పిలవబడుతున్నది. ఇందులో కొన్ని నిజాలే ఉండవచ్చు. అయితే ఇది మౌలికంగా భారత వ్యవసాయ రంగ

సంక్షోభాన్ని సూచిస్తోంది. ఆ అర్థంలో ఇది పరోక్షంగానో, సుదూరంగానో ఈ దేశ రైతాంగ ఆకాంక్షలను ప్రతిబింబిస్తున్న పోరాటం. ఆ రకంగా మౌలిక వర్గ సమస్యను కూడా ముందుకు తీసుకొచ్చింది.

ఇవేగాక కనీసం రెండు మూడు దశాబ్దాలుగా దళిత, బహుజన ఆత్మగౌరవ పోరాటాలు కొనసాగుతున్నాయి. సాంఘిక రంగంలోనేగాక రాజకీయంగా కూడా ఈ పోరాటాలు ప్రాధాన్యత సంతరించుకున్నాయి. ఒక ముఖ్యమైన విషయం ఏమంటే.. దళిత, బహుజన అస్తిత్వ చైతన్యంతో పార్లమెంటరీ మార్గాన్ని అనుసరించిన నాయకత్వం పూర్తిగా విఫలమయ్యాక ఒక కొత్త తరం నాయకత్వం ఈ పోరాటాల్లోంచి ముందుకు వచ్చింది. కొత్త నినాదాలను రంగం మీదికి తీసుకొని వచ్చింది. ఉదాహరణకు ఉనా పోరాటం. ప్రజా క్షేత్రంలో పోరాటాలు-ఎన్నికలు అనే రెండు అంచులున్న పోరాట రూపాలను ఈ కొత్త తరం నాయకత్వం ఆచరించబోతోందని ఇప్పటికే అర్థమైంది. ఆ రకంగా ఒక సాంఘిక ఆవరణ చుట్టూ రాజకీయ పోరాటాలు నడుస్తున్న ఒక కొత్త స్థితి ముందుకు వచ్చింది. ఈ తరహా పోరాటాలకు గతం ఉన్నది. భవిష్యత్తు కూడా ఉంటుంది. అది ఎలా ఉన్నా సరే, విస్మరించడానికి వీల్లేనంతగా అది ప్రాధాన్యత సంతరించుకోబోతోంది. రాజకీయంగా అది ఎలా ఉన్నా ఈ పోరాటాల సాంఘిక సాంస్కృతిక శక్తి చాలా విలువైనది. ఫాసిస్టు వ్యతిరేకపోరాటంలోనేకాదు, వ్యవస్థను మార్చే వర్గపోరాటంలో కూడా ఈ సాంఘిక సాంస్కృతిక, సాహిత్య పార్శ్వానికి కీలకమైన పాత్ర ఉంటుంది.

ఇలా ఎన్నో రంగాల్లో కొత్త పోరాటాలు నడుస్తున్నాయి. పాత పోరాటాలకు విస్తృత కొనసాగింపు ఉన్నది. ఉధృత పోరాటాలుగా మారగలవనే ఆశ కల్పించి కూడా ఒక చిన్న సంచలనంతో ఆగిపోతున్నవీ ఉన్నాయి. నిలకడగా నాలుగు రోజులపాటు నిలదొక్కుకోగలుగుతాయనే ఆశ ఇవ్వని పోరాటాలు కూడా ఉన్నాయి. ఆరంభంలో ప్రజా ఉద్యమంగా మొదలై పాలకవర్గం చేతిలోకి వెళ్లిపోతున్నవీ ఉన్నాయి. అయినప్పటికీ ఊహించని జీవన పార్శ్వాల్లోంచి వెలుగు రేఖలను ఇవి అద్భుతూనే ఉన్నాయి. ఇంత వైవిధ్యభరితమైన పోరాట కాలాన్ని గతంలో మనం చూసి ఉండకపోవచ్చు. దీనికి ఒక ఉదాహరణ దేశ వ్యాప్తంగా ట్రాన్స్‌జండర్స్ ఆత్మగౌరవ ప్రకటన. ప్రపంచ వ్యాప్తంగా ట్రాన్స్‌జండర్స్ పోరాటాల ప్రేరణ వల్ల కూడా మన దగ్గర ఈ సమూహం తమ హక్కులు, సమాన గుర్తింపు, సాంఘిక హోదా, సాంస్కృతిక ప్రతిపత్తి అనే ఆకాంక్షలను వ్యక్తం చేస్తోంది. ట్రాన్స్‌జండర్స్ పోరాటం కార్మిక, రైతాంగ పోరాటాల్లా వ్యవస్థను నేరుగా ప్రభావితం చేసేది కాకపోవచ్చు. కానీ అందులో ఒక విలువ ఉంది. జండర్ పట్ల మనకు సున్నితత్వాన్ని పెంచే అంశం అందులో ఉంది. ముందు దాన్ని అలవర్చుకోవాలి. అప్పుడు మన సమాజం చాలా ప్రజాస్వామికీకరణ చెందుతుంది. మన సాంస్కృతిక పరివర్తనలో దాని పాత్ర చాలా ఉంటుంది. ముఖ్యంగా అది ఉద్యమాలను, ప్రగతిని విలువ కట్టే ఒక పరికరాన్ని అందిస్తుంది. అందుకే ప్రొ. శేషయ్యగారు ఒక సారి అడిగారు.. ట్రాన్స్‌జండర్స్ గురించి నీ అభిప్రాయం ఏమిటి? అని. 'బహుశా ట్రాన్స్ జండర్‌ను పరిగణలోకి తీసుకోకపోతే లైంగికత గురించిన మన అవగాహన ఎన్నటికీ సమగ్రం కాదు' అన్నాను. 'అసలు ఫస్ట్ జండర్, సెకెండ్ జండర్, థర్డ్ జండర్ అనే మాటల్లోనే ఆధిపత్యం ఉన్నదని' అన్నాను. దానికి ఆయన ఇంకా ముందుకు వెళ్లి '.. ట్రాన్స్ జండర్స్ సమస్య మన హక్కుల భావనను పరీక్షిస్తుంది. ఇలాంటి వాటి గురించిన సరైన దృక్పథమే మన హక్కుల చైతన్యానికి గీటురాళ్లుగా మారబోతున్నాయి..' అన్నారు.

ఇలాంటి పోరాటాలకు తోడు సమాజానికి సమరశీలశక్తిని అందించే వర్గపోరాటం కొనసాగుతున్నది. దండకారణ్యం నుంచి పశ్చిమ కనుమల దాకా సాయుధ పోరాటం నడుస్తున్నది. అనేక ఆటుపోట్ల మధ్యనే విప్లవోద్యమం ప్రత్యామ్నాయ రాజకీయార్థిక సాంఘిక సాంస్కృతిక ఆచరణ రూపాలను కొనసాగిస్తున్నది. కొత్త ఆవిష్కరణలను అందిస్తున్నది. ప్రత్యామ్నాయ అర్థిక, పాలనా నమూనాను, కింది నుంచి ప్రజాస్వామ్యాన్ని, ప్రజల రాజ్యాధికార రూపాన్ని దేశంలోని-ఒక ప్రత్యేక చిన్న ప్రాంతంలోనే కావచ్చు.. అమలు చేస్తున్నది. ఆచరిస్తున్నది. దీన్నంతా సైనిక సంఘర్షణగా

## సాహిత్య లేఖ

సంపాదకులకు...

అరుణతార ఏప్రిల్ సంచికలో అచ్చయిన సీతాకోక చిలుకల అన్వేషి జాహిదా హినా కథ చాలా బాగుంది. కామేశ్వరి గారి అనువాదం చాలా సరళంగా, హాయిగా ఉంది. జాహిదా హినా ఏ సందర్భంలో ఆ కథ రాశారో తెలిస్తే బాగుండేది. కథా వస్తువు స్వాతంత్ర్యోదమ కాలం నాటిదా, లేక ఆ తర్వాతి కాలందా? అనంతర కాలందైతే మనలా ఆలోచిస్తున్న, పోరాటాలు చేస్తున్న రక్తమాంసాలున్న మనుషులు అక్కడ కూడా ఉన్నారని అర్థం. ఎందుకంటే మన పాలకులు అక్కడ మనుషులు లేరని, టెర్రరిస్టులు మాత్రమే ఉన్నారని ప్రచారం చేశారు. మనలాంటి పేదలు, బాధితులు ఉన్నారన్న ఎరుక ఆ దేశంపట్ల పాఠకుల వైఖరిని మార్చుతుంది. సహానుభూతిని కలిగిస్తుంది.

జాహిదా హినా పాకిస్థాన్‌కు చెందిన ప్రముఖ కాలమిస్టు, కథ, నవల, నాటక రచయిత. 1946లో బీహార్‌లో జన్మించారు. ఆమె కుటుంబం దేశ విభజన తర్వాత పాకిస్తాన్ వెళ్లి కరాచీలో స్థిరపడింది. ఆమె 1960లో జర్నలిజాన్ని వృత్తిగా ఎంచుకున్నారు. భర్త జాన్ ఎలియా కూడా కవి. దేశంలో మిలటరీ పాలనను నిరసిస్తూ 2006లో పాకిస్తాన్ ప్రభుత్వం ఇచ్చిన ఆ దేశ అత్యున్నత పురస్కారాన్ని ఆమె తిరస్కరించారు. ఆమె రచనలను ప్రఖ్యాత కవి ఫైజ్ ఇంగ్లీషులోకి అనువదించారు. అంతకంటే గొప్ప పురస్కారం ఇంకేముంటుంది?

ఒక చిన్న సూచన: అనువాద కథలు ప్రచురించేటప్పుడు రచయిత పరిచయం కూడా వేస్తే బాగుంటుందేమో ఆలోచించండి.

- శ్రీనివాసమూర్తి

ఈ సలహా తప్పక పాటించదగింది. అనువాద సాహిత్యం ప్రచురించేటప్పుడు రచయిత స్థలకాలాలు, వ్యక్తిగత వివరాలు తప్పక ఆ రచనకు పాఠకుల్ని మరింత చేరువ చేస్తాయి. రచయిత్రి గురించి శ్రీనివాసమూర్తి చెప్పిన ఈ సమాచారానికి అదనంగా అనువాదకురాలి గురించి కూడా పాఠకులకు కొంత సమాచారం ఇవ్వాలి. కామేశ్వరి రాజమండ్రిలో కార్మికోద్యమంలో పని చేసింది. 2019 మే 8న ఆంధ్రా ఒడిషా సరిహద్దుల్లోని కోరాపుట్ జిల్లా కితుబా గ్రామం అటవీ ప్రాంతంలో జరిగిన ఎన్‌కౌంటర్‌లో అమరురాలైంది. ఆమెతోపాటు దాసు, క్రిష్ణ, క్రాంతి, గీత.. అనే మరో నలుగురు విప్లవకారులు మృతి చెందినట్లు పత్రికల ద్వారా తెలిసింది.

- వర్కింగ్ ఎడిటర్

కుదించే కుట్ర రాజ్యం పన్నింది. సొంత అధ్యయనాలు, పరిశీలనలు లేని మేధావులు ఈజీగా దీనికి తమ తెలివితేటలను బలిపెట్టు కుంటున్నారు. నిజానికి కేవలం సైనిక రంగంలో పరిశీలించినా పదిహేనేళ్లుగా 7 నుంచి 10 లక్షల దాకా అర్ధ సైనిక బలగాల యుద్ధాన్ని అక్కడి ప్రజా యుద్ధం నిలువరిస్తున్నది. ఈ సంఖ్య ఈ ఏడాది చివరికి రెట్టింపు చేస్తామని పాలకులు ప్రకటించారు. దండకారణ్యంలో డ్రోన్ దాడులు, వైమానిక దాడులు జరుగుతున్నాయి. గ్రామాల మీద బాంబింగ్ జరుగుతోంది. సరిహద్దుల్లో ఉండాల్సిన సైన్యం దండకారణ్యానికి వచ్చేసింది.

కాబట్టి 'సైనిక' కోణంలో చూడదలుచుకున్నా దండకారణ్య విప్లవోద్యమం లోతు, విస్తృతిని ఓపిక ఉంటే అర్థం చేసుకోవడం తేలికే. బలమైన సాంఘిక, సాంస్కృతిక పరివర్తనా క్రమం లేకుండా, శక్తివంతమైన భావజాల నిర్మాణం లేకుండా, అక్కడి స్త్రీలకు, పురుషులకు సొంత క్రియాత్మక వైఖరి లేకుండా, సామూహిక ఆచరణ లేకుండా, స్పష్టమైన సిద్ధాంత రాజకీయ వ్యూహం లేకుండా ఇదంతా సాధ్యం కాదు. బైటికి రాజ్యం ఫోకస్ చేస్తున్న సైనిక కోణానికి అట్టడుగున, చుట్టూతా, అన్ని తలాల్లో ఇదంతా ఉన్నది. ఈ పోరాట ప్రభావాలు మన సమాజమంతా ప్రసరిస్తున్నాయి. విప్లవోద్యమమంటే ఆదివాసీ ప్రాంతపు సాయుధ సంఘర్షణగా రాజ్యం ప్రచారం చేస్తున్నది. ఇది అబద్ధం. అనేక మైదాన ప్రాంతాల్లో కూడా ప్రత్యక్ష, పరోక్ష విప్లవోద్యమ ఆచరణ కొనసాగుతున్నది. వీటన్నిటినీ గుర్తించడానికే చాలా మంది సిద్ధంగా లేరు.

మనం రూపొందుతున్న కొత్త పోరాట ప్రపంచం గురించి మాట్లాడుకుంటున్నాం కదా.. అందులో దండకారణ్యం తదితర ప్రాంతాల్లో సాగుతున్న విప్లవోద్యమ వ్యూహాత్మక పాత్రను మనం ఇంకా గుర్తించవలసే ఉన్నది. మిగతా పోరాటాల పాత్రను గుర్తించడానికి ఎంత ఓపన్ మైండ్‌తో ఉన్నామో అంతే వస్తుగతంగా, ప్రజాస్వామికంగా ఈ వ్యూహాత్మక పాత్రను గుర్తించడానికి సిద్ధంగా ఉన్నామా? లేక దశాబ్దాలుగా మోస్తున్న మొండి వైఖరులతోనే ఇంకా కాలక్షేపం చేస్తామా? విప్లవోద్యమంపట్ల నెగెటివ్ వైఖరితో ఉండటమే ప్రజాస్వామికమనే బూకరింపును కొనసాగిద్దామా? అనేవి ముఖ్యమైన ప్రశ్నలు. నిర్మొహమాటంగానే కొందరు మేధావులను ఈ ప్రశ్నలు అడగవలసి ఉన్నది. మనుషులను వ్యక్తులుగా, సమిష్టిగా చైతన్యవంతమైన మిలిటెంట్ ఫోర్స్‌గా మార్చి వ్యవస్థ మౌలిక వైరుధ్యంతో తలపడటంలో తిరుగులేని ఉదాహరణగా విప్లవోద్యమం రుజువవుతున్న తరుణంలో ఈ ప్రశ్నలకు కూడా చాలా ప్రాధాన్యత ఉన్నది.

ఇంత వైవిధ్యభరితమైన పోరాటాలు సాగుతున్న వర్తమానంలో మనం ఉన్నాం. కాబట్టి దీన్ని ఎలా చూడాలి? అనేది మనం తేల్చుకోవాల్సి ఉన్నది.

మొట్ట మొదట.. ఇది ఉద్యమాలు లేని కాలమని కొందరైనా చేస్తున్న వాదనలో నిజం లేదని ప్రకటించాలి. విప్లవోద్యమం ఆటుపోట్లలో ఉండవచ్చు. ఆ వైపు నుంచి కూడా ఈ వాదన నిజం కాదు. అయితే ఈ వైఖరి మేధో శిబిరంలో ఎంతో కొంత ఉన్నది. దానికి కారణం ఉద్యమాలను చూసే సంప్రదాయక దృష్టి. సమాజాన్ని మార్చే పోరాటాలను కూడా మొండి ప్రమాణాలతో చూసే అలవాటు ఉంటుంది. సంప్రదాయకత, యాంత్రికత మాత్రమే కాదు. ఉద్యమాలను మూసగా, ఊహాత్మకంగా చూసే పెడ ధోరణి కూడా ఉంటుంది. దీన్నుంచి విముక్తి చెందితేనే వర్తమాన పోరాటాలు అర్థమవుతాయి. ఉద్యమాలు ఎన్నెన్ని రకాలుగా సాగడానికి అవకాశం ఉన్నదో చూడాలి. ఒక నిర్దిష్ట లక్ష్యంతో, నిర్మాణయుతంగా, తక్షణ దీర్ఘకాలిక దృక్పథ స్పష్టతతో నిర్మించే పోరాటాలు కూడా నాయకత్వం ఉద్దేశించినట్లు సాగవు. ఆశించినదానికంటే చాలా భిన్నమైన ప్రభావాలు వేస్తాయి. అవి చాలా తీవ్రంగా ఉండవచ్చు. మంద్రంగానూ ఉండవచ్చు.

ఒక చిన్న పోరాటమే చాలా విస్తారమైన వెలుగు ప్రసరించి అలాంటి అనేక పోరాటాలకు దారి చూపుతుంది. ఒక సెక్షన్ చేసిన పోరాటం అనేక పీడిత సమూహాలకు మేల్కొలుపు గీతం పాడుతుంది. ఒక స్థూల లక్ష్యంతో బయల్దేరిన పోరాటం అనేక విడి విడి నిర్దిష్ట లక్ష్యాల అవసరాన్ని ముందుకు తెస్తుంది. జీవన వాస్తవికతలోని పొరలన్నిటినీ విప్పి చూపుతుంది. బైటికి వినిపిస్తున్న ఒకానొక నినాదంలోనే అనేక అంతరార్థాలు ప్రతిధ్వనిస్తుంటాయి. కాబట్టి ఉద్యమాలను ఎలా చూడాలి? అనే ప్రశ్న విప్లవోద్యమం దగ్గరి నుంచి ట్రాన్స్‌జండర్ ఉద్యమం దాకా, చట్టబద్ధ పాలన, హక్కుల దగ్గరి నుంచి రాయితీల పోరాటం దాకా దేనికైనా వర్తిస్తుంది. ఆ ప్రశ్నను ప్రతిసారీ ఆ కాలపు ప్రత్యేకతలోంచి కూడా చూడాలి.

మన చుట్టూ ఎక్కడికక్కడ విడి విడిగా, కెరటాలు కెరటాలుగా పోరాటాలు సాగుతున్నాయి. వీటిని ఇలాగే చూసి సరిపెట్టుకోవాలా? లేక ఈ కెరటాల అట్టడుగున ఉన్న కల్లోలాన్ని, అందులోని తర్కాన్ని చూడాలా? ఏ సంక్షోభంలోంచి ఈ కెరటాలు ఎగిసిపడుతున్నాయి? ఆ సంక్షోభ స్వభావాన్ని ఈ కెరటాలు ఏ మేరకు ప్రకటిస్తున్నాయి? దేనికి ఆ సంక్షోభపు తీవ్రతనంతా ఈ కెరటాలు ఎత్తి చూపలేకపోతున్నాయి? వంటి ఎన్నో ప్రశ్నలను పట్టించుకోకుండా దేనికదే విడి పోరాటమని అనుకుంటే ఆ కెరటం విరిగిపడిన చప్పుడుకు భీతిల్లడమో, లేక నిరాశతో కుంగిపోవడమే జరుగుతుంది. వీటన్నిటి మధ్య తర్కాన్ని గుర్తించకుండా, మొత్తంలో భాగంగా చూడకుండా ఆ ఉద్యమాలకు వెన్నుదన్నుగా ఉండగల సిద్ధాంతాన్ని నిర్మించడం సాధ్యం కాదు. ముందు ఎలా చూడాలో తేలితేనే వాటికి అవసరమైన సిద్ధాంతానికి ఆస్కారం ఉంటుంది.

కాబట్టి ఉద్యమాలను సంప్రదాయకంగా అర్థం చేసుకోకూడదు. నమూనాలుగా చూడకూడదు. ఒక 'నమూనా'తో పోల్చి ఇంకో నమూనాను తయారు చేయకూడదు. ఊహించకూడదు. వాటి మధ్య తారతమ్యాలను ప్రదర్శించకూడదు. ప్రతి ఉద్యమం ముందుకు తీసుకొచ్చే కొత్త నుడికారాన్ని ఓపిగ్గా అర్థం చేసుకోవాలి. వాటి నినాదాల తక్షణ, చారిత్రక అర్థాలను గుర్తెరగాలి. వాటి మధ్య ఉండే సంబంధాన్ని, అది పోషించగల పాత్రను పట్టుకోవాలి. నిన్నటి దాకా వ్యక్తం కాని ఆకాంక్షలు ముందుకు వచ్చాయంటే వాటిని సందేహించి ప్రయోజనం లేదు. బహుశా నిన్న వ్యక్తం కాకపోవడమే ఇవ్వాళ దాని ప్రాసంగికతకు ఒక కొలమానం. వాటిలోని ప్రగతిదాయక అంశం ఏమైనా ఉన్నదా? ఎందుకు అది ప్రగతిదాయకమవుతున్నది? అని విశ్లేషించుకోవాలి. ప్రతి వ్యక్తీకరణ తనదైన కొత్తదనాన్ని ఆశ్రయిస్తుంది. అంటే అది తప్పక కొత్త పోరాట రూపం అవుతుంది.

ఇలా పైకి కనిపించే పోరాటాలన్నీ మౌలికంగా ఈ వ్యవస్థ పరిష్కరించలేని వైరుధ్యాల నుంచి పుట్టుకొచ్చినవే. ఈ రాజకీయార్థిక వ్యవస్థ నడుస్తున్న తీరు వల్ల, సాంఘిక సాంస్కృతిక సంబంధాల స్వభావం వల్ల ఒక్క వైరుధ్యం కూడా పరిష్కారం కావడం లేదు. పైగా అనేక కొత్త వైరుధ్యాలు తలెత్తుతున్నాయి. ఇప్పటికే ఉన్న వైరుధ్యాలు ఒక రూపంలో బలహీనపడుతున్నట్టు కనిపిస్తూనే కొత్తగా పుట్టుకొస్తున్న వైరుధ్యాల వల్ల మరింత జటిలంగా మారుతున్నాయి. సంక్లిష్టమవుతున్నాయి.

కాబట్టి మన చుట్టూ జరుగుతున్న ఈ పోరాటాలన్నీ ఈ వ్యవస్థ

మీద నిరసనగా పెల్లుబుకుతున్నవే. వేర్వేరు స్థాయిల్లో దాని మీద విమర్శగా, నిరసనగా, ప్రతిఘటనగా సాగుతున్నవే. ప్రతి పోరాటానికి ఉండే నిర్దిష్ట, తక్షణ స్వభావాన్ని గుర్తించడమంటే దాని సాధారణ, దీర్ఘకాలిక స్వభావాన్ని కూడా అర్థం చేసుకోవడమే. ఈ పోరాటాల్లో వ్యవస్థా వ్యతిరేకత పరోక్షంగా ఉండవచ్చు. సుదూరంగా ఉండవచ్చు. సాంఘిక, సాంస్కృతిక బంధనాల నుంచి విముక్తి కావాలనే ఆకాంక్షలు వాటిలో ఉండవచ్చు. వాటికి సుదీర్ఘమైన గతం ఉంటుంది. సుదీర్ఘ క్రమాల్లోనే విజయం సాధ్యమవుతుంది. కాబట్టి వీటిని తక్షణం బలవంతంగా వర్గ సంఘర్షణలోకి కుదించకుండానే వాటిని సిద్ధాంతపరంగా అర్థం చేసుకోవాల్సి ఉంటుంది.

అలాగే ఈ పోరాటాలు తప్పక అనేక తార్కిక పర్యవసానాల వల్ల అంతిమంగా వ్యవస్థా వ్యతిరేకత దగ్గరికి చేరుకుంటాయి. వర్గ సంఘర్షణగా మారుతాయి. వాటిలోని వ్యవస్థా వ్యతిరేకతను గుర్తించి, అంతిమ సారంలో వర్గ సంఘర్షణగా మారే ఆ పోరాటాలకు అవసరమైన సిద్ధాంతాన్ని నిర్మించాలి. లేదా ఒక సిద్ధాంత అవగాహనలో భాగంగా ఆ పోరాటాల స్వభావాలను, పాత్రను గుర్తించి విశ్లేషించాలి.

ఈ పని చేయాలంటే ఈ పోరాటాలన్నిటిలోని ఏక సూత్రతను ముందు గుర్తించాలి. పోరాటకారులందరినీ అణచివేయడానికి మాత్రమే రాజ్యం అర్బన్ మావోయిస్టులని అనడం లేదు. నిస్సందేహంగా పాలకులకు ఈ అణచివేత వ్యూహం ఉన్నది. పైన చెప్పిన పోరాటాలన్నిటిలోని ఏక సూత్రత వల్ల కూడా రాజ్యం ఈ మాట అంటోంది. దీన్ని గుర్తిస్తే తమని అర్బన్ మావోయిస్టులని ఎక్కడ అంటారో అని భయపడేవాళ్లు ఈ పోరాటాల ఏక సూత్రతను తిరస్కరించినట్లే. ఆ రకంగా రాజ్యం వ్యూహానికి బలైపోయినట్లే. ఇది తారతమ్యం చెప్పడం కాదు. తారతమ్యం మధ్య ఉండే అంతస్సూత్రాన్ని గుర్తెరగమని చెప్పడం.

దీనికి ఒక ఉదాహరణ చెప్పుకుంటే సరిపోతుంది. సీఏఏ, ఎన్ఆర్సీల వ్యతిరేకపోరాటం భారత రాజ్యాంగ పరిరక్షణ స్ఫూర్తితో సాగింది. రాజ్యాంగ విలువలను సహితం ధ్వంసం చేయాలని పాలకులు ప్రయత్నిస్తున్నప్పుడు దాన్ని కాపాడుకోవాలనే పోరాటానికి ప్రాధాన్యత ఉంటుంది. కానీ ప్రభుత్వాలు సీఏఏ వ్యతిరేక ఉద్యమంలో పాల్గొన్న వాళ్లలో చాలా మంది మీద ఉపా కేసులు పెట్టి అరెస్టు చేసింది. అర్బన్ మావోయిస్టులని ప్రచారం చేసింది. ఇది అణచివేతగానే చూస్తామా? లేక ఆ పోరాటాలన్నిటిలోని ఏక సూత్రతను పాలకులు గుర్తించారను కుంటామా? ఏ ఒక్కటో కాదు. రెండూ.

సారాంశంలో వర్తమాన ప్రజా పోరాటాలు ఒక కొత్త ప్రపంచానికి సన్నాహం చేస్తున్నాయి. ఆ అంతర్గత శక్తి వాటికి ఉన్నది. ఈ పోరాటాలు భవిష్యత్తు స్వప్నాన్ని అందిస్తున్నాయి. అయితే వాటంతట అవే ఈ శక్తిని ప్రకటించలేవు. కాపాడుకోలేవు. ఏ పోరాటమైనా సిద్ధాంత పునాది ఉంటేనే గెలుస్తుంది. ప్రస్తుత పోరాటాలు ఒక కొత్త ప్రపంచ నిర్మాణంలో భాగం కావాలని కోరుకొనే వాళ్లెవరైనా తప్పక దానికి తగిన సిద్ధాంత రంగంలో కూడా కృషి చేయాల్సిందే.

* * *

2. చరిత్ర అంటే గతం గురించి మాట్లాడుకోవడం అని మనకు తరగతి గదుల్లో బోధించారు. నిజానికి చరిత్ర అంటే గతమో, వర్తమానమో కాదు. ఆ రెంటి సంబంధం. ఇంకా బాగా చెప్పాలంటే భవిష్యత్ నిర్మాణం గురించిన అన్వేషణ. గతానికి, భవిష్యత్తుకు వారధి వర్తమానం. గతాన్ని ఉటంకించడం చరిత్ర కాదు. వర్తమానానికి తగినట్లు గతాన్ని పునర్నిర్మించుకోవడమే చారిత్రక దృక్పథం. అది కూడా రేపటి కోసమే.

ఈ స్థూల అవగాహనతోనే వర్తమానంలో రూపొందుతున్న భవిష్యత్తును అర్థం చేసుకోగలం. భవిష్యత్ ఒక వస్తుగత క్రమంగా ఎలా రూపొందుతోందో, అందులో మానవుల ఉద్దేశపూర్వక క్రియాశీల పాత్ర ఎలా ఉన్నదో, ఎలా ఉండగల అవకాశం ఉన్నదో గుర్తించవలసి ఉన్నది. నిరంతర మార్పుల దృష్ట్యా, దీర్ఘకాలిక చారిత్రక అవధిని పరిగణలోకి తీసుకొని ఇలాంటి ప్రయత్నం చేయవలసి ఉంటుంది. అప్పుడే మారుతూ ఉన్న, మారడానికి అవకాశం ఉన్న పరిస్థితులను సహితం వివరించగల సిద్ధాంత చట్రాన్ని సమకూర్చుకున్నట్లవుతుంది. అంటే చలనంలో ఉన్న స్థితిని వివరించగల తార్కిక, హేతుబద్ధ ప్రాతిపదికలు అందులో ఉండాలి. కనీసం ఆ దిశగా నడిపించే భావనలను సమకూర్చుకోవాలి.

ఈ స్థూల చారిత్రక సిద్ధాంత సంవిధానంలో మన కళ్లముందున్న పోరాటాలను చూడాలి. వీటి భవితవ్యాన్ని అంచనా వేయాలి. ఇందాకే అన్నట్లు ఇప్పుడు నడుస్తున్న ప్రజా పోరాటాలన్నీ ఈ వ్యవస్థలోని వైరుధ్యాల నుంచి పుట్టుకొచ్చినవే. నిర్దిష్టంగా రాజకీయార్థిక రంగంలో డెబ్బై ఏళ్ల చరిత్రకు సంబంధించినవి. ఆ వివరాల్లోకి ఇప్పుడు మనం వెళ్లలేకపోవచ్చుగాని స్థూలంగా చెప్పుకోవాలంటే మిశ్రమ ఆర్థిక విధానం పేరుతో మొదలైన వలసానంతర పాలనా వ్యూహంలో దీనికి మూలాలు ఉన్నాయి. మొదటి రెండు మూడు పంచ వర్ష ప్రణాళికల్లో ప్రజల రక్త మాంసాలతో పబ్లిక్ రంగంలో మౌలిక కల్పనలు చేసి పెట్టుబడిదారీ శక్తులు పుంజుకోడానికి పునాది కల్పించారు. ఆ పునాది మీద ప్రైవేట్, కార్పొరేట్ రంగం బలపడింది. పాలకులు దానికి పబ్లిక్ రంగాన్ని బలిపెడుతూ వచ్చారు. ఇవాళ నరేంద్రమోదీ, నిర్మలా సీతారామన్ నిస్సిగ్గుగా అన్ని ప్రభుత్వ రంగ సంస్థలకు కార్పొరేట్లకు ఇస్తామని ప్రకటించడం యాదృచ్ఛికం కాదు. కొత్తగా అంటున్నది కాదు. పివి నరసింహారావు కాలంలోనే విన్నది కాదు. పబ్లిక్-ప్రైవేట్ రంగాల భాగస్వామ్యంలోని తార్కిక పర్యవసానమే ఇది. దాని వల్లనే ఇప్పుడు ప్రైవేట్ రంగం ఒక్కటే మిగిలే దశకు చేరుకున్నది. ఈ దశలో ప్రజలను వినియోగదారులుగా, శ్రమశక్తిని అమ్ముకొనేవారిగా కార్పొరేట్ శక్తుల ముందు నిలబెట్టడమే ప్రభుత్వం నిర్వహించగల పాత్ర. ఈ మొత్తానికి ఆరంభ బిందువు నెహ్రూ కాలానికి చెందినది. అందుకే నెహ్రూ మార్క్ ప్రజాస్వామ్యాన్ని, లేదా నెహ్రూ మార్క్ సోషలిజాన్ని అచ్చమైన నియంతృత్వంగా చూడాలి. ఈ విషయంలో ఇక ఇప్పటికైనా ఉదారవాద ప్రజాస్వామికవాదులకు సందేహాలు వదులుకుంటారా? లేదా అనేది చాలా సీరియస్ ప్రశ్న.

బూర్జువా నియంతృత్వం కేవలం ఆర్థిక రంగ పునాది మీదే కాదు, పాలనాపరంగా, చట్టపరంగా, సాంస్కృతిక భావజాలపరంగా కూడా తన విశ్వరూపాన్ని చూపడానికి నెహ్రూ కాలంనాటి విధానాల్లో మూలాలు ఉన్నాయి. గాంధీలు, నెహ్రూలు కలిసి తయారు చేసిన ఈ విధానం పట్ల సంఘ్‌పరివార్‌కు ఆ రోజుల్లో కూడా ఏ పేచీ లేదు. అందుకే గాంధేయ సోషలిజం అనే చిలకపలుకులు కొద్ది కాలం అది వల్లించింది.

వాళ్లూ, వీళ్లూ అందరూ సారాంశంలో బూర్జువా నియంతృత్వానికి సోపానాలు వేసి చకచక ఎక్కిరావాలని ప్రయత్నించినవాళ్లే. ముందు ఇందిరాగాంధీ దాన్ని అందుకోగలిగింది. ఆమె వారసుల తర్వాత సంఘ్‌పరివార్ అందుకొన్నది. ఇప్పుడు మనం చెబుతున్న బ్రాహ్మణీయ హిందుత్వ ఫాసిజం పెచ్చరిల్లడం వెనుక పార్లమెంటరీ ప్రజాస్వామ్యం బూర్జువా నియంతృత్వంగా మారిన క్రమం ఉన్నది. ఆ తీరు ఎలా సాగింది అనే విషయాన్ని విశ్లేషించడంలో తేడాలు ఉండవచ్చు. అందులో కొంత పండిత చర్చ కూడా ఉండవచ్చు. కానీ జరిగింది మాత్రం ఇదే.

బూర్జువా నియంతృత్వం ఒక షేప్ తీసుకోవడం ఒక్కో దేశంలో ఒక్కోలా ఉంటుంది. మన సమాజంలో బూర్జువా వర్గం పుట్టి పెరిగిన తీరు దగ్గరి నుంచి, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అనుభవంలోకి వచ్చిన తీరు దాకా చాలా విషయాలు ప్రభావితం చేశాయి. ఇక్కడి భూస్వామ్యానికి ఉన్న ప్రత్యేక లక్షణాలు, అది కొనసాగిన చరిత్ర కూడా కారణమైంది. భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు జరిగిన తీరు కూడా నిర్ణయాత్మకం అయ్యాయి. ఈ నేల మీది సామాజిక, సాంస్కృతిక ప్రత్యేకతలు కూడా కారణం అయ్యాయి. ఈ గతం మన రాజకీయార్థిక వ్యవస్థలోని వర్తమాన పరిణామాలనే కాదు, భవిష్యత్ పరిణామాలను సైద్ధాంతికంగా అర్థం చేసుకోడానికి అవసరం అవుతుంది. రోజువారీ వ్యవహారాల్లో మన దేశం స్వతంత్రంగా ఉన్నట్లు కనిపించవచ్చు. ఎప్పటికప్పుడు ఎన్నికలు నిర్వహించుకొని ఏదో ఒక పద్ధతిలో ఏదో ఒక పార్టీ గెలిచి పగ్గాలు చేపడుతున్నట్లు కనిపించవచ్చు. మంది బలంతోనో, దొమ్మీకి దిగో పార్లమెంట్‌లో, శాసనసభల్లో చట్టాలు చేస్తున్నట్లు కనిపించవచ్చు. నిస్సందేహంగా ఈ అర్థంలో మన దేశానికి సార్వభౌమాధికారం ఉన్నట్లే. మన పాలకులు స్వతంత్రంగా వ్యవహరిస్తున్నట్లే. బహుశా 70 ఏళ్లుగా మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం 'సుస్థిర ప్రజాస్వామ్యం' అనిపించుకోగల విజయాన్ని ఇలా సాధించింది. వలస పాలన వల్ల మన దేశంలోకి వచ్చిన పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోనే ఈ లక్షణం ఉంది. దాన్ని గుర్తించాలి. లేకపోతే దానితో వ్యవహరించడం కష్టం. ఇంత 'సార్వభౌమాధికారం' ఉన్నప్పటికీ ఆర్థిక విషయాల్లో ప్రపంచ పెట్టుబడిదారీ శక్తులే నిర్ణాయకంగా ఉంటున్నాయి. దేశ ప్రజల శ్రమ శక్తిని దోచుకోవడంతోపాటు బైటి ప్రజల శ్రమశక్తిని కూడా దోచుకోగలిగేలా భారత బూర్జువా వర్గం ఎదిగింది. వక్రీకరించబడిన పెట్టుబడిదారీ సంబంధాలు పెరుగుతున్నాయి. అంతిమంగా భారత బూర్జువా వర్గం సామ్రాజ్యవాద దోపిడీ వ్యూహానికి లోబడి ఉంటున్నది. వలసానంతరం సామ్రాజ్యవాదం పని తీరులో వచ్చిన తేడాతో సహా నిత్యం అది ఎదుర్కొంటున్న సంక్షోభాలను కూడా పరిగణలోకి తీసుకోవాలి. భూస్వామ్య ఆర్థిక సంబంధాలు బలహీనపడినా అది ఇంకా, ఉనికిలోనే ఉన్నది. సామ్రాజ్యవాద పనితీరులో వచ్చిన మార్పులు భూస్వామ్యాన్ని బలహీనపరిచాయి, పదిలపరిచాయి. ఈ రెండు కోణాలను వాస్తవ దృష్టితోచూడాలి. అంతే కాదు. భావజాల, సాంస్కృతిక, జీవన విధానాల్లో భూస్వామ్యం పదే పదే పునర్జన్మిస్తున్నది. భావజాలంగానే కాదు, అదొక భౌతిక వాస్తవంగా అది ఉనికిలో ఉండటానికి సామ్రాజ్యవాద పనితీరులో వచ్చిన మార్పులు కారణం. ఇక ఏ ఉత్పత్తి సంబంధాల వ్యవస్థతోనైనా సహజీవనం చేయగల ప్రాచీన సాంఘిక సంబంధాల కులం, పితృస్వామ్యం సంగతి చెప్పనవసరం లేదు. భారతీయ ప్రజా జీవితంలో వీటి నిర్ణాయక పాత్రను విస్మరించడానికి లేదు. వీటికి భూస్వామ్యానికి ఉండే సంబంధం చాలా జటిలమైనది.

అందువల్లనే కొత్త దోపిడీ రూపాలు, పద్ధతులు ముందుకు వచ్చాయి. దోపిడీ మాత్రం పదిలంగా ఉన్నది. దశాబ్దాల పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఉనికిలో ప్రజల భాగస్వామ్యం ఏమీ లేదా? అని ఉదారవాద ప్రజాస్వామికవాదులు మనల్ని ప్రశ్నించవచ్చు. ఇది చాలా కీలకమైన ప్రశ్నే. ప్రజల చారిత్రక పాత్రను మనం ఏ రకంగానూ కుదించడాన్ని ఒప్పుకోం. వక్రీకరించడాన్ని అసలే అంగీకరించం. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ప్రజలు తమ ప్రతినిధులకు పాలన, శాసనపర అధికారాలు దఖలు పరుస్తారు. ఈ ప్రక్రియలో ప్రజల భాగస్వామ్యాన్ని, ఆకాంక్షల్ని మాత్రమే చూస్తే సరిపోదు. కార్పొరేట్లు ఎప్పటికప్పుడు తమకు అనుకూల పార్టీని అధికారంలోకి తెచ్చుకోడానికి ఎన్నికల ప్రక్రియ జరుగుతోందని గుర్తించాలి. ఆ రకంగా తమకు అవసరమైన చట్టాలను చేయించుకుంటున్నాయని కూడా చూడాలి. నిజానికి ఈ వాస్తవాన్ని ఉదారవాద మేధావులు, పాలకవర్గ మేధావులే బట్టబయలు చేస్తున్నారు. ఇది చాలా పాత విషయమే అనిపించవచ్చు, కానీ రాబోయే రోజుల్లో ఇది మరింత నగ్నంగా, సంక్లిష్టంగా మారబోతోంది. ఈ అర్థంలో క్రమంగా ఎన్నికల ప్రక్రియలో ప్రజల పాత్ర తగ్గిపోతుందని గుర్తించకపోతే ఈ ప్రజాస్వామ్యంతో వ్యవహరించడం కష్టం.

ప్రజాస్వామ్యం ఒక సజీవ వ్యవస్థగా నిలదొక్కుకొని ఉండాలి. దానికి ఒక చట్టపరమైన అధికారం ఉండాలి. భావజాల సమ్మతి ఉండాలి. నిస్సందేహంగా ప్రజల పేరుతోనే పాలకవర్గం ఈ అధికారాలు దఖలు పరుచుకున్నది. అనుమానమే లేదు. భారత రాజ్యాంగ రూపొందిన కాలాన్ని, చారిత్రక సందర్భాన్ని గమనిస్తే ఇది స్పష్టమవుతుంది. సుదీర్ఘకాలంగా మన దేశంలో పీడిత వర్గాల, కులాల ప్రజలు, ఆదివాసులు, మహిళలు చేస్తుండిన పోరాటాలు వలస వ్యతిరేక కాలంలో కొత్త అర్థాలను సంతరించుకున్నాయి. వలస వ్యతిరేక పోరాట యుగం చారిత్రకంగా ప్రత్యేకమైనది. కాబట్టి ఆ కాలంలో అనేక చైతన్యాలు వెల్లివిరిశాయి. అవన్నీ మన రాజ్యాంగంలో భాగమయ్యాయి. అంతే కాదు. ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల్లో, సోషలిస్టు విప్లవాల్లో నిలదొక్కుకున్న విలువలు కూడా మన రాజ్యాంగంలోకి వచ్చాయి. ఇవే కాదు. కొత్తగా అధికారంలోకి వచ్చిన భారత సంపన్నవర్గాల ఆకాంక్షలకు రాజ్యాంగం గణనీయమైన స్థానాన్ని ఇచ్చింది. పైన చెప్పిన అనేక పోరాటాల క్రమంలో సమానత్వం అనే భావనను స్వీకరించిన భారత రాజ్యాంగం ఆస్తిహక్కు రూపంలో దోపిడీని చట్టబద్ధం చేసింది. ఆ రకంగా రాయితీలు, ఉచితాలు, సంక్షేమం, ఇంకా ఘనంగా చెప్పాలంటే 'అభివృద్ధి'ని భారత ప్రజల కోరుకోవాలేగాని దోపిడీ గురించి మాట్లాడటానికి వీల్లేని స్థితిని రాజ్యాంగమే కల్పించింది. ఆ మాట గట్టిగా మాట్లాడటమే నేరంగా రాజ్యాంగం మార్చివేసింది. తమ ప్రతినిధులకు ప్రజలు దఖలు పరిచిన అధికార, పాలనా రూపమైన పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో వాళ్ల పాత్ర సరిగ్గా ఇదే.

అందుకే యాభై ఏళ్ల కింద ఈ దొంగల రాజ్యాంగం రచనే ఒక బూటకం అని విప్లవ కవి అన్నాడు. ఈ మాట వ్యూహాత్మకంగా అప్పటికీ ఇప్పటికీ వాస్తవం. ఈ అవగాహనను పదిలంగా ఉంచుకుంటూనే రాజ్యాంగ పరిధిలోని ప్రజాస్వామిక పోరాటాల పాత్ర క్రమంగా పెరుగుతున్నదనే సంగతి మర్చిపోవడానికి లేదు. ఎంత సంక్లిష్ట విషయమంటే, పాలకులు పూర్తి స్థాయిలో రాజ్యాంగ వ్యతిరేకంగా తయారైన సందర్భంలో సమాజంలో రాజ్యాంగబద్ధ హామీల కోసం పోరాటాలు ఉధృతమవుతున్నాయి. పాలకులు రాజ్యాంగాన్ని ఫేడౌట్ చేస్తున్న తరుణంలో ఈ సమాజం అంచుల్లో ఉండిపోయిన ప్రజలు దాని ద్వారా తమకు దక్కాల్సిన హక్కుల గురించి ఆందోళనలు ఉధృతం చేస్తున్నారు. రాజ్యాంగంలోని హక్కులు, వ్యక్తిస్వేచ్ఛ, సమానత్వం, సామాజిక న్యాయం, రాజకీయాల్లో సమాన ప్రాతినిధ్యం వంటి భావనలు కనీసంగా అనుభవంలోకి రాని సమూహాలు పోరాటానికి దిగినందు వల్ల ఆ భావనల ప్రాధాన్యత పెరిగింది. తద్వారా రాజ్యాంగ ప్రాధాన్యత కూడా పెరిగింది. ఇది మన సామాజిక ప్రగతిలో ముఖ్యమైన విషయం. దీనికి దారి తీసిన పరిస్థితుల గురించి ప్రత్యేకంగా చర్చించుకోవాలి. ఆ రకంగా పాలకులు రాజ్యాంగాన్ని కేవలం ఒక బుక్‌గా మార్చేస్తే ప్రజలు మార్పు క్రమంలో దాన్ని భాగం చేశారు. లేదా దాని ద్వారా

సాధించవలసిన మార్పు క్రమాలు ఉన్నాయనే ఎరుకను అందిస్తున్నారు. ఈ ఎరుక కేవలం రాజకీయమైనదే కాదు. సామాజిక సాంస్కృతిక రంగాలకు చెందిన వైవిధ్యభరితమైన విషయం. ఈ కోణాల్లో తమ జీవితంలో మార్పు కోసం పీడిత సమూహాలు చేస్తున్న ప్రతి పోరాటం న్యాయమైనది. అందుకే మనం వాటిని బలపరచడమే కాదు. అవి విజయం సాధించాలని కూడా ఉద్యమిస్తున్నాం. అలాంటి వాటిని మనమే ముందుకు తీసుకొస్తున్నాం.

అదే సమయంలో రాజ్యాంగానికి యథాతథ స్థితిని పట్టి ఉంచే స్వభావం ఉంది. దాన్ని విస్మరించడానికి లేదు. ఇది క్రమంగా నిరంకుశ లక్షణాన్ని సంతరించుకుంది. దానిలోని సమానత్వ, హక్కుల, చట్టబద్ధ స్వభావానికి-నిరంకుశ దోపిడీ స్వభావానికి మధ్య వైరుధ్యాన్ని గుర్తించాలి. ఇందులో మెతక వైఖరి పనికి కాదు. పాలకులు రాజ్యాంగ వ్యతిరేకంగా పాలిస్తున్నారా? లేక రాజ్యాంగ బద్ధంగానే పాలిస్తున్నారా? అనే చర్చలోకి దిగితే వాళ్ల నిరంకుశత్వానికి సకల సాధికారతను, అవకాశాలను, తిరుగులేని శక్తిని రాజ్యాంగమే ఇస్తున్నది. ఒకసారి దోపిడీని చట్టబద్ధం చేశాక, రాజ్యాంగ యంత్రం మీద దోపిడీ వర్గాల అధికారాన్ని సుస్థిరం చేశాక రాజ్యాంగ అతీతంగా పాలన చేయవలసిన అగత్యం పాలకులు కలగనే కలగదు. వాళ్లు అన్నీ రాజ్యాంగబద్ధంగానే చేస్తున్నారు. రాజ్యాంగం స్కోప్ ఇవ్వని పనులు పాలకులు చేయనవసరం లేదు. దేనికంటే పాలక వర్గ సకల అవసరాలు యక్కగా తీర్చగల స్కోప్ రాజ్యాంగ చట్రంలో ఉన్నది. ఈ లక్షణం మన ప్రజాస్వామ్యానికే ఉన్నది. అందుకే మనది సుస్థిర ప్రజాస్వామ్యం. చివరికి మన దేశంలోకి ఫాసిజం రాజ్యాంగబద్ధంగానే వచ్చింది. ఈ విషయాన్ని గుర్తించడంలో తడబాటుకు గురయ్యామంటే ప్రజలకు ద్రోహం చేసినట్లే. అదే సమయంలో రాజ్యాంగంలోని కొన్ని విలువల పరిరక్షణకు రాజ్యాంగానికి బైటే కాదు, రాజ్యాంగపరిధిలో కూడా పోరాడవలసిన సందర్భం ముందుకు వచ్చింది. ఈ ప్రయత్నం రాజ్యాంగ పరిరక్షణగా కూడా వ్యక్తం కావచ్చు. ఈ రెండో విషయంలో తాదాత్మ్యం చెంది మొదటిది మర్చిపోవడమంటే విప్లవాన్ని వదిలేసుకున్నట్లే.

రాజ్యాంగం నాజూకైనదే కాదు. పదునైనది. కఠినమైనది. అది పాలకవర్గానికి ఎలా ఉపయోగపడుతోందంటే.. పాలకవర్గం రాజ్యాంగమనే డాలు పట్టుకొని ప్రజలపై డెబ్బై ఏళ్లుగా యుద్ధం చేస్తున్నది. పీడిత సమూహాలు పార్లమెంటరీ మార్గంలోకి వెళ్లే కొద్దీ దాని శక్తి, సాధికారత పెరుగుతున్నది. పీడిత సమూహాల ప్రాతినిధ్యం వాళ్ల న్యాయమైన హక్కు. ఇది ప్రజాస్వామికీకరణకు దారి తీస్తుంది. కానీ అదే సమయంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్య సాధికారత పెరుగుతున్నది. ఇది కూడా దాని నిరంకుశత్వానికి ఒకానొక కారణం.

మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి ఉన్న ఇన్ని ప్రత్యేకతల్లో ఏ ఒక్కటీ విస్మరించడానికి లేదు. వీటన్నిటిలో అతి ముఖ్యమైనది ఏమంటే.. దానికి ఉండే బ్రాహ్మణ స్వభావం. అబ్బే అదేమీ ఉండదని ఇటు అస్తిత్వవాదులు, కొందరు వామపక్షవాదులు పెదవి విరవవచ్చు. మన పాండిత్యం వల్ల ఈ రెంటికీ ఏ సంబంధం లేదని చెప్పాలని అనుకోవచ్చు. ఆ రెంటినీ వేరు చేసి చూద్దామని అనుకోవచ్చు. కానీ కుల వ్యవస్థ, బ్రాహ్మణిజం చక్కగా మన పార్లమెంటరీ పంథాలో ఒదిగిపోయాయి. వాటికి ఉండే పునరుత్పత్తి స్వభావాన్ని మిగతా చోట్ల ఎలా చూడగలమో అలాగే పార్లమెంటరీ పంథాలో కూడా చూడవచ్చు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కేవలం పాలనా విధానమే కాదు. ఎన్నికల ప్రజా ప్రాతినిధ్య విధానమే కాదు. వలస వాద నేపథ్యంలో మన దేశంలోకి వచ్చినందు వల్ల అనేక ప్రత్యేక చారిత్రక, సామాజిక, రాజకీయార్థిక సాంఘిక సాంస్కృతిక లక్షణాలు దానికి ఉన్నాయి. మన దేశంలోని సాంఘిక, సాంస్కృతిక వ్యవస్థల స్వభావాన్ని అది పుణికిపుచ్చుకుంది. ఈ సంక్లిష్టతలన్నిటినీ పరిగణలోకి తీసుకోవాలి. అట్లా కాకుండా కేవలం ప్రజా ప్రాతినిధ్య స్వభావం మాత్రమే ఉందనుకొని, ఓటర్ల సంఖ్యను, ఓట్లను సంఖ్యను మాత్రమే లెక్కలోకి తీసుకుంటే ప్రజలను మోసం చేసినట్లే. ఓట్లు మావి అధికారం మీదా? అనే సూత్రం ఒక వైపు నుంచి మాత్రమే ప్రజాస్వామికం. అంతకుమించిన అంచనా వేస్తే ఎండమావుల్లో పరిగెత్తినట్లే. కాబట్టి మన దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని చాలా విస్తృత ప్రాతిపదికలపై విశ్లేషించాలి. బహుశా ఇంకా ఆ పని సమగ్రం కావాలసే ఉన్నది.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఒక భావజాల కేంద్రం కూడా. రాజ్యాంగం, న్యాయవ్యవస్థ సహితం ఆధిపత్య భావజాల ఉత్పత్తి కేంద్రాలే. మనకు విద్యావ్యవస్థను, కుటుంబాన్ని భావజాల కేంద్రాలుగా చూడ్డానికి ఏ అభ్యంతరం ఉండదు. కానీ పార్లమెంటరీ పంథాను చూడ్డానికి మాత్రం ఇష్టం ఉండదు. దీని గురించి లోతుగా ఆలోచించాలి.

రాజ్యాంగం పట్ల మనం తీసుకొనే ఈ రెండు వైఖరుల మధ్య వైరుధ్యం లేదా? అని మనల్ని అస్తిత్వవాదులు, ఉదారవాదులు ప్రశ్నించవచ్చు. రాజ్యాంగవాదమే పరమావధి అయిన వాళ్లకు ఈ వైరుధ్యం కనిపించడం సహజమే. వాస్తవం ఏమంటే- మన వైఖరుల్లో వైరుధ్యం లేదు. సామాజిక ప్రగతిలోనే అలాంటి వైరుధ్యం ఉంది. దాన్ని విప్లవమే పరిష్కరిస్తుంది. వేరే దగ్గరి దారులేవీ లేవు. ఈ విషయంలో రాజ్యాంగవాదులతో దృఢమైన సైద్ధాంతిక పోరాటం చేయాల్సిందే. దాని కోసం మన సిద్ధాంత చట్రాన్ని మరింత పటిష్టం చేసుకోవాల్సిందే. ఇది తారతమ్యాలను ప్రేరేపించడం కాదు. వాటిని పరిష్కరించడం. పోరాట శక్తుల మధ్య ఐక్యతకు భంగం కలిగేలా గీత గీయడం కాదు. సహజంగానే ఉన్న గీతను పరిష్కరించేందుకు ప్రయత్నించడం. హక్కులు, అస్తిత్వ సమస్యలు, సమానత్వం వంటి చట్టబద్ధ ప్రజాస్వామిక వైఖరులు ఎన్ని తీసుకున్నా అంతిమంగా రాజ్యాంగం విషయంలో వర్గ వైఖరి తీసుకుంటామా? లేదా? అనేది అతి ముఖ్యమైన విషయం. నిజానికి దోపిడీ స్వభావం వల్లనే రాజ్యాంగంలోని మిగతా అనుకూల అంశాలు కూడా డొల్లగా మారిపోతున్నాయి. దోపిడీ ఉన్న చోట సామాజిక న్యాయం, సమానత్వం అనేవి ప్రశ్నార్థకం కావా? ఈ విషయం చెప్పడానికి పాండిత్యం కావాలా? రాజ్యాంగ యంత్రమే ఈ డెబ్బై ఏళ్లలో ఇది నిరూపించుకున్నది. కాబట్టి ఇది సిద్ధాంత సంబంధమైనదే కాదు. పోరాట సంబంధమైనది కూడా. వర్తమాన పోరాటాలకు, అది తీర్చిదిద్దే భవిష్యత్ ప్రపంచానికి తగిన సిద్ధాంతాన్ని తయారు చేసుకోవడంలో ఇది కీలకం.

సారాంశంలో, ప్రస్తుతం జరుగుతున్న ప్రజాస్వామిక పోరాటాలకు రాజ్యాంగానికి ఉన్న సంబంధం భవిష్యత్ పోరాట ప్రపంచానికి కూడా వర్తిస్తుంది. కాబట్టి పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, రాజ్యాంగం మీద తీసుకొనే సమగ్ర వైఖరే అంతిమంగా ప్రజా విజయానికి భరోసా. బహుశా ఇది విప్లవోద్యమం ఆరంభంతో పోల్చుకుంటే ఇప్పుడు మరింత సమగ్రమైందని చెప్పుకోడానికి మొహమాటపడాల్సిన పని లేదు. ఒక పక్క రాజ్యాంగ ప్రేరణతో ప్రజాస్వామిక పోరాటాలు కొనసాగడం, ఇంకో పక్క రాజ్యాంగంలోని ఆదర్శాలన్నీ అడుగంటి దాని అసలు స్వభావం బట్టబయలు కావడం అనే ఒక సంక్లిష్ట స్థితి ఇవాళ ఉన్నది. ఇది గతంలో ఉన్నదే. ఇప్పుడు మరీ పెరిగింది. ఇంకా పెరుగుతుంది. కాబట్టి ఈ సంక్లిష్టతకు తగిన సిద్ధాంత కల్పన లేని పోరాటాలు ఏదో ఒక వైపుకు

ఒరిగిపోతాయి. ఓడిపోతాయి. అందుకే రాజ్యాంగ ప్రమేయమైన ఈ స్థితిలో ఎంత వెలుగు ఉన్నట్లు కనిపిస్తుందో, అంత చీకటి కుహరం విస్తరిస్తుంది. ఏ వైపుకు జారిపోని, ముఖ్యంగా రాజ్యాంగవాదానికి గురి కాకుండా కాపాడే సిద్ధాంత వైఖరి అత్యవసరం. దేనికంటే, ఎలాంటి వారినైనా చాలా సునాయాసంగా ఉదారవాదులుగా, రాజ్యాంగవాదులుగా, మానవతావాదులుగా మార్చేసే స్థితి ఇప్పుడున్నది. ఆ వైఖరుల అవసరం గుర్తించేందుకు ఇబ్బందే లేదు. ఈ కసరత్తు అంతా అందులో భాగమే. కార్మికవర్గ విప్లవమే లక్ష్యంగా ఉంటే ఏ అవసరం కోసమైనా, ఎంత విపత్కర పరిస్థితుల్లో అయినా ఆ వైపు మొగ్గడానికి వీల్లేదు.

* * *

3. ఈరోజు దాకా మనల్ని నడిపించిన సిద్ధాంత అవగాహన రేపటి పోరాట ప్రపంచానికి తగినట్లు అభివృద్ధి చేసుకోడానికి ఇలాంటి భావనలు పునాదిగా పనిచేస్తాయి. ఇందులో అభివృద్ధి చేయవలసిన కోణాలు ఎన్నో ఉన్నాయి. అయితే ఈ స్థూల అవగాహనలను సాహిత్య సాంస్కృతిక రంగాల్లో ఎలా ముందుకు తీసికెళ్లాలి? నిర్దిష్టంగా విప్లవ సాహిత్య సాంస్కృతిక వ్యూహం ఎలా ఉండాలి? అనేవి ఇవాళ మన సమావేశానికి సన్నిహితమైనవి.

బ్రాహ్మణీయ హిందుత్వ ఫాసిజంలోని విధ్వంసం, అనేక ప్రజాస్వామిక పోరాటాల్లోని ధిక్కారం.. అనే రెంటి మధ్య తీవ్ర సంఘర్షణ సాగుతున్న తరుణాన విప్లవ సాహిత్య సాంస్కృతిక ప్రతి వ్యూహం గురించి మనం మాట్లాడుకుంటున్నామని మర్చిపోరాదు. నిజానికి అసలైన సిద్ధాంత సన్నాహానికి ఇలాంటి ఆచరణాత్మక సన్నివేశమే ఒక రూపాన్ని ఇస్తుంది. సంక్షోభ కాలం ముంచుకొచ్చినప్పుడు కొందరికి గుండె జారిపోతుంది. కానీ ఆచరణలో ఉన్న పోరాట శక్తులకు ఇదే అనేక కొత్త ఆలోచనలకు పురికొల్పుతుంది. మరింత కొత్త ఆచరణ దిశగా నడిపిస్తుంది. దీనికి కనీస షరతు ఏమంటే – పోరాట క్షేత్రం నుంచి తప్పుకోకుండా దృఢంగా నిలబడటం. ఒక వేళ, ఇప్పటికిప్పుడు పెద్ద ఎత్తున పురోగమించలేకపోయినా కనీసం ఉనికిని కాపాడుకోవడం. ముందు వీటిని సాధిస్తే తప్పక భవిష్యత్తును హస్తగతం చేసుకోవచ్చు.

ఇలాంటప్పుడు ఊకదంపుడు సిద్ధాంత ప్రవచనాలతో గట్టెక్కగలమని అనుకోవడం భ్రమ. కష్టభరితమైన ఆచరణ నుంచే తప్పక దారి దొరుకుతుంది.

ఈ నేపథ్యంలో విప్లవ సాహిత్య సాంస్కృతిక ప్రతివ్యూహానికి రెండు పార్శ్వాలు ఉంటాయి. 1. ఫాసిస్టు వ్యతిరేకత, 2. విప్లవ లక్ష్యం.

ఫాసిజం, యుద్ధం ఎంత ప్రమాదమైనవంటే– మానవాళికి అతి పెద్ద విపత్తుగా ఫాసిజం, యుద్ధం విరుచుకపడిన తీవ్ర సన్నివేశంలో విప్లవం వెనక్కి వెళ్లిపోతుంది. విప్లవం గురించి మాట్లాడటానికి, ఫాసిజాన్ని వ్యతిరేకిస్తూ మాట్లాడటానికి మధ్య కృత్రిమమైన పోటీ వస్తుంది. ఒకటి ప్రధానం, తక్షణం అయిపోయి ఇంకోటి అప్రధానమైపోతుంది. సహజంగానే ఫాసిజం ప్రధానం అవుతుంది. ఎంతగానంటే విప్లవం గురించి మాట్లాడటం 'చాదస్తం'గా మారిపోతుంది. 'ఎబ్బెట్టు'గా తయారవుతుంది. 'అత్యాశ' అనిపించుకుంటుంది. ఈ మాట ఎవరో కాదు, అంతదాకా విప్లవోద్యమం చుట్టూ తిరుగుతున్నవాళ్లే అంటారు, అనుకుంటారు. ఫాసిజం తెచ్చే ప్రమాదాల్లో ఇది ముఖ్యమైనది. ఫాసిస్టు సంక్షోభాన్ని అర్థం చేసుకోడానికి ఇంతకంటే ఏం కావాలి. ఫాసిస్టు వ్యతిరేకత ఇలా మారడానికి వీల్లేదు.

అలాగే ఫాసిస్టు వ్యతిరేకత ఎంత అత్యవసరమంటే, అది కేవలం ఫాసిజాన్ని ఓడించడానికే కాదు. ఫాసిస్టు వ్యతిరేక సిద్ధాంత, ఆచరణాత్మక వైఖరులకు విప్లవ విజయంలోనే కీలక స్థానం ఉంటాయి. అది కేవలం ఒక పెద్ద విపత్తును అధిగమించే తక్షణ అర్థంలోనే కాదు. ఫాసిజానికి వ్యతిరేకంగా సరైన వైఖరులు ఉంటేనే విప్లవానికి తగినట్లు సమాజాన్ని, పోరాటశక్తులను సిద్ధం చేయగలం. ఫాసిస్టు ప్రమాదం ముంచుకొచ్చిన సమాజాల్లో దాన్ని ఓడించడమంటే విప్లవ సానుకూల వాతావరణం కోసం ప్రయత్నించడమే. మన దగ్గరైతే దానికి రెండు ప్రధాన కోణాలు ఉన్నాయి. 1. బ్రాహ్మణ వాదాన్ని, కుల వ్యవస్థను ఎదుర్కోవడం, 2. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని బూర్జువా నియంతృత్వాన్ని ఎదుర్కోవడం. ఈ రెండు పనులు మన దేశంలో విప్లవానికి ఎంత దోహదం చేస్తాయో ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

ఈ పనుల్లో సాహిత్య సాంస్కృతిక రంగాల పాత్ర అత్యంత కీలకం. కాబట్టి వర్తమాన పోరాటాలు, ఫాసిజం నేపథ్యంలో రేపటి పోరాట ప్రపంచానికి తగిన సాహిత్య సాంస్కృతిక ఉద్యమానికి విప్లవ స్వభావం ఉండాలా? లేదా? అనేది తేల్చుకోవాలి. మంచి కథలు, కవిత్వం రాయడం గురించి కాదు నేను మాట్లాడుతున్నది. అందమైన పుస్తకాలు విరివిగా అచ్చేయడం గురించి నేను మాట్లాడటం లేదు. ఒక్కోసారి ఆసక్తికరమైన కథలు, అర్థమైన కవిత్వం ఇతరుల నుంచే సంఖ్యరీత్యా ఎక్కువ రావచ్చు. ఆ కేటలాగును ఎలాగూ విశ్వవిద్యాలయ పరిశోధకులు సిద్ధం చేస్తారు. వాటిని గుదిగుచ్చి అచ్చేసే సంస్థలు కూడా ఉన్నాయి. మనం కూడా వాటిని చదువుకోవచ్చు. ఆ రకంగా అవన్నీ మనకు కూడా ఉపయోగమే.

కానీ మనం మాట్లాడుకుంటున్నది విప్లవ సాహిత్య సాంస్కృతిక ప్రతివ్యూహం గురించి. అది ఈ రెండు పార్శ్వాల్లో ఉంటుందనే ఎరుక మనకు అనుక్షణం ఉండాలి. వీటిలో ఒకటి ముందు, ఇంకోటి వెనుక అనుకున్నామంటే విప్లవానికి నష్టం చేసినట్లే. ఫాసిజాన్ని వ్యతిరేకించడమంటే కేవలం రాజ్యాంగబద్ధ ప్రజాస్వామ్యాన్ని కాపాడువడం, నిలబెట్టుకోవడం మాత్రమే కాదు. వాటికి దోహదం చేయడం మాత్రమే కాదు. సమాజంలో మెజారిటీ మత భావజాల ఆధిక్యాన్ని తొలగించడం మాత్రమే కాదు. ఇంకా చాలా. విప్లవ లక్ష్యం రెండోదిగా మారిపోవడమంటే సుదూరమైపోవడమే. ఆ ప్రమాదానికి మనం గురికాకూడదు.

ఆ రకంగా చూస్తే మనం చాలా సంక్లిష్టమైన ప్రపంచంలో ఉన్నాం. మన లక్ష్యాలు కూడా చాలా సంక్లిష్టమైనవే. ఇంత జటిలమైన విషయాలను చాలా పాపులర్‌గా అందరికీ అర్థమయ్యేలా చెప్పాలి. మామూలుగా రాజకీయ రంగంలో పాపులిజానికి అవకాశం ఉంటుంది. కానీ ఇవాళ తెలుగు సిద్ధాంత రంగంలో ఉన్నంత పాపులిజం ఇంకెక్కడా ఉండదు. కావాలంటే మీరు ఫేస్‌బుక్‌లోకి వెళ్లండి. గొప్ప గొప్ప పండితులు అందులో జనరంజక ప్రవచనాలు చెబుతుంటారు. వాళ్లలో కాలు కదల్చని మార్క్సిస్టు పండితులు కూడా ఎక్కువ మందే ఉంటారు. అలా కాకుండా వీలైనంత తక్షణ, దీర్ఘ కాలిక అర్థాలు పలికేలా ఆచరణాత్మక సరళ సూత్రీకరణలు చేయాలి. ముఖ్యంగా మారుతున్న కాలంలో కొత్త తరాల జీవితానుభవాలను ముట్టుకొనేలా మన సూత్రీకరణలు ఉండాలి. వర్తమాన ఆర్థిక సాంఘిక జీవితంలోని నిర్ణాయక అంశాలను, అంచుల్లో ఉన్న అంశాలను దేన్నీ వదలకుండా పట్టుకోవాలి. జీవితాన్ని బహుళ పార్శ్వాల్లో, భిన్న తలాల్లో చూడాలి. మళ్లీ అందులో దేనికదే ప్రత్యేకమని, గొప్ప అని అనుకోవడమంటే మార్క్సిజాన్ని వదిలేసి శకలవాదానికి గురికావడమే. అన్నిటి మధ్య అంతస్సంబంధాన్ని గుర్తించడం మార్క్సిస్టులకు మాత్రమే సాధ్యం. అంతస్సంబంధం అంటున్నామంటే తప్పక మళ్లీ ప్రతిదాన్నీ దాని ప్రత్యేకతల్లోంచి చూడటం. అప్పుడు మాత్రమే అన్నిటికీ వర్తించే

వ్యూహాత్మకమైన దీర్ఘకాలిక దృష్టి పట్టుబడుతుంది. అన్నిటికీ అన్నామంటే అసలైన అర్థం అన్నిటి మధ్య ఉండే సంబంధాల మొత్తమని మార్క్సిస్టులు మాత్రమే అర్థం చేసుకోగలరు. ఇందులోని దీర్ఘకాలిక పరివర్తన పట్ల ఏమరపాటు ఉండకూడదు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, రాజ్యాంగం విషయాల్లో బ్లాక్‌మెయిల్‌కు లొంగి తక్షణ వైఖరులకు పరిమితం కావడమంటే ఆత్మహత్యా సదృశమే. రోజువారి ఆచరణలోనేకాక వ్యూహాత్మకంగా కూడా ప్రాధాన్యత ఉండే ఇలాంటి విషయాల్లో కరాఖండిగా ఉండాలి. అక్కడ ఎక్కువ మందిని ఒప్పించడానికి ఉదారవాదానికి లోబడతామా? లేక పాపులర్‌గా ఉంటూనే ఎక్కువ మందిలో వాటి మీద విమర్శనాత్మక చింతనను పెంచుతామా? అనేది తేల్చుకోవాలి.

విప్లవకర సాహిత్య సాంస్కృతిక వ్యూహాన్ని తయారు చేసుకొనేటప్పుడు తప్పక ఆధునికత గురించి మనకు సరైన వైఖరి ఉండాలి. ముఖ్యంగా మన దేశంలోకి వచ్చిన ఆధునికత ఎలాంటిదో, దాని ప్రగతిశీల పరిణామాలు ఏమిటో మనకు తెలిసి ఉండాలి. అదే సమయంలో వలస పాలన వల్ల మనకు పరిచయమైన ఆధునికతలోని వికృత స్వభావాల గురించి మనకు ఎరుక ఉండాలి. నిజానికి వలస పాలన అనే చారిత్రక ప్రత్యేకతే లేకపోయి ఉంటే మన సమాజాల్లో దేశీయమైన హేతుచింతనా క్రమం ఇంకోలా ఉండేది. దీనికి తెలుగు సాహిత్య చరిత్ర కంటే ఉదాహరణలు అక్కర్లేదు. సనాతన, శిష్ట, మార్గ సంప్రదాయాల మీద ధిక్కారంగా, ప్రత్యామ్నాయంగా దేశీ ఒరవడి కేవలం సాహిత్యరంగానికే పరిమితం కాదు. అది మన సమాజం సాగించిన అత్యద్భుత అన్వేషణ క్రమం. ఆయా స్థలకాల పరిమితులకు లోబడిన ప్రగతిశీల భావజాల నిర్మాణ క్రమంగా మనం దాన్ని చూడాలి. ఇదంతా దెబ్బతినిపోయి వలసవాదం వల్ల మనం ఇంకో ఆధునికతా క్రమంలోకి వెళ్లిపోయాం. వలసీకరణ అనే ప్రమాదం ఇందులో ఉన్నప్పటికీ మన ఆలోచనా ప్రపంచాన్ని, విలువల నిర్మాణాన్ని ఇది తీవ్రంగా ప్రభావితం చేసింది. ముందుకు తీసికెళ్లింది. మనం దానిపట్ల విమర్శనాత్మకంగా ఉండాల్సిందేకాని అందులోని ప్రగతిదాయక పరివర్తనా క్రమాన్ని తిరస్కరించడానికి లేదు. ఆ పని ఆచారిత్రకం అవుతుంది. కాబట్టి ఈ ఆధునికత పట్ల విమర్శనాత్మకంగా ఉంటూ, దానిలోని సానుకూలత చారిత్రక, తాత్వికసారమని గ్రహిస్తూ, మన దేశీయ ఆధునికతా క్రమం.. అదెన్ని వక్రీకరణలకు గురైనా సరే దాన్ని సరికొత్త దృక్పథంతో ఎత్తిపట్టి సొంతం చేసుకోవాల్సిందే. వలసవాద ఆధునికత అనే పేరుతో మొత్తానికి మొత్తం తిరస్కరించి, దేశీయత పేరుతో, వలస వ్యతిరేకత పేరుతో సనాతన సంప్రదాయ వైఖరులను గొప్ప చేసే పెడ ధోరణి కూడా మన చుట్టూ ఉన్నది. ఇది ఆకర్షణీయంగా కనిపించవచ్చేమోగాని అత్యంత ప్రమాదకరం.

ఈ సందిగ్ధానికి లోనుకాకుండా, దేశీయ సాంఘిక సాంస్కృతిక ప్రపంచాన్ని మార్చాలని ఆయా కాలాల్లో చరిత్ర ఇచ్చిన అవకాశాల మేరకు జరిగిన భావజాల కృషిని మనం ఇప్పటికే సొంతం చేసుకున్నాం. ఆ మాటకొస్తే ఆధునిక తెలుగు సాహిత్య సాంస్కృతికోద్యమమే, అభ్యుదయ సాహిత్యోద్యమమే ఈ ఒరవడిని తీసుకొచ్చాయి. విప్లవ సాహిత్యోద్యమం దీన్ని చాలా ఉన్నత స్థాయికి తీసికెళ్లింది. పీడిత అస్తిత్వాల ధిక్కార, ఆత్మగౌరవ పోరాటాలు ఇంకో తలం నుంచి దీన్ని బాగా అభివృద్ధి చేశాయి. తరతరాలుగా సాంఘిక సాంస్కృతిక దేశీయ ప్రతి వ్యూహం మన దేశంలో ఉన్నది. అందులో ఎందరో పని చేశారు. వాళ్లు మనకు వ్యక్తులుగా కనిపించవచ్చు. కానీ వాళ్లు ఈ దేశ అట్టడుగు కులాల, వర్గాల, మహిళల పోరాటాలకు ప్రతినిధులు. అదంతా ప్రజల పోరాట చరిత్ర. అందులో ఇప్పుడు మనకు తెలిసిన విశేషాలకంటే ఇంకా ఎన్నో దాగి ఉంటాయి. వాటన్నిటినీ వెలికి తీసి సానపట్టాలి. అక్కడి నుంచి పూలే, అంబేద్కర్ దాకా ఈ ఒక వారసత్వం ఉన్నది. ఇలాంటి వాళ్ల ఆలోచనల్లో అయితే తరతరాల దేశీ సంప్రదాయానికి ఆధునిక చైతన్యం కూడా తోడైంది. ఉదాహరణకు అంబేద్కర్‌లో బౌద్ధం, ఉదారవాద ప్రజాస్వామ్యాల మేలు కలయిక కనిపిస్తుంది. సమానత్వం, వ్యక్తి స్వేచ్ఛ, విమర్శనాత్మక చింతన, చట్టపరమైన రక్షణ వంటి విలువలు అంబేద్కర్‌లో గాఢంగా ఉన్నాయి. ఆయనలోని రాజకీయ వైఖరులు ఆయన దృక్పథానికి చెందినవి. ఆ కాలంలో ఆయన వాటిని ఎందుకు తీసుకున్నప్పటికీ ఇప్పుడు వాటితో మనకు గట్టి పేచీ ఉంటుంది. నిజానికి ఆయనలో ఈ రాజకీయ వైఖరులకంటే సాంఘిక సాంస్కృతిక విముక్తి భావనలే మెండు. ఆయన తదనంతరం ఈ రెండూ కలగలసి పోయాయి కావచ్చు. ఇవాళ అంబేద్కరైట్ పోరాట మార్గంగా, దళిత అస్తిత్వ వాదంగా కనిపిస్తున్నవాటిలో ఎన్నికల రాజకీయ పంథాగా అది మనకు కనిపిస్తున్నది. అయితే ఇదొక్కటే లేదు. ఆ ఉద్యమాల్లో సాంఘిక విముక్తి ఆకాంక్ష బలంగా ఉన్నది. అది చాలా విలువైనది. కేవలం హిందుత్వ ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలోనే కాదు, మన దేశ విప్లవంలోనే దానికి అతి ముఖ్యమైన చోటు ఉన్నది. కాబట్టి అందులోని రాజకీయ వైఖరులతో తీవ్రంగా ఘర్షణ పడుతూనే సాహిత్య సాంస్కృతిక వ్యూహంలో మనం దాన్ని కీలకం చేసుకున్నాం. రాబోయే కాలంలో దాన్ని మరింతగా అభివృద్ధి చేయాల్సి ఉన్నది.

దీని కోసం ఆరంభంలోనే విప్లవ సాహిత్యోద్యమం సంతరించుకున్న యాంటీ ఎస్టాబ్లిష్‌మెంట్ అనే వైఖరికి మనం మరింతగా అంటిపెట్టుకొని ఉండాలి. ఎన్ని కొత్త పోరాటాలు ముందుకు వచ్చినా, కొత్త ఉద్యమ ఆకాంక్షలు రంగం మీదికి వచ్చినా ఇది మన వెన్నెముకలా దృఢంగా, నిటారుగా ఉండాలి. నిజానికి కొత్త ఆకాంక్షలు, ఉద్యమాలు యాంటీ ఎస్టాబ్లిష్‌మెంట్ వైఖరిని బలపరిచేవే. వ్యవస్థా వ్యతిరేకత, సకల ఆధిక్యాల వ్యతిరేకత, దోపిడీ వ్యతిరేకత, రాజ్యవ్యతిరేకత, రాజ్యానికి, ఆర్థిక వ్యవస్థకు అనుబంధంగా ఉండే భావజాలాల వ్యతిరేకత అనే అర్థాల్లో విప్లవ సాహిత్యోద్యమం ఆవిర్భావంలోనే యాంటీ ఎస్టాబ్లిష్‌మెంట్ అనే విలువ, వైఖరి ఉన్నాయి. అనేక ప్రత్యేక పీడలన్నిటినీ గుర్తిస్తూనే వాటన్నిటికీ దన్నుగా నిలిచే రాజ్య వ్యతిరేకతను సంతరించుకున్నది. తొలినాళ్ల ఈ అవగాహన అనేక కోణాల్లో విస్తరించింది.

ఇది ఎట్లా ఉందో విప్లవ సాహితోద్యమ చరిత్ర నుంచే చెప్పుకోవచ్చు. కమ్యూనిస్టు ఉద్యమం తొలి రోజుల నుంచి మతాన్ని తీవ్రంగా వ్యతిరేకించేది. ఇది చాలా మామూలు విషయమే. బహుశా తాత్వికంగానే భావవాదానికి వ్యతిరేకంగా నిలబడే క్రమంలో మన దేశంలోని సనాతన భావజాలాన్ని, హిందూ మతాన్ని, కులవ్యవస్థను, బ్రాహ్మణవాదాన్ని తిరస్కరించే వైఖరులు ఆరంభం నుంచి వుండేవి. మతాన్ని అడ్డం పెట్టుకొని రాజ్యం, సమాజంలోని ఆధిపత్య శక్తులు తమ పనులు చక్కబెట్టుకోడాన్ని మతతత్వంగా దీన్ని రోజువారి జీవితంలో గుర్తించారు. విప్లవ సాహిత్యోద్యమం తొలిదశకంలోని ఈ అవగాహనలు 1980ల్లోని సిక్కుల ఊచకోత, ఏకాత్మతాయాత్ర, శిలాన్యాస్ వైపు నుంచి చూసి మతతత్వం, మతోన్మాదం కేవలం దేవుడికి, నమ్మకాలకు, ఆధ్యాత్మికానికి సంబంధించినవి మాత్రమే కాదని, దోపిడీతో ముడిపడినవని, నేరుగా వర్గంతో లంకె ఉన్నదని కెవిఆర్ మతవర్గతత్వం అని 1984 నాటికే సూత్రీకరించారు. ఇది అక్కడికి ఆగిపోలేదు. హిందుత్వను కేవలం మతోన్మాదంగానే చూసి సరిపెట్టుకోలేమని, అది హిందూ ఫాసిజమని బాబ్రీ విధ్వంసం నాటికే విరసానికి అవగాహన ఉండింది. ఆ తర్వాత



బ్రాహ్మణవాదం, కులవ్యవస్థ పునాదిగా, బూర్జువా ప్రజాస్వామ్యం బూర్జువా నియంతృత్వంగా, భూస్వామ్య, పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద దోపిడీతో ముడివేసుకున్నదనే విస్తృత అవగాహనను సూచించేలా బ్రాహ్మణీయ హిందుత్వ ఫాసిజం అని నిర్ధారించింది. ఇప్పుడు చాలా మంది ఇదే మాట అంటున్నారు.

ఈ ఉదాహరణ దేనికంటే యాంటీ ఎస్టాబ్లిష్‌మెంట్ అనే వైఖరి పార్ట్స్‌ను, హోల్‌ను కలిసి మొత్తంగా అర్థం చేసుకొనే మార్క్సిస్టు అవగాహన దిశగా ఎలా విస్తరిస్తూ వచ్చిందో చెప్పడానికి. అన్ని విడి భాగాలను నిర్దిష్టంగా అర్థం చేసుకుంటే హోల్‌ను అర్థం చేసుకున్నట్లే అనే యాంత్రిక ధోరణి కమ్యూనిస్టు శిబిరంలోనే ఉన్నది. అస్తిత్వ వాదులైతే తమ అస్తిత్వం గురించి ఆలోచించడం కంటే మొత్తానికి పరమార్థం ఏముంది అంటుంటారు. అస్తిత్వవాదులైన పూర్వమార్క్సిస్టులైతే అన్ని విడి భాగాలను వరుసగా ఒక బ్రాకెట్‌లోకి తీసికెళ్లితే చాలని, అదే వర్గమని, లేదా మొత్తమని అంటుంటారు. ఆ 'మొత్తాన్ని' సూచించే పేరు ఒకటి పెట్టుకుంటే సరిపోతుందని కూడా అంటారు. ఇవన్నీ మార్క్సిస్టు పద్ధతికి వల్గర్ రూపాలు. పార్ట్ మధ్య అన్యోన్య సంబంధాలు ఉండటమే కాదు, అన్ని కలిసిన మొత్తంతో ప్రతి పార్ట్‌కు అన్యోన్య సంబంధం ఉంటుందనే పద్ధతి పట్ల గురి ఉంటేనే మతవర్గతత్వం దగ్గరి నుంచి బ్రాహ్మణీయ హిందుత్వ ఫాసిజం దాకా సూత్రీకరణను విస్తరించుకోవచ్చు.

విప్లవోద్యమం, విప్లవ సాహిత్యోద్యమం యాంటీ ఎస్టాబ్లిష్‌మెంట్ అనే వైఖరిని మార్క్సిస్టు పద్ధతిలో అభివృద్ధి చేసుకుంటూ వచ్చింది. బలోపేతం చేసుకుంటూ వచ్చింది. ఈ క్రమం సాధించడంలో మిగతా కారణాలతోపాటు అస్తిత్వ ఉద్యమాల పాత్ర కూడా ఉన్నది. అవి పీడిత అస్తిత్వాలపట్ల ఆర్తిని, సున్నితత్వాన్ని పెంచాయి. తద్వారా మార్క్సిస్టు పద్ధతిని ఆచరణాత్మకంగా ఎప్పటికప్పుడు మరింత మెరుగ్గా విప్లవ, విప్లవ సాహిత్యోద్యమాలు అన్వయించుకుంటూ వచ్చాయి. ఆ రకంగా అస్తిత్వ ఉద్యమాల నుంచి విరసం కొన్ని విషయాలు నేర్చుకున్నది. మరి అస్తిత్వ వుద్యమాలు ఏమైనా నేర్చుకున్నాయా? అని వినయంగా, విస్పష్టంగా ప్రశ్నించవలసి ఉన్నది. మీ మీ పీడిత అస్తిత్వాల గురించి ఆలోచించడం చాలా మంచిదే. మీ పక్కనే ఉన్న పీడిత అస్తిత్వాలన్నిటి గురించి ఆలోచించగల సంవిధానం అస్తిత్వవాద నాయకులకు ఉన్నదా? దానితోపాటు మొత్తంగా రాజ్యవ్యతిరేక వైఖరి తీసుకోడానికి సిద్ధంగా ఉన్నారా? అని మనం అడగవలసిందే. దీనికి మోమాటపడాల్సిన పని లేదు. మొత్తం గురించి ఇప్పటికీ ఆలోచించకుండా దశాబ్దాల కిందటి వైఖరితోనే కాలం గడపడం అంటే అచారిత్రికంగా మిగిలిపోవడమే. దాదాపుగా విప్లవ సాహిత్యోద్యమానికి ఎంత వయసు ఉన్నదో అంతే వయసు అస్తిత్వవాదాలకు ఉన్నది. అవేం బాల్యావస్థలో లేవు. ఈ మాట అడిగితే ఎక్కడ ఫాసిస్టు వ్యతిరేక ఐక్యతకు భంగం కలుగుతుందో అని భయపడాల్సిన పని లేదు. సాహిత్యరంగంలో భావజాల సంఘర్షణ లేని ఐక్యత నిరర్థకం. అందులో ఏ శక్తీ ఉండదు. అందరినీ కూడగట్టడమంటే నిర్విమర్శగా కలిసిపోవడం కాదు. అలాంటి కర్తవ్యం ఎవరికీ మంచిది కాదు.

వర్గపోరాటవాదులు పీడిత అస్తిత్వాల సాంఘిక బంధనాలను ఎలా విముక్తం చేయగలరో దండకారణ్యానికంటే ఉదాహరణ అక్కర్లేదు. విప్లవం విషయంలో దండకారణ్యంపట్ల చాలా మందికి విముఖత, విమర్శ ఉండవచ్చు. అది పూర్తిగా వేరే చర్చ. కానీ విప్లవోద్యమంలో సాంఘిక విముక్తి ఆచరణ ఎలా కలగలిసి ఉంటుందో, ఎలాంటి అద్భుత పరిణామాలు సాధ్యమో దండకారణ్యం రుజువు చేస్తోంది. అంతే కాదు. సిద్ధాంత రంగంలో తలమునకలవుతున్న అనేక సాంఘిక, సాంస్కృతిక విషయాల్లో, వ్యక్తి స్వేచ్ఛ, వ్యక్తి వికాసం, నూతన భావజాల నిర్మాణం, నూతన విలువల ఆవిష్కారం వంటి వాటిలో దండకారణ్య ఉద్యమం అనేక సిద్ధాంత సమస్యలను పరిష్కరిస్తోంది. ఇవాళ ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమానికి ఇరవయ్యో శతాబ్దంలోలాగా సోవియట్ యూనియన్ ప్రపంచ ప్రజలకు లేకపోవచ్చు. భారతదేశంలో బ్రాహ్మణీయ హిందుత్వ ఫాసిజాన్ని ఎదుర్కోడానికి భావజాల ఆలంబనగా దండకారణ్యం ఉన్నది. కేవలం భావజాల పరంగానే కాదు, పటిష్ఠ నిర్మాణంతో కూడిన సమరశీలశక్తిగా దండకారణ్యం మన పక్కనే, మన మధ్యనే ఉన్నది. ఈ సంగతి గుర్తించడానికి ఇటు వామపక్ష, అస్తిత్వ శిబిరాల్లో కూడా అభ్యంతరాలు ఉండవచ్చు. మరి ఫాసిజానికి వ్యతిరేకంగా మీ ఆచరణాత్మక సిద్ధాంత ప్రత్యామ్నాయం మాటేమిటి? అనే ప్రశ్న ఎదురుగానే ఉంటుంది.

* * *

చివరిగా ఒక మాట. ఇంత కల్లోలకాలంలో, ఉద్విగ్నభరిత పోరాట కాలంలో, తిరుగులేని భవిష్యదాశా ప్రపంచంలో మనం ఉండగా మన చుట్టూ కొన్ని నిట్టూర్పులు వినిపిస్తున్నాయి. మిగతా విషయాలు అటుంచినా, కనీసం సాహిత్య రంగంలో ఇవి బాగానే వినిపిస్తున్నాయి. అలాంటి వాళ్ల సమస్య ఏమంటే మొత్తాన్నీ చూడలేకపోవడం. తెలుగు సాహిత్యరంగం గతంతో పోల్చుకుంటే చాలా డైనమిక్‌గా ఉంది. అవార్డులు, సన్మానాల కోసం తపించే వాళ్లను చూసి దీన్ని గుర్తించలేకపోవడం అన్యాయం. ఆచారిత్రికం. అలాంటి వాళ్లు లేనిది ఎన్నడు? లేనిది ఎక్కడ? అదొక ముఖ్యమైన సమస్య. ఈ తరహా విమర్శకులు ఎంత సిల్లీగా ఉంటారంటే, ఎవరో, ఏ భాషలోనో, ఏ కారణంతోనే అవార్డు తిరస్కరించారనుకోండి.. దాన్ని చూసి తెలుగు సాహిత్య లోకమంతా దివాళాకోరుగా తయారైందని పెద్ద పెద్ద వ్యాఖ్యలు చేస్తుంటారు. ఆ రచయిత అలా తిరస్కరించడం తప్పక గౌరవనీయమే. అవార్డుల, రాజాశ్రయాల పట్ల తెలుగు సాహిత్యంలో మమకారం పెరుగుతున్నది. దాన్ని ఎదుర్కోవలసిందే. అయితే ఇలాంటివి మాత్రమే చూసి సినికల్‌గా తయారవుతున్న వాళ్లూ ఉన్నారు. వీళ్ల వల్ల నష్టం లేకపోయినా ప్రయోజనం ఏమీ కనిపించడం లేదు. దేనికంటే తెలుగు సాహిత్యకారుల్లోని రాజకీయ, సాంస్కృతిక ధిక్కార చైతన్యాన్ని ఏ కారణం వల్లనైనా తక్కువ చేయడం మంచిది కాదు. పైగా అది వాస్తవ విరుద్ధం. తెలుగు సాహిత్యకారులు యావజ్జీవ శిక్షలను, అంతులేని అక్రమ నిర్బంధాలను, ప్రకటిత, అప్రకటిత నిషేధాలను, డజన్ల కొద్దీ ఉపా కేసులను ఎదుర్కొంటూ మృత్యువు సరిహద్దులోని సంచారానికి సిద్ధమైన కాలం ఇది. బహుశా గతంలో మనం ఎరుగని స్థితి ఇది. ఇది కేవలం రాజ్య వ్యతిరేకతే కాదు, రాజకీయ నిబద్ధతే కాదు. సకల విస్తృతార్థాల్లో

# బహురూపుల ఫాసిజాన్ని ఎదుర్కొందాం

కాత్యాయనీ విద్మహే

విరసం మరో యాభై లోకి ప్రయాణం ప్రారంభించిన వేళ అనేక ప్రతికూల పరిస్థితుల మధ్య విజయవాడలో సమావేశమైన మిత్రులందరికీ అభినందనలు. నిన్నటి ఆంధ్రజ్యోతి సంపాదకీయం చూసే ఉంటారు. భారతదేశం 140 మంది బిలియనీర్లతో ప్రపంచంలో మూడవ స్థానానికి చేరిందట. ఇలా అతికొద్దిమంది కుబేరులవుతూ అనేకులు సమస్తం పోగొట్టుకొని కనీస అవసరాలకు, భద్రతకు, గౌరవానికి దూరమై బతకాల్సి రావటానికి ఉన్న సంబంధం గురించి ఆలోచించటం, మాట్లాడటం, ఇలాంటి సమాజం మంచికి మారాలని ఆశించటం, మార్చటానికి సాధనమైన ఒక రాజకీయ భావజాలాన్ని నమ్మటం, సాహిత్య కళారంగాలను కార్యక్షేత్రాలుగా ఎన్నుకొని పనిచేయటం 'దేశ ద్రోహం' అయిన పరిస్థితిలో విరసం ఈ సాహిత్య పాఠశాల జరుపుకొంటున్నది.

సామాజిక అనారోగ్యం గురించి మాటాడినందుకు శారీరక అనారోగ్యంతో యుద్ధం చేస్తూ సాయిబాబా జైలులో ఉన్నాడు. వరవరరావు జైలులో లేడన్నమాటే గానీ నగర నిర్బంధంలో ఉన్నాడు. లేకపోతే ఈ రోజు ఆయన ఇక్కడ ఉండవలసినవాడు. ఉండేవాడు. పాణి, వరలక్ష్మి వంటి వాళ్ళు NIA నిఘా నీడలో గృహ సోదాలకు, విచారణలకు గురి అవుతున్నారు. భిన్నాభిప్రాయాన్ని అణచి పారెయ్యాలన్న ఈ రకమైన విధానం పేరే ఫాసిజం. ఏకీభవించనోడి పీకనొక్కు సిద్ధాంతం' అన్నాడు దీనినే కాళోజీ. ఇది ఇంకా అనేక క్షేత్రాలలో, అనేక తలాలలో కరోనా వైరస్‌లాగా రూపాలను, స్వభావాలను, ప్రభావాలను అనూహ్యంగా మార్చుకొంటూ వ్యాపిస్తున్నది. జీవన సంస్కృతిలో భాగమై అప్రజాస్వామిక విధానాలకు సమ్మతిని సమకూరుస్తున్నది. ఇది ఈ నాడు మనముందున్న పెద్ద సవాల్. దీనిని సంబోధించి పనిచేయటంలో రచయితలుగా, కళాకారులుగా మనమెంత విశాలం అవుతూ ద్విగుణం, త్రిగుణం, బహుళం అవుతూ ఉండాలో ఆ సంభాషణకు మరో యాభైలలోకి ప్రవేశిస్తున్న విరసం వేదిక కావటం సమయానికి తగినదిగా ఉంది.

అధికారం, హింస, అణచివేత జీవితంలో ఏ మూల ఏ రూపంలో ఉన్నా సహించలేక పోవటం, తిరగబడటం మానవాత్మ సహజ లక్షణం. ఆ జీవితం ఏ సామాజిక ఆర్థిక వర్గ మానవ సమూహానిది? అన్న ప్రశ్నకు తావు లేదిక్కడ. ద్రౌపది రాజవంశ స్త్రీ. రాజ్యాధికారం కోసమే పాండవ కౌరవుల ఘర్షణ. కానీ ఆ ఘర్షణ పరిధిలోనూ న్యాయా న్యాయాలు ఉంటాయి. పాండవులు అన్యాయంగా అరణ్యవాసం పేరుమీద అడవులకు నెట్టబడ్డారు. ద్రౌపది అవమానింపబడింది కూడా. అది సహించలేని లక్షణం వల్లనే ద్రౌపది 'ఉదితక్రోధుడవు కమ్ము ఒక్కించుక' అని ధర్మరాజును కౌరవులపై యుద్ధానికి పురికొల్పింది. కృష్ణుడిని రాయబారం పంపే సందర్భంలో అయిదువూళ్ళు ఇచ్చినా చాలు అన్న ధర్మరాజు ప్రతిపాదన పట్ల నిరసన ప్రకటిస్తూ కృషుడికి 'తీరుమాటలకడ దుస్ససేనుడిచేత లాగబడి సగము తెగి మిగిలిన తల వెంట్రుకలను గుర్తు పెట్టుకో'మని చెప్పింది. ఇలాంటి తిరుగుబాట్లు, రాజ్యం మీద, కుటుంబాధికారం మీద, భర్తల పెత్తనాల మీద, కుల మత అధికారాల మీద చేసిన స్త్రీ పురుషులు చరిత్రలో ఎంతోమంది ఉన్నారు. అవి వ్యక్తిగత తిరుగుబాట్లు కావచ్చు. అనేక వ్యవస్థాగత పరిమితుల మధ్య చేసిన తిరుగుబాట్లే కావచ్చు. న్యాయం కోసమైన ఆ సహజ మానవ ఆకాంక్షా బీజమే ఈనాడు చైతన్యవంతమైన సామూహిక ఉద్యమాల రూపంలో శాఖోపశాఖలుగా విస్తరించింది అని గుర్తుంచుకోవాలి.

ఆలోచన, చైతన్యం, సిద్ధాంతం, ఆచరణ నిరంతరం మార్పుకు లోనయ్యేవే కానీ జడాలు, స్థిరాలు కావు. మనుషులందరి ఆలోచన, చైతన్యం, సిద్ధాంతం, ఆచరణ ఏకశిలా సదృశం కూడా కాదు. అవి సాపేక్షాలు. ఒక ప్రజాస్వామిక విలువల కేంద్రం వైపు ఏమేరకు కదులుతున్నాయి అన్నదే ముఖ్యం. కనుకనే ఈనాడు మహిళా దళిత మత ప్రాంతీయ అస్తిత్వ చైతన్యాలలో, ఉద్యమాలలో ఉన్న ధిక్కార స్వరాన్ని వినటానికి, స్వరం కలపటానికి ప్రాధాన్యత పెరుగుతున్నది. ఫాసిజాన్ని ఎదుర్కొనటానికి భిన్నప్రజాస్వామిక స్వరాలు ఒక్కటే పాటగా మారాల్సి ఉంది. ఈ క్రమంలో ఏ ఆలోచనను, ఏ ఆచరణను తక్కువచేసి చూడటానికి లేదు. ఆలోచనల, ఆచరణల ఉన్నతీకరణకు సహనంతో, పరస్పర సంభాషణలతో నిరంతర ప్రయత్నం కొనసాగుతూనే ఉండాలి. బహురూపుల ఫాసిజాన్ని ఎదిరించటానికి ఇంత కన్నా దగ్గరి మార్గం లేదని ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక నమ్ముతుంది. ఆ దిశగా బిగ్గరగా ఆలోచించటానికి జరుగుతున్న ఈ విరసం పాఠశాల విజయవంతం కావాలని ఆకాంక్షిస్తున్నది.

విరసం వర్ధిల్లాలి



---

యాంటీ ఎస్టాబ్లిష్‌మెంట్. గొప్ప సాంస్కృతిక, భావజాల, నైతిక సాహసం ఇందులో ఉంది. పోరాట క్రమంలో, సమాజ పరిణామ క్రమంలోని ఆటుపోట్లను లోతుగా అర్థం చేసుకొనే తాత్విక ఆశావాదం ఇందులో ఉంది. జీవితంలోని సకల కోణాలను, భిన్న తలాలను, అనుభవాలను కాల్పనీకరించగల, రచనా ప్రక్రియల్లో ప్రయోగం చేయగల, సాహిత్య విమర్శలో విశ్లేషించి అంచనా వేయగల ఉన్నత స్థాయికి తెలుగు సాహిత్యకారులు చేరుకున్నారు. తెలుగు సాహిత్య మేధో రంగాల్లో దీన్ని చూడ్డానికి మనసు ఒప్పని వాళ్ల నుంచే నిరాశలు, అర్థరహిత విమర్శలు వినిపిస్తుంటారు. కాలు కదిల్చి, ప్రజా క్షేత్రంతో సంబంధాల్లోకి వస్తే ఆశలు చిగురిస్తాయి. అలాంటి కాలంలో ఉన్నామనే ఎరుకే అన్నిటికన్నా ముఖ్యం.

ప్రజా పోరాటాల్లోని అపారమైన విద్యుత్తేజం సాహిత్యరంగాన్ని ఎలా సమరశీలం చేస్తుందో తెలుగు సాహిత్యానికంటే ఉదాహరణ అక్కర్లేదు. అది తప్పక వర్తమానానికి చెందినదే కాదు. రూపొందే కొత్త పోరాట ప్రపంచానికి సంబంధించింది కూడా. అక్కడి దాకా సాగించడమే మనందరి చారిత్రక బాధ్యత.



# ఒక ముస్లింవాది ఆలోచనలు

స్కైబాబ

నిజం మీద నిలబడే ప్రగతిశీల దోస్తులకు సలాములు! ఇప్పుడు భారత దేశ సమాజం అబద్ధం మీద నడుస్తున్నది. ఈ అబద్ధాన్ని పెంచిపోషించే సంస్థలు, పార్టీలున్నంత బలంగా నిజంపై ఆధారపడేవి లేకపోవడం నిజంగా విచారకరం. అయినా మనకు నిజమే ఆధారం. నిజమే బలం.

దేశంలో ముస్లిం వ్యతిరేకత పెద్ద ఎత్తున పెంచబడింది. దానిని ఎలా తుంచగలం? మిగతా సమాజం నుంచి ముస్లింల విడదీత కార్యక్రమాన్ని ఫాసిస్టు శక్తులు తీసుకున్నాయి. దానిని ఎలా ఆపగలం? భవిష్యత్తులో ముస్లింల ఊచకోతలను ఎలా నిలువరించగలం?

* * *

దేశంలో వేళ్లూనుకున్న ఫాసిజం ముస్లిం వ్యతిరేకత మీద తమ ఉనికిని కాపాడుకుంటూ 'హిందూ' భావోద్వేగాలను రెచ్చగొట్టి అల్లకల్లోలం సృష్టించే ఉద్దేశంతో ఉంది. అందుకు మిగతా సమాజంతో ముస్లింలను విడదీసే ఎత్తులు అనేకం వేస్తూ వస్తున్నది. అందుకు ఎన్నార్సీ-సిఏఏ చట్టాలు, ఆవును గోమాతగా ప్రచారంలోకి తేవడం, బీఫ్ నిషేధం పేర దాడులు, బీఫ్ చుట్టూ ఉన్న ముస్లిం జీవనోపాధులను ధ్వంసం చేయడం, లవ్ జీహాద్ పేర చట్టం చేయడం, రామాలయ నిర్మాణం పేర అనేక రకాల ప్రచారాలు, నినాదాలు, కశ్మీర్ నిర్బంధం, హత్యలు, రేప్‌లు చేసిన వారికి అందలాలు, ప్రైవేటీకరణ, అన్ని రకాల సంస్థల అమ్మకం ద్వారా కొన్న యజమానులు రిజర్వేషన్లను తీసివేసే అవకాశాన్ని కల్పించడం,... ఇలా ఎన్నో రకాలుగా మిగతా అణగారిన సమూహాలతో పాటు ముస్లింల అణచివేత కార్యక్రమం నడుస్తున్నది. తాము ఏదో మేరకు హిందువులమే నని ప్రకటించుకోక తప్పని పరిస్థితిని మిగతా ముస్లిమేతర సమాజానికి ఫాసిస్టు శక్తులు కల్పించాయి.

కశ్మీర్‌ను కలుపుకొని దేశమంతా వేలాదిమంది ముస్లింల అదృశ్యం, అరెస్టులు, ఊచకోతలు కొనసాగుతున్నాయి. మొత్తంగా ముస్లింలను సమాజం నుంచి వెలి ప్రచారం జరుగుతున్నది. ఉద్యోగ, వ్యాపార రంగాల్లో వారిని దూరం పెట్టే కార్యక్రమం కొనసాగుతున్నది. మొత్తంగా ముస్లింలను ఈ దేశంలో ఇవాళ అత్యంత బాధితులుగా మార్చివేశారు. ఒక్క ముస్లిం సమూహాన్ని పెద్ద ఎత్తున టార్గెట్ చేస్తుంటే మిగతా బౌద్ధిక సమాజం ఏ మేరకు ముస్లింలకు అండగా నిలుస్తుందన్నది ఇవాల్టి ప్రశ్న.

భవిష్యత్తులో ముస్లింల ఊచకోతల మీద ఈ దేశ చరిత్ర నిలవడం అనే అగాథాన్ని పూడ్చడానికి, ఆ అపరాధ భావాన్ని నిలువరించడానికి ఇప్పుడే అన్ని వర్గాల వారు పూనుకోవాలి. అందుకు తమ వంతు కృషి చేయాలి.

గతంలో జరిగిన పొరపాట్ల కొలతలు వేసుకోవడం సరే, ఇప్పటికైనా ఏం చేయగలమో ఆ కార్యక్రమాలు రూపొందించాలి. విప్లవ సంస్థలు, పార్టీలలో ముస్లింలు ముస్లిం అస్తిత్వాలను వదులుకోవడం చరిత్ర. ఇవాళ ఆ సంస్థల్లో పార్టీలలో ఉన్న ముస్లింలను ముస్లిం అస్తిత్వం గురించి, ముస్లిం సమాజం చైతన్యం కోసం పని చేయడానికి, ముస్లింలు-ముస్లిం చైతన్యవంతులు మిగతా సమూహాలతో కలిసి పనిచేయడానికి పురమాయించి కార్యక్రమాలు రూపొందించుకునేలా నిర్దేశించాల్సిన అవసరముంది.

**కొన్ని ప్రతిపాదనలు:**

- *విప్లవ సంస్థలు, పార్టీలు తమ ఉనికిని నిలబెట్టుకొంటూ బలపడడమే బాధితులకు అండ.*
- *ఆయా సంస్థలు, పార్టీలు తమ ఎజెండాలో ముస్లింల గురించి ప్రత్యేకంగా కార్యక్రమాలు రూపొందించాలి.*
- *ముస్లింలు మూలవాసులు అన్న నిజం పెద్ద ఎత్తున ఆధారాలతో సహా ప్రచారంలోకి తీసుకురావాలి.*
- *ముస్లింల గురించి పనిచేసే వ్యక్తులకు సంస్థలకు అనేక కోణాల నుంచి అండదండలు అందించాలి.*
- *ముస్లింలు మత పరిధిని వ్యక్తిగతం చేసుకొని, సామాజిక చైతన్యంలో భాగం కావాలనే చైతన్యాన్ని అందించడానికి ఎవరి వంతు వారు కృషి చేయాలి.*
- *బీసీలను పెద్ద ఎత్తున మనువాదులుగా మారుస్తున్నాయి ఫాసిస్టు శక్తులు. వారిని మనువాదులుగా, ఫాసిస్టులుగా మారకుండా నిలువరించడానికి ప్రత్యేక కార్యక్రమాలు రూపొందించాలి. బీసీలను ఎంతగా బిజెపీ, ఆరెస్సెస్ వైపు పోకుండా కాపాడుకుంటే అంతగా ఈ దేశంలో ప్రజాస్వామ్యం నిలవడానికి అవకాశముంది.*
- *బీసీలు, ఎస్సీలు, ఎస్టీలకు సంబంధించి వారి సంస్కృతుల ఆచరణలో మనువాదాన్ని విడదీయాలి. వారి ప్రత్యేక సంస్కృతులను ప్రచారంలోకి తేవాలి. అమ్మ దేవతల సంస్కృతిని మూలవాసీల అసలు సంస్కృతిగా ఆధారాలతో ప్రచారంలో పెట్టాలి.*
- *మాల-మాదిగల మధ్య, దళితుల-బీసీల మధ్య, బీసీల్లో ఆయా కులాల మధ్య, ఎస్టీ-ఎస్సీ మధ్య, ఎస్టీ-బీసీల మధ్య అలాయిబలాయి కార్యక్రమాలు నిర్వహించాలి. అలాగే మాదిగలు-ముస్లింల మధ్య, మాలలు-ముస్లింల మధ్య, బీసీలు-ముస్లింల మధ్య, ఎస్టీలు-ముస్లింల మధ్య అలాయిబలాయి కార్యక్రమాలు నిర్వహించాలి. ఈ సమూహాల మధ్య వృత్తిపరంగా, జీవన విధానాల పరంగా, రిజర్వేషన్ల పరంగా ఉన్న సమానతలు, సారూప్యతలను చర్చకు పెట్టాలి. వాటి మూలాల వెతుకులాట కొనసాగించాలి.*
- *బహుజన చైతన్యమే ఈ దేశంలో ఎప్పటికైనా మనువాద ఫాసిజాన్ని ఎదుర్కొనే దేశీయ విప్లవం. కాబట్టి బహుజనుల సార్థ్యంలో పనిచేస్తున్న వేదికలకు, సంస్థలకు, పార్టీలకు అండదండలు అందించాలి. వాటిని ప్రోత్సహించాలి. వాటి మధ్య అలయెన్సు ఏర్పడేలా కృషి చేయాలి.*
- *దళితులు, ముస్లింలు, సిక్కులు ఇవాళ మనువాద ఫాసిజంతో తెగించి పోరాడుతుండడం చూస్తున్నాం. ఈ పోరాటాల నుంచి, ఈ పరిణామాల నుంచి నేర్చుకోవసింది ఎంతో ఉంది.*

11.04.2021 

# ఫాసిజం - భారత అస్తిత్వ సమూహాల ధిక్కారం

- దానీ

1. మనదేశంలో నయా మనువాద నియంతృత్వం రాజ్యం చేస్తున్నదని ఇప్పుడు ఎక్కువ మంది గుర్తిస్తున్నారు. దేశవ్యాప్తంగా అనేకానేక నిస్సహాయ (vulnerable) సమూహాలు చాలాకాలంగా దీని ఉక్కుపాదాల కింద నలిగిపోతున్నాయి.
2. సాంస్కృతిక జాతీయవాదానికి తొలి బాధితులు మత అల్పసంఖ్యాక వర్గాలు. ఆ బాధితుల్లోకెల్లా బాధితులు ముస్లింలు.
3. స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో భారత రాజకీయార్థికరంగాల్లో భౌగోళిక జాతీయవాదం బలంగావుండేది. కులమతాలకు గౌరవప్రదమైన గుర్తింపు వుండేదికాదు. అవి పౌరుల వ్యక్తిగత (ప్రైవేటు) వ్యవహారంగా మాత్రమే వుండేవి.
4. దేశప్రజలకు లౌకిక రాజ్యాంగం ఒక మార్గదర్శిగా నిలిచేది. విద్యా ఉపాధి అధికార రంగాల్లో తగిన ప్రాతినిధ్యం దక్కని సమూహాలు ప్రభుత్వాల మీద రాజకీయ వత్తిడి తెచ్చి తమ కోసం ఉద్దీపన చర్యల్ని సాధించుకునే అవకాశాలుండేవి.
5. వామపక్షాలు, నక్సలైట్ ఉద్యమాల ప్రభావం కారణంగా ప్రధాన స్రవంతి రాజకీయాల్లోనూ ప్రజాసంక్షేమం అనేది ఒక విలువగా కొనసాగేది. ఇందిరాగాంధి భూసంస్కరణలు, గరీబీహటావో, బ్యాంకుల జాతియీకరణ, ఎంజి రామచంద్రన్, ఎన్టీ రామారావుల చౌకబియ్యం, జనతావస్త్రాలు పథకాలు అలావచ్చినవే.
6. ప్రస్తుతం సాంస్కృతిక జాతీయ వాదానికి ప్రధాన రాజకీయ వేదికగా వుంటున్న భారతీయ జనతా పార్టి సహితం తన ఆరంభ దశలో గాంధీయ సోషలిజం అని నినదించేది.
7. ఏ చారిత్రక దశలో అయినా ఒకే భావజాలం వుండదు. ఒక నిర్ధిష్ట దశలో కొన్ని భావాలు బలంగావుంటే మరికొన్ని బలహీనంగా వుంటాయి. దశ మారినపుడు వీటి ప్రభావాలూ స్థానాలూ మారిపోతాయి. సాధారణంగా మనుషులు తాము నమ్మే భావజాలం మాత్రమే సమాజంలో వున్నట్టు ఒక భ్రమకు గురవుతుంటారు. ఇతర భావజాలాల ఉనికిని గుర్తించరు. ఏ దశలో అయినాసరే ఆధిపత్యంలోవున్న భావజాలమే తన కాలాన్నిశాసిస్తుంది.
8. స్వాతంత్ర్యం వచ్చే నాటికి కాంగ్రెస్ లోపల గాంధీజీ, పటేల్, కాంగ్రెస్ బయట సావర్కర్, గోల్వాల్కర్, హెగ్డేవార్ వంటి భిన్న స్రవంతులువున్నప్పటికీ 'నెహ్రూమార్క్' సెక్యులర్ భావాలు బలంగా వుండేవి. అలాకాకుంటే ప్రజాస్వామిక రాజ్యాంగం ఆమోదాన్ని పొందేదికాదు. "న్యాయం, స్వేఛ్ఛ, సమానత్వం, సోదరభావం" అనే ఆదర్శాలు భారత రాజ్యాంగ ప్రాణప్రద ఆదర్శాలుగా మారేవికాదు.
9. ప్రజాస్వామిక రాజ్యాంగాన్నేకాదు; త్రివర్ణ పతాకాన్ని సహితం వ్యతిరేకించిన వారు ఆనాడూ వున్నారు. అప్పుడు ఆ శక్తులు బలహీనంగా వున్నాయి. ఇప్పుడు ఆశక్తులు బలపడ్డాయి. చారిత్రక దశ తలకిందులు అయింది.
10. 1990వ దశాబ్దంలో ప్రపంచ రాజకీయార్థికరంగాలు పెద్ద కుదుపుకు గురయ్యాయి. బౌద్ధికరంగంలో అప్పటివరకు కొనసాగిన విలువలు తలకిందులయ్యాయి. తూర్పుయూరప్ లో సామ్యవాదభావాలు బీటలువారాయి. ప్రపంచ వాణిజ్య సంస్థ ఏర్పడింది. వీటి ప్రభావం చాలా వేగంగా భారతదేశం మీద పడింది.
11. ప్రజారంగంలో ప్రైవేటైజేషన్ ప్రవేశించింది. ప్రైవేటు రంగంలో వున్న కులమతాలు ముందుకొచ్చి రాజకీయాల్ని శాసించడం మొదలెట్టాయి. సంక్షేమంకన్నా సంస్కృతి ముఖ్యం అనే వాదాలు ముందుకు వచ్చాయి.
12. భౌగోళిక జాతీయవాదాన్ని సాంస్కృతిక జాతీయవాదం అధిగమించింది. మధ్యయుగాల్లో జరిగినట్టు పరిపాలన విభాగం లోనికి మతం ప్రవేశించింది. ఆర్థికరంగంలో పేదల నుండి సంపన్నులకు రక్షణ, సాంస్కృతిక రంగంలో అల్పసంఖ్యాకుల నుండి అధికసంఖ్యాకులకు రక్షణ అనే విపరీత ధోరణులు విజృంభించాయి.
13. ప్రజాసంక్షేమం అనే నినాదం వెనక్కి వెళ్ళిపోయింది. కార్పొరేట్ల సంక్షేమం అనే నినాదం బలంగా ముందుకు వచ్చింది. మనదిప్పుడు అంబా సాంస్కృతిక విధానం, అంబానీ ఆర్థిక విధానం.
14. గత మూడు దశాబ్దాలుగా మనదేశంలో చెలరేగుతున్న ఈ భావజాలాల్ని రెండు పాయలుగా వర్గీకరించవచ్చు. వీటిల్లో మొదటివి ముస్లింలను 'అన్యులుగా' చిత్రిస్తుంటాయి. రెండోవి ముస్లింలను నిర్లక్ష్యం చేస్తుంటాయి.
15. సామదానభేధోపాయాలకన్నా పవర్‌ఫుల్ ఉపాయం నిర్లిప్తత. కాంగ్రెస్ ముస్లింలను పట్టించుకుంటున్నట్టు నటించి మోసం చేసింది. వామపక్షాలు ముస్లింలను అసలు పట్టించుకోక అన్యాయం చేశాయి.
16. కొన్ని భావజాలాలైతే ముస్లింలను నడిరోడ్డు మీద చుట్టుముట్టి నరికి చంపినా తప్పుకాదనే ధోరణితో వ్యవహరిస్తున్నాయి. దీనికి లించింగ్, మూకోన్మాదం అనే ముద్దుపేర్లు కూడ వున్నాయి.
17. మనసమాజంలో 'ప్రగతిశీలురు'గా చెలామణి అవుతున్నవారు సహితం ముస్లిం సామాజికవర్గాలకు చేస్తున్న హాని తక్కువదేమీకాదు. ముస్లింలు మతఛాందసులనీ, అంతర్ముఖ సమూహం అనీ, ఇంట్రావర్ట్ కమ్యూనిటీ అనీ, సామాజిక అంశాల్ని పట్టించుకోరని నిందలేసేవారికి ఇప్పుడు కొదవలేదు.
18. అయితే, ముస్లింల మీద జాలిచూపుతున్న భావజాలాలు కూడ కొన్నున్నాయి. వీటిల్లో కొన్ని ముస్లింలు తమ మతాన్ని వదులుకోవాలి అంటున్నాయి. ఇంకొన్ని ముస్లింలు హిందూమతాన్ని స్వీకరించాలి అంటున్నాయి. లేదా హిందూ మత సమూహానికి ముస్లింలు లొంగివుండాలి అంటున్నాయి. మరికొందరు ముస్లింలు బౌద్ధమతాన్ని స్వీకరించాలంటున్నారు. ఎవరు ఎన్నిరకాలుగా చెప్పినా వీళ్ళందరి అభిప్రాయం ఒక్కటే. ముస్లింలు తమ అస్తిత్వాన్ని

కోల్పోవాలి.

19. మతభావనలు అలౌకికమైనవి. కానీ, మతవాదాలు లేదా మతతత్వాలు లౌకికమైనవి. మతానికి అలౌకిక తపనవుంటే, మతతత్వానికి లౌకిక ప్రయోజనం వుంటుంది.

20. అస్తిత్వ సమూహాల అణిచివేతకు పరిష్కారం ఏమిటీ? అనే ప్రశ్న దాదాపు మూడు దశాబ్దాలుగా బలంగా వినిపిస్తూనే వుంది. కొందరు పార్లమెంటరీ ప్రజాస్వామ్య మార్గమే మేలంటున్నారు. ఇంకొందరు సాయుధపోరాటమే శరణ్యం అంటున్నారు. అయితే, వీళ్ళిద్దరు చూపుతున్న రెండు మార్గాల్లోనూ గత ముప్పయ్యేళ్ళ ప్రోగ్రెస్ రిపోర్ట్ ఉత్తేజకరంగా మాత్రం లేదు.

21. ఇంతటి ప్రతికూల వాతావరణంలో, ముస్లింలు తమ దారిని తామే వెతుక్కోవాల్సి వచ్చింది. తమ కార్యక్రమాన్ని తామే రూపొందించుకోవాల్సి వచ్చింది. తమ ఆందోళనను తామే చేపట్టాల్సివచ్చింది. తమ ఆందోళనా రూపాన్నీ తామే రూపొందించుకోవాల్సి వచ్చింది.

22. మూడు రంగుల జాతీయ జెండా నీడన నిలబడి, ఒళ్ళో గాంధీజీ అంబేద్కర్ల ఫొటోలు పెట్టుకుని, ఒక చేతితో భారత లౌకిక రాజ్యాంగాన్ని పట్టుకుని, ఇంకో చేతితో పిడికిలి బిగించి "న్యాయం, స్వేఛ్ఛ, సమానత్వం, సోదరభావం" అంటూ భారత ముస్లింలు నినదిస్తున్నారు.

23. "అప్పుడు కాలం కడుపుతోవుంది / కార్ల్ మార్క్సును కనింది/ అదనపు విలువల కన్నపు దొంగల్ని/ కలుగుల్లోనే పట్టుకున్నాడు మార్క్స్" అన్నాడు మయకొవిస్కీ. సరిగ్గా అదే తీరులో నయా మనువాద నియంతృత్వాన్ని దేశ రాజధాని నగరంలోనే దిగ్బంధించే వ్యూహాన్ని ముస్లిం మహిళలు కనుగొన్నారు. అదే షాహీన్ బాగ్ ఉద్యమం. It is not a just discovery; it is an invention.

24. 'భారత లౌకిక రాజ్యాంగ పరిరక్షణ ఉద్యమం'ను రూపొందించిన ఘనత భారత ముస్లిం మహిళలదే.

25. ప్రపంచ కమ్యూనిస్టు అభిమానులకు పారిస్ కమ్యూన్ ఒక దారిని చూపినట్టు భారత అస్తిత్వ సమూహాలకు షాహీన్ బాగ్ ఒక పోరాట రూపాన్ని అందించింది. నాలుగు నెలలుగా ఢిల్లీలో ఆందోళన సాగిస్తున్న రైతాంగ నాయకత్వం షాహీన్ బాగ్ ఉద్యమాన్ని సరిగ్గానే తమ తల్లిగా పేర్కొన్నది.

26. "మత సామరస్యం" భారత ముస్లింల సామాజిక కార్యక్రమం. "శాంతి సామరస్య భారత సమాజ నిర్మాణం' వాళ్ళ రాజకీయ లక్ష్యం. 'షాహీన్ బాగ్' వాళ్ల పోరాటరూపం.

27. దేశంలో తాము ఒక్కరమే బాధితులుకాదని ముస్లిం సమాజానికి చాలా స్పష్టంగా తెలుసు. బాధితులందరి సమస్య ఒకటి కాదని కూడా వాళ్ళకు తెలుసు. వాళ్ళ లక్ష్యాలూ ఒకటికాదు అనే స్పష్టతా వారికుంది. విభిన్న బాధితుల సమస్యల్లో ఐక్యత మాత్రమేగాక ఘర్షణ కూడ వుందని వాళ్ళకు తెలుసు.

28. గమ్యాలు వేరయినా సాటి అణగారిన సమూహాలతో సాధ్యమయినంత మేరకు కలిసి గమనం సాగించాలని నేటి ముస్లిం సమాజం భావిస్తున్నది. తక్షణ ఉమ్మడి ప్రయోజనాల సాధన కోసం సాటి బాధితులతో ఒక విశాల సంయుక్త కార్యాచరణ కమిటీని ఏర్పరచే పనిలో ఇప్పుడు భారత ముస్లిం సమాజం నిమగ్నమైవుంది.

29. పార్లమెంటరీపంథా, సాయుధపోరాట పంథా కాకుండ ఒక వినూత్న మూడవ ప్రత్యామ్నాయ మార్గం భారత రాజకీయాల్లో రావలసివుంది. ఏ చారిత్రక దశలో అయినా సరే చారిత్రక భారం ఎక్కువగావున్న సమూహాలే పరిష్కారాల్ని కనుగొంటాయి. ఒక అల్పసంఖ్యాకవర్గంగా ఇప్పుడు ముస్లింల మీదే కొత్త మార్గాల్ని కనిపెట్టాల్సిన చారిత్రకభారం వుంది. ఆ కర్తవ్యాన్ని వాళ్ళు నెరవేరుస్తారని ఆశిద్దాం.

30. ముందుముందు అనేక అస్తిత్వ సమూహాలు తమ జీవికను కాపాడుకోవడం కోసం, తమ భవిష్యత్తు కోసం షాహీన్ బాగ్ చూపిన మార్గంలో నడుస్తాయి. పశ్చిమ బెంగాల్ అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు వెలువడ్డాక దేశంలో వీటి వుధృతి పెరుగుతుంది.

31. వర్గం సర్వాంత్ర్యామి. "ఇప్పటి వరకు మనకు తెలిసిన చరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్రే" అనే వాక్యంతో ఆరంభం అవుతుంది కమ్యూనిస్టు ప్రణాళిక. పునాది అంశాల్లోనేగాక ఉపరితల అంశాలైన కళాసాహిత్య సాంస్కృతికరంగాల్లోనూ వర్గం వుంటుందని 20వశతాబ్దం ఆరంభం నాటికే మాక్సిం గోర్కి వంటివారు స్పష్టంచేసేశారు. ."రచయితలారా! మీరు ఎటువైపు" అని నిలదీశారు.

32. భారతదేశపు కమ్యూనిస్టు సిద్ధాంతవేత్తలు అనేకమందికి కమ్యూనిస్టు ప్రణాళికలో తొలివాక్యమే సరిగ్గా వంటబట్టలేదు. మతరంగంలోనూ యజమాని మతసమూహాలు, శ్రామిక మతసమూహాలు వుంటాయని గుర్తించడానికి వాళ్లకు గుండెలు సరిపోలేదు. మత అంశాన్ని ముట్టుకోవడానికి సాహసం చేయలేకపోయారు. కమ్యూనిస్టులకు కులమతాలుండవంటూ గడుసుగా తప్పించుకునేందుకు తప్పుడు వాదనల్ని ముందుకు తెచ్చారు.

33. కమ్యూనిస్టులు కులమతాల్ని పాటించకపోవచ్చు. కానీ సమాజంలో కొనసాగుతున్న కులమతాల మీద వారు ఒక వర్గ విశ్లేషణ జరపాల్సింది. వారు ఆ పని చేయలేదు. మరోవైపు, దేశంలో సాంస్కృతిక జాతీయవాదం మత ప్రాతిపదిక మీద వేయితలల మహాసర్పంలా పెరిగిపోయింది. దీనివల్ల శ్రామిక మతసమూహాలైన ముస్లింలు, శిక్కులు, క్రైస్తవులు భారీగా నష్టపోయారు.

34. భారత కమ్యూనిస్టు శిబిరంలో మతరంగాన్ని వర్గ విశ్లేషణ చేసి (అప్పటికి) 60 యేళ్ళ చిక్కుముడిని బద్దలుగొట్టిన మార్క్సిస్టు మేధావి కే. వి. రమణారెడ్డి. 1985 నాటి విరసం గద్వాల పాఠశాలలో వారి ప్రసంగ వ్యాసం 'మతవర్గతత్వంసమీక్ష' ఒక మహత్తర ఆవిష్కరణ.

35. "ఏ మతవర్గ తత్వానికైనాసరే, మతమనే దానిలోనే మూలం వుందనుకోవడం అసమంజసం" అనే ప్రకటనతో మొదలవుతుంది ఆ వ్యాసం. "(సాంస్కృతిక జాతీయవాదంవల్ల) లాభపడేదల్లా హిందూవుల్లోని అస్తిపరవర్గాలే. ప్రచారానికీ ప్రభావానికి పనికి వచ్చింది మాత్రం (హిందూవుల్లోని) అల్పమధ్యతరగతి నజ్జు మాత్రమే" "సాంస్కృతిక జాతీయవాదం కమ్యూనిస్టులకు వ్యతిరేకం కనుక అది అమెరికా సామ్రాజ్యవాదానికి అనుకూలం" వంటి అమూల్యమైన ఆవిష్కరణలు ఈ వ్యాసంలో వున్నాయి.

36. నేను కేవిఆర్‌ను భావోద్వేగ అభిమానంతో '1000KVయార్' అనేవాడిని. ఆ తరువాతి కాలంలో కే. బాలగోపాల్, వరవరరావు ముస్లిం సామాజిక వర్గాల మీద సానుకూల వైఖరితో వ్యవవహరించారు. అందుకు విరసానికి మరొక్కమారు ధన్యవాదాలు.

(విరసం విజయవాడ పాఠశాలలో 2021 ఏప్రిల్ 11న ప్రసంగానికి Taking Points).



# నిర్బంధం ధైర్యాన్ని నేర్పింది

విరసం సాహిత్యపాఠశాలకు విప్లవాభినందనలతో...

చిన్నప్పుడు అశేష జనసముద్రం ముందర నిలబడి "అరచేతిని అడ్డుపెట్టి సూర్యకాంతి నాపలేరు, అరెస్టులను సాగించి ప్రజాశక్తినడ్డలేరు" అని పాడిన జ్ఞాపకం.

నిజంగానే ప్రజాశక్తిని ఎప్పుడు ఆపలేక పోయింది ఈ రాజ్యం, ఒకరిని అరెస్ట్ చేసి కుటుంబాన్ని భయపెట్టొచ్చనుకున్నది. కానీ అది కూడా జరగలేదు. బాపు (వరవరరావు) మొదటి సారి అరెస్ట్ అయినప్పుడు నాకు ఎనిమిదేండ్లు. అరెస్టంటే ఏందో తెలిసే వయసు కాదు, అప్పటినుండి ఇంకా ఇప్పుడు కూడా బాపు నిర్బంధంలోనే ఉన్నారు. పవన చిన్నప్పుడు అనేది మేము హన్మకొండల ఉంటం, మా బాపు జైలుకొండల ఉంటడు అని. సంవత్సరాలకు సంవత్సరాలు బాపు కేరాఫ్ అడ్రసు జైలు అయిపోయింది. మాతో గడిపిన కాలం కన్న ఎక్కువ జైళ్లలోనే గడిపిండు. మాకు అర్థంకాని వయసుల అరెస్టయినా.... దానివల్ల వచ్చిన ఇబ్బందులు ఎన్నో ఎదురుకొన్నం. మేం ముగ్గరం ఆడపిల్లలం, చిన్నపిల్లలం. అమ్మ ఎన్నో కష్టాలు పడ్డది.

వరంగల్‌లో 1973లో జరిగిన విరసం సాహిత్య పాఠశాలతోనే మా నిర్బంధ అధ్యాయం మొదలైంది. ఆ అక్టోబర్ 5, 6, 7 పాఠశాల అయిపోయిన వెంటనే 10న బాపును అరెస్ట్ చేసిన్రు. అప్పటినుంచి రెండు మూడు రోజులలోనే అరెస్ట్ అయిన చెరబండరాజు మామయ్య, ఖాన్ సాబ్‌లు, 1974లో సికింద్రాబాద్ కుట్ర కేసులో అరెస్ట్ అయిన కెవియార్, కొమురమ్మలాంటి వాళ్లే మా బంధువులయిన్రు.

రాంనగర్ కేసు దశ మాత్రం నిత్య నిర్బంధంగా కొనసాగింది. ఇంటి కొచ్చిన వాళ్లను, వీధిలో పలకరించిన వాళ్లను, మా వైపు చూసిన వాళ్లను కూడా పట్టుక పోయి పదిరోజులు లాకప్‌లో పెట్టి కొట్టిన సంఘటనలు యెన్నో. నెలకోసారి అర్ధరాత్రి బయల్దేరి గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో హైదరాబాద్ చేరుకొని ముషీరాబాద్ జైలులో బాపును కలిసి వచ్చేవాళ్ళం.

పవన అన్నట్టు మా బాల్యం హన్మకొండ జైలు కొండల మధ్య గడిచింది. సికిందరాబాద్ కేసు రోజుల్లో నిర్బంధం ఉన్నప్పటికీ విప్లవాభిమానుల ఆదరణతో గడిచింది. నడిరాత్రి గొడ్డళ్ళతోటి తలుపులు పలగగొట్టిన్రు. ఉన్నపళంగ ఇల్లు ఖాళీ చేయించిన్రు. హఠాత్తుగ ఇంట్ల జొరబడి ఇల్లంతా వెతికేటోళ్ళు. మా మీద నిత్యం నిఘా ఉండేది. ఇల్లంతా మనుషులతో వుండే మా ఇంటికి ఒక్క మనిషి కూడా రాకపోయేది కొన్ని రోజులు. చుట్టాలు చాల మంది మాకు వాళ్ళకు బంధుత్వమే లేదని కూడా చెప్పుకున్నరు.

ఇదంతా ఒక్కసారి అరెస్టయినప్పుడు కాదు, నిరంతరంగా జరుగుతూనే ఉండేవి. ఒకసారి నేను ఉద్యోగానికి పోతుంటే, బస్టాండుల నలుగురు పోలీసులు అడ్డం నిలబడి ఎక్కడికి పోతున్నని, నా ఎంబడి మా ఆఫీస్‌కు వచ్చిన్రు. దినదిన గండం... అమ్మ అయితే ఏనాడూ... ఇప్పటికీ కంటినిండా నిద్రపోయి ఎరుగదు. ఆర్థికంగా, హార్దికంగా అమ్మ ఎన్ని కష్టాలు పడ్డదో రెండో కంటికి తెలవకుండా, 'మగ' తోడు లేకుండా మమ్మల్ని పెంచింది.

కానీ ఏనాడు మాకు పిరికితనం నేర్పలేదు. వ్యతిరేకించమని చెప్పలేదు.

మా బాల్యం అంతా జైలు ముందు పడిగాపులల్లో, కోర్టు ఆవరణల్లో గడిచింది. పెద్దవాళ్ళం ఇద్దరికీ కొన్నేళ్ళు బాపుతో కలిసి గడిపిన రోజులున్నయి, కాని పవనకయితే పుట్టుకతోనే బాపు జైలు జీవితం మొదలైంది. చంటి పిల్లను అమ్మమ్మ దగ్గర్నో, లేకపోతే ఎవరి దగ్గర్నో వదిలి పెట్టి బాపుకు రైలులో ఇంటర్వ్యూ పెట్టడానికి పోయేటోళ్ళం. దాన్నయితే మా కుమార్ పల్లి వాడనే పెంచింది. బాపు జైలు నుంచి రిలీజ్ అయి వస్తే, 'బన్ని వాళ్ళ బాపు' అనేటోళ్ళు.

మాకు సెలవులిస్తే మేం పోయేది సభలకే. విరసం సభలు అంటే మాకు పండగలు. మేం మొట్టమొదటిసారి సముద్రం చూసింది వైజాగ్ విరసం సాహిత్య పాఠశాలప్పుడు. అప్పట్నుండి వైజాగ్ మా రెండో పుట్టిల్లయింది. దేశమంతా మేం తిరిగింది సభల కోసమే.... ఆ ప్రయాణాలన్నీ ఆషామాషీగా ఏమీ జరగలేదు నిత్య నిర్బంధమే.... పాలస్తీనా పిల్లలు, ఇరాన్, ఇరాక్ పిల్లలు యుద్ధభూమిలో ఆడుకున్నట్టు మేం జైలు, కోర్టుల ఆవరణల్లో ఆడుకున్నాం. అయితే మాకెప్పుడూ ఇవన్నీ ఏంది, మాకు ఎందుకు ఈ కష్టాలు అని అనిపించలేదు. అట్లా అనిపించకుండా అమ్మ, బాపు పెంచిన్రు మమ్మల్ని. ఇంకా చెప్పాల్నంటే ఎందరో అమరవీరుల సాహచర్యం మాకు నేర్పింది... నిత్య నిర్బంధంలో ధైర్యంగా, స్థైర్యంగా బతకడం నేర్పించిన అన్నలు, అక్కలే మా కుటుంబం. దానికి బాపు ఆచరణే మాకు, మనకు మార్గదర్శకం.

కుటుంబ సభ్యులకు నిర్బంధం ఎంత సాధారణం అయిపోయిందంటే మా పిల్లలు చిన్నపుడు ఆడే బొమ్మరిల్లు ఆటలలో మాకు ఇల్లు కడితే తాతయ్యకు జైలు కట్టేంతగా. బిడ్డలను పెళ్ళి చేసుకున్నందుకు, అల్లుళ్లను కూడా వదిలి పెట్టలేదు రాజ్యం. సత్యం, కూర్మనాథ్‌లను వివి రాజకీయ ఆచరణలో, వాడి భాష లో చెప్పాలంటే కుట్రలో, భాగస్వాములని ఆరోపిస్తూ కరోనా తీవ్రంగా వున్న రోజుల్లో ముంబయికి పిలిపించి విచారణ చేసి, నిఘా కొనసాగిస్తున్నారు.

ఏ పగలు, ఏ రాత్రి పోలీసులు ఇంటి మీదికొస్తరో తెలియదు. రాత్రిపూట గొడ్డలితో తలుపు మీద కొట్టి భయపెట్టిన దగ్గరి నించి, రెండున్నరేళ్ల క్రితం ఇరవై మంది పోలీసులు మా ఇళ్లల్లో చొరబడి, ఎనిమిది గంటలు సోదాలు చేసి ఫోన్లు, పిల్లల computer hard disc‌లు, పుస్తకాలు ఎత్తుకపోయిన సంఘటన దాకా కుటుంబం చవిచూసిన నిర్బంధం అమ్మకు, మాకు ఎప్పుడూ భయాన్ని కలిగించ లేదు. విప్లవ ఆచరణలో మేము భాగం అయ్యామనే తృప్తి నే కలిగించింది.

ఇక తాజాగా NIA అరెస్ట్... గురించి చెప్పడం చర్విత చరణం అయితదేమో...

రెండున్నర ఏండ్ల కింద, తెల్లవారక ముందే ఇంట్ల జొరబడి సాయంత్రందాకా, ఇల్లంతా చిందరవందర చేసి, బాపును పట్టుక పోయిన్రు. ఈ అనుభవం మాకొక్కళ్ళకే కాదు, దేశవ్యాప్తంగా పది మంది ఇళ్ళ మీద జరిగింది. ఇటీవల రెండు రాష్ట్రాలలో దాదాపు ముప్పై మందికి ఈ అనుభవం ఎదురైంది.

NIA దాడి భౌతికంగనే కాదు, మానసికంగా కూడా... తిట్టక, కొట్టక... నయానో భయానో బయటపెట్టిన సంఘటనలు కూడ ఉ

న్నయి. ఈ నిర్బంధం మేమొక్కళ్ళమే అనుభవించలేదు. మాకంటే కూడా, ఎంతోమంది అమరవీరుల కుటుంబాలు, ఇంకా ఎన్నోరకాలుగా నిర్బంధాన్ని ఎదుర్కొన్న వాళ్ళే. ఇంకా, ఇంకా ఎదుర్కోవలసే ఉంటది. బాపు మొదటి వాడు కాదు, చివరి వాడు కాదు. బాపు ఒక్కడే కాదు ఇంత నిర్బంధాన్ని ఎదుర్కొంటున్నది. మన చుట్టూ ఉన్న పీడిత, తాడిత ప్రజలు అనుభవించిన, అనుభవిస్తున్న నిర్బంధం ముందు మేం అనుభవించింది చాలా తక్కువ. మాకు మేము ఎప్పుడూ వేరేగా, మాకొక్కళ్ళకే ఈ కష్టాలు అనుకోలేదు. ఎప్పుడు కూడా మనకంటే ఎక్కువ బాధలు పడుతున్న వాళ్ళను చూడాలె అని చెప్తడు బాపు. అట్లా మాకు నిర్బంధపు కష్టాలు నిత్య జీవితంలో భాగమయినయి.

నిజానికి వివరంగా చెప్తే సమయం సరిపోదు, పాణి ఫోన్ చేసి, 'అక్క ఇట్లా ఈ టాపిక్ పెట్టినం. ఈసారి సభల్ల, సార్ అరెస్ట్ వల్ల మీరు పడ్డ బాధలు చెప్పండి' అనంగనే.. నలభై ఏండ్లుగా మా జీవిత నిత్యకృత్యమైన ఈ అనుభవాలు, రాయాలంటే సాధ్యమా అనిపించింది. మా ముగ్గురి కంటే ఎక్కువ అమ్మ అనుభవాలు.... చెప్పటం కూడా కష్టమే.

ఇవన్నీ మీ ముందు నిలబడి మాట్లాడి, మనం మనం కలబోసుకుంటే బాగుండని బాగా అనిపిస్తున్నది. కానీ రాలేక పోతున్నందుకు విరసానికి క్షమాపణలు.

చివరగా ఒక విషయం చెప్పి ముగిస్తా.

ఇంతవరకు జైలు కథ ఇది. ఇప్పుడు బెయిల్ ముచ్చట చెప్పాలె.

భీమాకోరేగావ్ కేసులో బాపుకు నెలకింద మెడికల్ బెయిల్ వచ్చింది. ఈ సారి అరెస్ట్‌తో బాపు ఆరోగ్యం ఎంత పాడయిందో మీకందరికీ తెల్సు. చావు అంచులు దాటి వచ్చిండు. బెయిల్‌కు రెండు సూరిటీలు రూ. 25,000, 25,000 పెట్టాలని చెప్పిన్రు. అస్తులే పెట్టాలట మహారాష్ట్ర ప్రభుత్వంల. ఫిబ్రవరి 22న బెయిల్ వస్తే ఏప్రిల్ ఫస్ట్ దాకా ఈ ప్రహసనం నడిచింది. చిన్న చిన్న కారణాలకు వాయిదా వేసేటోళ్ళు. ఆధార్ కార్డ్ అన్నిటికీ ఆధారం అని ప్రభుత్వం చెప్తుంటే.... ఒక పది రకాలైన కార్డు అడిగింది NIA special court. అన్నీ submit చేస్తే తెలుగులో ఉన్నయి అని ట్రాన్సలేట్ చేసియ్యమన్నరు. వాళ్ళేమో సెర్చ్ కు వచ్చి మనకు మరాఠీల ఉన్న పేపర్స్ ఇచ్చి పోయిన్రు. అసలు ఈ certificates ఇచ్చే అధికారం ఫలానా ఆఫీసర్‌కు ఉన్నదా.... ఉన్నదని ఒక లెటర్ తెమ్మన్నరు. నాకు రేషన్ కార్డ్ లేదు అంటే... no ration card అని ఒక certificate తెమ్మన్నరు. అఫిడవిట్ అని ఒకసారి, అఫర్మేషన్ అని ఒకసారి, తెచ్చిన పేపర్ల మీద స్టాంప్ లేదని, పేరు స్పష్టంగ పలకలేదనీ.... ఇట్లా రోజు రోజు తిప్పి తిప్పి ఇబ్బందులు పెట్టిన్రు.

ఎన్ని ఇబ్బందులు పెట్టినా, చివరికి బాపుకు బెయిల్ ఇచ్చిన్రు. బాపు కంటే వృద్ధుడూ, పార్కినసన్ వ్యాధితో బాధపడుతున్న స్టాన్ స్వామికి పదే పదే బెయిల్ రిజక్ట్ చేస్తున్నారు. బెయిల్ వచ్చి కూడా సూరిటీలకు ఈ రకంగా ఇబ్బంది పెడితే, బెయిల్ క్యాన్సల్ అయిన వాళ్ళు ఎంతోమంది. కంచన్ నన్నేవార్ అయితే జైల్ లోనే చనిపోయింది. ఇప్పుడు మహారాష్ట్ర జైల్లల్లో ఉన్నవాళ్ళ పరిస్థితి మరీ దారుణంగా ఉన్నదని ఆక్కడి లాయర్లు చెప్తున్నరు. అన్ని అవసరాలకు కలిపి మనిషికి ఏడున్నర లీటర్ల నీళ్ళు మాత్రమే ఇస్తున్నరట. ములాఖత్ లు బంద్ చేసిన్రు, ఉత్తరాలు ఇస్తులేరట. బాపుతోపాటు పదకొండు మందిని అరెస్ట్ చేస్తే ఇప్పుడా సంఖ్య పదిహేడుకు చేరింది. ఇంక పదహారు మందికి బెయిల్ రావల్సి ఉన్నది. ఇంకా అనేక కేసుల్ల ఉన్న అసంఖ్యాక ఆదివాసీలు, మైనారిటీలు, ముఖ్యంగ మహిళలకు...ఇన్ని ఇబ్బందుల మధ్య వీళ్ళందరి విడుదల కోసం మనం చేయాల్సిన పోరాటం ఎంతో ఉన్నది.

ఈ సభలు ఆ ఉత్తేజాన్నీ, స్ఫూర్తినీ కలిగించాలని, కలిగిస్తాయని, విరసం మీద నాకు, మాకు ప్రగాఢ నమ్మకం. విప్లవాభినందనలతో... నూతన ప్రజాస్వామ్యాన్ని నిర్మించే దిశలో విరసం ఎప్పుడూ ముందుంటుందని, అందులో భాగంగానే మేమున్నామని చెప్తూ.... ఈ అవకాశం ఇచ్చినందుకు సంతోషిస్తూ, రానందుకు బాధపడుతూ... లాల్‌సలామ్‌లతో

మీ సహజ, అనల, పవన

---

(24వ పేజీ తరువాత...)

సంబంధించిన రెండు స్రవంతులను దృష్టిలో వుంచుకుని గత సంస్కృతికి సంబంధించిన ప్రతి అంశాన్ని విమర్శనాత్మకంగా సమీక్ష చేయడం మన తొలి కర్తవ్యం. వర్గం, కులం, లైంగికత, జాతి, మత తదితర దృక్కోణాల నుండి ప్రతి అంశాన్ని తప్పనిసరిగా పున:పరిశీలించాలి.

విప్లవ సాంస్కృతికోద్యమం నిరసన సంస్కృతితో నిర్మాణాత్మకమైన మైత్రిని పటిష్టవంతం చేసుకోవాల్సిన అవసరం వున్నది. ఈ కర్తవ్యాన్ని నెరవేర్చడంలో విప్లవ సంస్కృతి అత్యుత్తమమైన సృజనాత్మకతను ప్రదర్శించాలి. 'అనేకమందిని కలుపుకోవడం, కొద్దిమందిని ఓడించడం' అనే శ్రామికవర్గ దృక్పథంపై విప్లవ సాంస్కృతికోద్యమం ఆధారపడాలి. సమాజంలోని అన్ని పార్శ్వాలలోనూ నిబిడీకృతంగా వున్న వివిధ రకాల అణచివేత స్వభావంకల కుల, పితృస్వామిక నిర్మాణాలపై మనం నిర్దాక్షిణ్యంగా పదునైన విమర్శాస్త్రాలను ఎక్కు పెట్టాలి.

ఇది స్మార్ట్‌ఫోన్లు, అంతర్జాలం, సోషల్‌మీడియా, పాడ్‌కాస్ట్‌లు, లఘు చిత్రాల యుగం. వాటి వాడకం ఏదో ఒక స్థాయిలో జరుగుతున్నది. అయితే ఇదంతా వ్యక్తిగతస్థాయిలో జరుగుతున్నది. మనం "కమ్యూనిస్టులమే" కాకుండా "నిపుణులం"కూడా కావాలి. రాజకీయాలను ఆధిపత్య స్థానంలో వుంచడం ద్వారా సాంకేతికతను కూడా మన అధీనంలోకి తెచ్చుకోగలం. మౌఖిక, దృశ్య రూపాలలో కళాత్మక వ్యక్తీకరణలు ప్రపంచవ్యాప్తంగా వుధృతం అవుతున్నాయి. ఆ మాధ్యమాల ద్వారా మన భావజాలాన్ని వందమందికి అందించగలిగినా అది అక్కడి నుండి వేలాది మందికి చేరుతుంది.

బ్రాహ్మణవాదం దాని స్వభావరీత్యానే ఇతరుల మధ్య విభేదాలను సృష్టిస్తూ అదే సమయంలో తనలో తాను అంతర్గతంగా విభేదాలకు గురయ్యే లక్షణం కలది. అది మట్టికాళ్ళ మహారాక్షసి. ప్రజా వ్యతిరేక, జాతి వ్యతిరేకమైన ఈ శక్తిలో అంతర్గత బలహీనతలు ఎన్నో వున్నాయి. దాన్ని తప్పనిసరిగా ఎదుర్కోగలం, ఓడించగలం. అది కోరుకుంటున్న ఏకత్వ అస్తిత్వాన్ని మనం సవాల్ చేయాలి. సమాజంలో నెలకొన్న వివిధరకాల అస్తిత్వాల నమ్మకాలు, చరిత్ర వంటి వాటిలోని కథనాలను వెలికితీయాలి. దేశభక్తిపట్ల దాని నక్కజిత్తులను ఎండగట్టాలి. దేశాన్ని అది ఎలా అమ్మకపు సరుకుగా మార్చిందో తెలియజేయాలి. స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం, సమానత్వం వెల్లివిరిసే సమాజ నిర్మాణానికి సంబంధించిన దృష్టిని ప్రజల్లో ప్రచారం చేయాలి. ఇవి విప్లవ సాంస్కృతిక కార్యకర్తల ముందున్న కర్తవ్యాలు.

(కామ్రేడ్ కె. మురళి, విజయవాడలో ఏప్రిల్ 11, 2021న జరిగిన విరసం రాష్ట్ర స్థాయి సాహిత్యపాఠశాలకు పంపిన సుదీర్ఘ ప్రసంగ వ్యాసానికి సంక్షిప్త అనువాదం. మొత్తం వ్యాసం త్వరలో అరుణతారలో చూడగలరు.)

# సాయిబాబా నుంచి స్టాన్ స్వామి దాకా

## విశ్వాసాలకు బెయిల్ లేదు-రచన చేస్తే శిక్ష

- 'న్యాయవాది'

విరసం సాహిత్య పాఠశాల విజయవంతంగా జరగాలని కోరుకుంటున్నాను. ఫాసిజాన్ని, ఫాసిస్టు సంస్కృతిని ప్రతిఘటించే పోరాటంలో ఆగామి కాలాల కోసం రూపొందించుకుంటున్న విప్లవ సాంస్కృతిక కార్యాచరణ నూతన ప్రజాస్వామిక నిర్దిష్ట కార్యాచరణలో భాగంగా నిర్వచించుకుంటారని ఆశిస్తున్నాను.

స్వయంగా విరసం నాయకత్వం, సభ్యులు, ప్రజాసంఘాల నాయకత్వం, సభ్యులు ఎదుర్కొంటున్న యుఎపిఎ కేసులు, కేంద్ర ఎన్ఐఎ దాడులు తోడుగా, సామ్రాజ్యవాద ప్రపంచీకరణలో భాగంగానూ రెండో మారు విజృంభిస్తున్న కొవిడ్ -19 సంక్షోభంలో విరసం సాహిత్య పాఠశాల సక్రమంగా జరగడం ప్రజలకొక భరోసా కాగలదని ఆశిస్తాను.

వివి అరెస్టు, బెయిల్‌పై షరతులతో కూడిన విడుదలను విరసం అయినా, రెండు తెలుగు రాష్ట్రాల్లోని ప్రజా సంఘాలు, ప్రజాస్వామ్యవాదులైనా భీమా కోరేగాం నిందితుల, దేశవ్యాప్తంగా విప్లవ, ప్రజాస్వామ్య శక్తులపై నిర్బంధంలో భాగంగానే చూస్తారనే అవగాహన నాకుంది. అందుకే ప్రత్యేకించి రెండు విషయాలు మీ దృష్టికి తేదలచుకున్నాను. ఈ అంశాలను మీరు తెలుగు సమాజం దృష్టికి తెచ్చి, ప్రచారం చేయాలని కోరుతున్నాను.

ప్రొఫెసర్ జి ఎన్ సాయిబాబాకు, ఆయన ఆరుగురు సహచరులకు గడ్చిరోలీ సెషన్స్ కోర్టు విధించిన యావజ్జీవ శిక్ష (2017) ఇపుడు నాగపూర్ హైకోర్టు విచారణకు స్వీకరించింది. విచారణ ఎప్పుడు మొదలయ్యేది ప్రాసిక్యూషన్, డిఫెన్స్, న్యాయస్థానం బెంచి అనుకూలతల మీద ఆధారపడి ఉంటుంది గాని అందువల్ల ఇప్పుడు ముద్దాయిలు అండర్ ట్రయల్స్ అయ్యారు. ఆ దశలో ప్రొ. జి ఎన్ సాయిబాబాను అతడు పనిచేసే ఢిల్లీ యూనివర్సిటీకి చెందిన కాలేజీ ఉద్యోగం నుంచి తొలగించడం చట్ట వ్యతిరేకం. ఈ కారణంగా ఆయన సహచరి వసంత, కూతురు మంజీర సస్పెన్షన్ అలవెన్స్ కూడా రాకుండా ఆర్థిక ఇబ్బందులకు లోనవుతారనే మానవతావాద దృష్టితోనే కాకుండా, చట్టవ్యతిరేక చర్యగా కూడా దీనిని వ్యతిరేకించాల్సి ఉన్నది. గతంలో పార్లమెంటుపై దాడి కేసులో ఉరిశిక్ష పడిన ప్రొఫెసర్ ఎస్ఎఆర్ గిలానీ అప్పీలు హైకోర్టులో ఉన్నప్పుడు జాకీర్ హుస్సేన్ కాలేజి (అది కూడ ఢిల్లీ యూనివర్సిటీ అనుబంధ కళాశాలయే) ఆయనను ఇట్లా ఉద్యోగం నుంచి తొలగించలేదు. ఈ చట్టవ్యతిరేక చర్యను సాయిబాబా సహచరి వసంత, డిల్లీ యూనివర్సిటీ టీచర్స్ అసోసియేషన్ కోర్టులో సవాలు చేస్తారు గానీ, వారికి తెలుగు సమాజం అండగా నిలిచే బాధ్యతను విరసం కర్తవ్యంగా నిర్వహిస్తుందని ఆశిస్తాను. సాయిబాబా, వివిల ద్వారా తెలుగు సమాజం, ప్రజలు



మహారాష్ట్ర ప్రభుత్వ టెర్రరిస్టు చర్యలను, జైళ్ల దుర్భర పరిస్థితులను, సాయిబాబాకు కరోనా సోకినా, తల్లి చనిపోయినా తాత్కాలిక విడుదల కూడ చేయని స్థితిలో అర్థం చేసుకొని ఉంటారు.

వివి కన్నా వృద్ధుడు, అప్పటికే పార్కిన్సన్ వ్యాధితో బాధపడుతున్న ఫాదర్ స్టాన్ స్వామి (83) అనారోగ్య కారణాలతో మళ్లీ వేసిన బెయిల్ పిటిషన్‌ను ఎన్ఐఎ సెషన్స్ కోర్టు "అతని నేరాల (ఆరోపణల) బరువు ముందు, అతనికి ఉన్న జబ్బులు చాల తేలికయినవి" అంటూ నిరాకరించింది. ఆయనకు పార్కిన్సన్ జబ్బు వల్ల చేతులు వణుకుతాయని, సిప్పర్‌తో తప్ప నీళ్లు గాని, టీ గాని తాగలేడని ఆయన అరెస్టు కాగానే వేసిన పిటిషన్ బయటి సమాజంలో కూడ సంచలనం కలిగించింది. ఇప్పుడు పార్కిన్సన్‌కు తోడు, శ్వాస ఆడక ఊపిరితిత్తులకు సంబంధించిన సమస్య, ఉదరకోశ సంబంధమైన సమస్యలు ఎదుర్కొంటున్నాడు. ఒకసారి ఊపిరాడని స్థితిలో జైలు ఆస్పత్రి నుంచి ఆక్సిజన్ సిలిండర్ తెప్పించి ఆక్సిజన్ ఎక్కించాల్సి వచ్చింది. ఆయనకు రాంచీలో ఆయన నెలకొల్పిన 'బగీచా', అక్కడి ఆదివాసులు, దళితులు, ప్రపంచవ్యాప్త అభిమానులు తప్ప కుటుంబం లేదు. పీడిత ప్రజలు, ప్రజాస్వామ్యవాదులే ఆయన కుటుంబం. కనుక స్టాన్ స్వామి విషయంలో ఎవరికి వారే, వ్యక్తులు గాని, సంఘాలు గాని తమ బాధ్యతగా తీసుకొని కాపాడుకోవాల్సిన, విడుదల డిమాండు చేయాల్సిన అవసరం ఎక్కువ.

ఈ ప్రత్యేక అనారోగ్య స్థితికి తోడు ఇపుడు పన్నెండు మంది భీమా కోరేగాం ముద్దాయిలున్న తలోజా జైల్లో నీటి ఎద్దడి కారణం చెప్పి రోజుకు మనిషికి ఏడున్నర లీటర్ల నీళ్లు మాత్రమే ఇస్తున్నారు. అవే కాలకృత్యాలకు, స్నానానికి, తాగడానికి కూడ వాడుకోవాలి. అయితే ఇందుకు ప్రధాన కారణం నీటి ఎద్దడి కాదు, కక్ష సాధింపు చర్య. వివి, స్టాన్ స్వామి, ఆనంద్ తేల్తుంబ్డే, గౌతం నవ్లాఖాలు బెయిల్

కోసం ఎన్ఐఎ కోర్టు మొదలు బొంబాయి హైకోర్టు, సుప్రీం కోర్టు దాకా వేస్తున్న పిటిషన్లలో తలోజా జైలు దుర్భర పరిస్థితుల ప్రస్తావన డిఫెన్స్ వాదనలలో వస్తున్న దృష్ట్యా ప్రభుత్వం (జైళ్ల శాఖ)- జైలు సూపరింటెండెంట్ పునలేకర్‌ను అంత ప్రాముఖ్యం లేని శాఖకు బదిలీ చేసింది. ఆయన అడ్మినిస్ట్రేషన్ ట్రిబ్యునల్‌కు వెళ్లి స్టే తెచ్చుకున్నాడు గాని తనను బదనాం చేసారనే కక్షతో రాజకీయ ఖైదీలను ఈ విధంగా వేధిస్తున్నాడు.

కొవిడ్ -19 మొదటి దఫాకు రెండవ దఫాకు మధ్యన 2021 మార్చ్ నెలలో సురేంద్ర గాడ్లింగ్ సహచరి మినాల్ ములాఖత్ కోసం వస్తే నిరాకరించాడు. మళ్లీ కొవిడ్ -19 వల్ల ములాఖత్‌లు రద్దయ్యాయని చెప్పారు.

ముంబై బైకుల్లా జైల్లో ప్రొఫెసర్ షోమాసేన్‌ను అదే రోజుల్లో కలవడానికి వచ్చిన ఆమె కూతురు కోయల్ సేన్ ఆరు గంటల పాటు జైలు బయట ములాఖత్ ప్రయత్నం, నిరీక్షణ, నిరాశ తనకు కూడ శిక్ష అయిందని రాసిన ఉదంతం సామాజిక మాధ్యమాల్లో ప్రచారమైన విషయం మీ దృష్టికి కూడ వచ్చి ఉంటుంది. ఆర్థరైటిస్ వంటి జబ్బులతో బాధ పడుతున్న అరవై రెండేళ్ల షోమాసేన్ ఇటీవల న్యాయవాదికి రాసిన ఉత్తరంలో ఎరవాడ జైల్లో మరణించిన కంచన్ నానావరే గురించి రాసింది. ఎరవాడ జైలు నిర్బంధంలో ఉండి, పూనే కోర్టులో ఐదేళ్లుగా కేసు విచారణలో ఉన్న కంచన్ నానావరే పూనే ససూన్ ఆస్పత్రిలో మరణించిన విషయాన్ని అదే జైలు పురుష విభాగంలో ఉన్న ఆమె సహచరుడు అరుణ్ బెల్కెకు సకాలంలో తెలపలేదని, కనీసం ఆమె శవాన్నయినా చూడకుండా దహనం చేసారని షోమా సేన్ రాసింది. కంచన్ కేసు పూనే స్పెషల్ కోర్టులో విచారణ జరుగుతున్నది. గుండెకు చిల్లు బడిన తీవ్ర అనారోగ్య పరిస్థితి గురించి బొంబాయి హైకోర్టులో పిటిషన్ వేస్తే కోర్టు విచారణ కోసం ఒక కమిటీ వేసింది. ఈ న్యాయ కమిటీల విచారణ తతంగమంతా మొదలు కాకముందే పుణ్యకాలం గడిచిపోయి ఆమె మరణమే ఆమె విషయంలో రాజ్యం తీర్పు అయిందని షోమా సేన్ చాల ఆర్ద్రంగా, ఆగ్రహంగా రాసింది. మరొకవైపు జైళ్ల అడిషనల్ డిఐజి జైలు సంస్కరణల గురించి తాను రాసిన పుస్తకాన్ని సవరణలు, సూచనల కోసం బైకుల్లా జైల్లో ఉన్న ప్రొఫెసర్ షోమా సేన్, సుధా భరద్వాజ్‌లకు ఇస్తే వాళ్లు ఆ సవరణలు, సూచనలు చేసారు కూడ.

అన్నిటికీ మించిన వేధింపు రాజకీయ వేధింపు. ఇపుడు కొవిడ్ -19 రెండవ దశ దృష్ట్యా మళ్లీ తలోజా జైల్లో ములాఖత్ లే కాదు, పత్రికలూ లేవు. కొనుక్కోవడానికి కూడ లేవు. ఈ స్థితి ఏడాదికి పైగా కొనసాగుతున్నది. పది రోజులకొకసారి కుటుంబంతో ఐదు నిమిషాల ఫోన్ ములాఖాత్ ఉంటుంది. సంబంధిత వకీలుతో కూడ తలోజా జైలు అయితే ఐదు నిమిషాలే అవకాశం. ఎందుకంటే ఆ న్యాయవాది ముగ్గురు ముద్దాయిలతో విడివిడిగా ఐదు నిమిషాలు మాట్లాడితే 15 నిమిషాలు ఇచ్చినట్టు లెక్క.

ఈ రాజకీయ వేధింపుకు పరాకాష్ట ఇపుడు ఈ ఖైదీల ఉత్తరాలు ఆపేసారు. వాళ్లు రాసినవి కుటుంబ సభ్యులకు పంపడం లేదు. వాళ్లకు వచ్చినవి ఇవ్వడం లేదు. ఇది భీమా కోరేగాం కేసులో ముద్దాయిలకు జైలు విధించిన శిక్ష అని కూడ చెప్తున్నారు. ఎందుకంటే మార్చ్ నెల కారవాన్ ఇంగ్లిష్ మాస పత్రికలో ఆనంద్ తేల్తుంబ్డే కేంద్ర ప్రభుత్వం కొత్తగా ప్రకటించిన ప్రైవేటీకరణ పథకం తప్పుడు వాదనల మీద ఆధారపడిందని, రాజ్యాంగ ఆదర్శాలకు భిన్నమైనదని విశ్లేషించాడు. "మన ఆర్థిక వ్యవస్థ లక్ష్యాలను రాజ్యాంగ ప్రవేశికలో, వివిధ అధికరణాలలో, అన్నిటికన్న ముఖ్యంగా ఆదేశిక సూత్రాలలో వ్యక్తీకరణ పొందిన మన రాజ్యాంగ ఆదర్శాల నుంచి వేరు చేసి చూడలేం" అని ఆయన రాసాడు. "జాతి జీవనపు అన్ని సంస్థలలోనూ సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయం అమలయ్యే సామాజిక వ్యవస్థను వీలైనంత సఫలమైన పద్ధతిలో సాధించడం, పరిరక్షించడం ద్వారా ప్రజల సంక్షేమాన్ని అభివృద్ధి చేయడానికి ప్రయత్నించడం" ప్రభుత్వ లక్ష్యం అని ఆదేశిక సూత్రాలు ప్రకటించాయి. "ప్రవేశికలో బాబాసాహెబ్ అంబేడ్కర్ చెప్పినట్లుగా ఆ సామాజిక వ్యవస్థ స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, న్యాయం అనే ప్రాతిపదికల మీద ఆధారపడి ఉంది" అని ఆ వ్యాసంలో ఆనంద్ తేల్తుంబ్డే రాసాడు. నిజానికి ఆనంద్ తేల్తుంబ్డే ఈ రచన జైలు నుంచి తన సహచరి రమ (డా. బి ఆర్ అంబేడ్కర్ మనుమరాలు) కు రాసిన ఉత్తరంలోనే పంపాడు. అది 'కారవాన్' పత్రికలో అచ్చవడం నేరమైంది.

భీమా కోరేగాం ముద్దాయిల జైలు రచనలు 2019 ఆగస్ట్ 28 (రెండవ బ్యాచ్ ముద్దాయిలు అరెస్టయి ఏడాది పూర్తయిన సందర్భంలో) పుస్తకంగానే అచ్చయ్యాయి. అవన్నీ జైలు నుంచి ఉత్తరాలుగా రాసినవే. ఆ పుస్తకం అచ్చువేసిన ముంబైలోని ప్రజాసంఘాల వేదిక ఆ పుస్తక విడుదల సభ కూడ ఏర్పాటు చేసింది. ఆ రచనల నుంచి కొన్ని భాగాలు హిందూ, ఇండియన్ ఎక్స్ ప్రెస్ వంటి పత్రికలు ప్రచురించాయి కూడ. లోగా కోబడ్ గాంధీ, తిహార్ జైలు (ఢిల్లీ) మొదలు జార్ఖండ్ జైలు నుంచి రాసిన రచనలు కూడ మెయిన్ స్ట్రీం వంటి పత్రికల్లో వచ్చాయి. మరి కొత్తగా ఇట్లా జైలు నుంచి రాసిన రచనలు అచ్చు కావడం నేరం ఎప్పటినుంచి అయింది? బహుశా ఇది తలోజా జైలు సూపరింటెండెంట్ పునలేకర్ రాజును మించిన రాజభక్తి కావచ్చు. లేదా ఈ కేసును ఎన్ఐఎ (కేంద్రం) చేపట్టినందువల్ల కూడ కావచ్చు.

అందుకే అనుకుంటాను ప్రొఫెసర్ ఆనంద్ తేల్తుంబ్డే న్యాయవాది ఆయనను నిర్బంధించడం రాజ్యాంగాన్ని నిర్బంధించడమే అని రాసింది.

కంచన్ మరణం గురించి రాస్తూ న్యాయవాది సురేంద్ర గాడ్లింగ్ 'మేము నిన్ను కాపాడుకోలేకపోయాం" అని ఆవేదన చెందాడు. మరి ఇందుకేమి శిక్ష వేస్తారు?

గౌతం నవ్లాఖా బెయిల్ పిటిషన్ పై తీర్పు సుప్రీం కోర్టు రిజర్వ్‌లో ఉంచింది గనుక ఇపుడేమీ రాయలేను.

ఈ విషయాలు ప్రజల దృష్టికి తెస్తారని ఆశతో

7 ఏప్రిల్ 2021



# కులం - కుటుంబం - తెగ

*రమేష్ పట్నాయక్*

కుటుంబం ఒక సామాజిక సంస్థ (సోషల్ ఇన్‌స్టిట్యూషన్). అలాగే తెగ, కులం కూడా సామాజిక సంస్థలే. కులానికి మతానికి ఉన్న సంబంధం గురించి చాలా చర్చ జరిగింది. కాని కులానికి కుటుంబానికి మధ్య ఉన్న సంబంధంపై తగిన స్థాయిలో చర్చ జరగినట్లు లేదు. ఇక తెగ అనేది కులం కంటే కుటుంబం కంటే ముందటి కాలానిది. నిజానికి రెండింటి పునాదులు అందులోనే ఉన్నాయి. ఆకారణంగా తెగతోనే చర్చ ప్రారంభించవలసి ఉంటుంది. ఇంకా, ఈ వ్యాసంలో కుటుంబంలోపల ఆస్థి సంబంధాలను, ఉత్పత్తి సంబంధాలను విశ్లేషించడం మరియు అవి కులాన్ని కొనసాగించడానికి ఏవిధంగా పనిచేస్తున్నాయో పరిశీలించడం జరిగింది. అలాగే కుల నిర్మూలనకు ప్రాతిపదికలు పరిశీలించడం జరిగింది. కుల సమస్యపై ఒక ఒకానొక ఆలోచనా రీతిని చర్చకు పెట్టడానికి ఇది ఒక ప్రయత్నం. కులం ఈ నాడు, ఆధపత్య కులాలకు ఒక సామాజిక పెట్టుబడిగా ఉందో, దాని పాదార్థిక పునాది కంటే అధికంగా, రాజకీయ రంగంలో రోజువారీ సామాజిక సంబంధాలలో ఎంత విస్తరిస్తుందో, బలప్రదర్శన చేస్తుందో పాఠకులకు తెలుసు. వీటిపై చాలా విశ్లేషణలు కూడా వచ్చాయి. ఈ వ్యాసంలో ఆ విషయాలను చర్చించలేదు. ఈ వ్యాసం ప్రధానంగా పాదార్థిక విషయాలకే పరిమితమైనదనే విషయం పాఠకుడు గమనంలో ఉంచుకోవాలి.

## చరిత్రలో కులం:

కులం: కులాలు వృత్తులను బట్టి ఏర్పడ్డాయి అనే భావన జన సామాన్యంలో ఉంది. అయితే ఎన్ని వృత్తులు ఉన్నాయో అన్ని కులాలు మాత్రమే లేవు. కులానికి వృత్తికి 'ఒకదానికి - ఒకటి' అనే సహసంబంధం లేదు. ఒక వృత్తికి ఒక కులమే అయితే వేల సంఖ్యలో కులాలు ఉండవు కదా? నిజానికి వృత్తుల సంఖ్య చాలా పరిమితం. వ్యవసాయం చేయడం, పశువులను పెంచడం, చేపలు పట్టడం వంటి వృత్తులలో ఎక్కువ మంది ఉండడం చూస్తాం. ఈ వృత్తులు, గతంలో వేటతో కలిపి ఆహార సేకరణ మరియు ఆహారోత్పత్తికి సంబంధించనవి కావున ఈ వృత్తులలో ఎక్కువ మంది సమాజానికి అవసరం అయ్యారు. అలాగే పత్తితో బట్టలు నేసే వృత్తులలో ఇప్పటికీ ఎక్కువ మంది ఉన్నారు, కుండలు తయారు చేసే వృత్తిలో ఒకప్పుడు ఎక్కువ మంది ఉండేవారు. వారు ప్రధానంగా ఇటుకబట్టీలకు మళ్ళిపోయారు. అయితే ఇటుక బట్టీలలో వివిధ కులాలు వారు కూడా పనిచేస్తున్నారు. మట్టి పని (కుండలు, ఇటుకులు తయారు చేయడం), రాయి పని (వాడకానికి తిరగళ్ళు వంటివి, నిర్మాణానికి స్థంబాలు, కుందులు వంటివి, మరియు శిల్పాలు), చెక్క, వెదురు పని (బుట్టలు అల్లడం, వ్యవసాయ పనిముట్లు, బళ్ళు, రధాలు, ఇతర చెక్క వస్తువులు తయారు చేయడం), ఇనుప పని (ఇనుప వస్తువులు, పనిముట్లు తయారు చేయడం, నిర్మాణ రంగంలో కూడా), బంగారం, వెండి, వజ్రాలు, తోలు, కొమ్ము, పీచు, ప్రత్తి ఉత్పత్తుల రంగాలలో వివిధ కులాలు పని చేస్తున్నాయి. బట్టలు ఉతకడం, క్షవరం చేయడం వంటి సేవా రంగ వృత్తులు కూడా ఉన్నాయి. పౌరోహిత్యం, యుద్ధం వంటి అనుత్పాదక వృత్తులు కూడా ఉన్నాయి. కళారంగాలకు సంబంధించిన వృత్తులు, విద్య, వైద్య రంగాలు కూడా ఉన్నాయి. ఇంకా వివరంగా చూడవచ్చు. అయితే ఎంత వివరంగా వ్రాసుకున్నా సాంప్రదాయంగా వచ్చిన వృత్తుల కంటే కులాలు అనేక రెట్లు ఎక్కువగా ఉంటాయి. వృత్తికి కులానికి మధ్య ఒక ప్రధానమైన సంబంధం ఉన్నా కులాలు ఏర్పడడంలో ఇంకా మరికొన్ని ప్రధానమైన అంశాలు లేకపోతే కులాల సంఖ్య అంత ఎక్కువగా ఉండగలిగేది కాదు. అసంఖ్యాకంగా ఉండిన గత కాలపు తెగలు కులాలుగా వ్యవస్థీకరించబడినందుననే కులాల సంఖ్య వృత్తుల సంఖ్య కంటే ఎక్కువగా ఉందన్న విషయం మనం ముందు పేరాలలో చూస్తాం.

ప్రతి కులానికి అంతర్ వివాహాలు ప్రధానమైన లక్షణం. స్త్రీకాని పురుషుడు కాని కులం బయట పెళ్ళి చేసుకోవడానికి లేదు. ఒక కులం వారింట్లో మరొక కులం వారు తినడానికి లేదు. కొన్ని కులాల మధ్య సహపక్తి భోజనం అనుమతించినా వివాహాన్ని అనుమతించడం ఉండదు. ప్రతి కులం అంతర్ వివాహాలతో నిబద్ధించబడి ఉంటుంది. ఇప్పుడు తెగల విషయం చూద్దాం. భారత దేశంలోనే కాక ప్రపంచ వ్యాప్తంగా అత్యధిక తెగలు (ట్రైబ్స్) అంతర్ వివాహ పద్ధతినే అనుసరించాయి. ఈ విషయం మనకు ఏంగెల్స్ రచన 'కుటుంబం, రాజ్యం, వ్యక్తిగత ఆస్థి పుట్టుక' లో స్పష్టంగా తెలుస్తుంది. ఇప్పటికీ కొనసాగుతున్న తెగలు అంతర్వివాహ పద్ధతిని అనుసరిస్తున్నాయి. ఒక తెగలో వారు మరొక తెగలోని వారిని పెళ్ళి చేసుకోవడానికి లేదు. కులానికి, తెగకు మధ్య ఉన్న ఈ సామ్యం లేదా పోలిక చాలా ప్రధానమైనది. కులానిక, తెగకు ఉండే మరి రెండు సామ్యాలను కూడా మనం గమనించాలి. ప్రతి తెగకు, ప్రత్యేక నాయకత్వం, పండుగలు మరియు సాంప్రదాయాలు ఉండేవి. ఇప్పటికీ కొనసాగుతున్న తెగలలో ఈ లక్షణం కనిపిస్తుంది. కులానికి కూడా కుల పెద్దలు, కుల పండుగలు, కుల సాంప్రదాయాలు ఉంటాయి. ప్రధానంగా 'శూద్ర' కులాలని చెప్పబడేవాటిలో ఈ దృగ్విషయం మనం గమనిస్తాం. ప్రతి కులం కూడా ఒకప్పుడు ఒక తెగ అనుకోవడానికి ఈ ఆధారాలు బలం చేకూరుస్తున్నాయి. తెగలు కొలిచే అమ్మ దేవతలందరూ పార్వతి అవతారాలుగా కుదించబడ్డారు, తెగలకు సంబంధించిన ఏనుగు, కోతి, ఎద్దు, పాము, సింహం, ఎలుక, నెమలి, గద్ద గాడిద, మర్రిచెట్టు, రావి చెట్టు, తులసి వంటి ఎన్నో టోటెం గుర్తులు తెగల ఆర్యీకరణలో భాగంగా ఆర్యుల[1] యొక్క మనుష రూప దేవతల వాహనాలుగానూ లేదా అలంకారాలుగానూ, కొన్ని సందర్భాలలలో బందువులుగానూ రూపాంతరం చెందాయి. ఫలితంగా ఈ టోటెం గుర్తులు ఆర్య, అనార్య మూలాలున్న అందరి దేవుళ్ళుగా మారిపోయాయి. ఆర్యుల రాకపూర్వం 'భారత దేశం'లో ఉండిన తెగలు ఎన్ని, వాటివాటి టోటెం గుర్తులలో ఎన్ని నశించిపోయాయి, ఎన్ని

రూపాంతరం చెందాయి, ఎన్ని విలీనం చెందాయి, ఇంకా ఎన్ని కొనసాగుతున్నాయి అనే ప్రశ్నలు లోతైన పరిశోధనకు చెందిన విషయాలు. అయితే డి.డి.కోశాంబి రచన (భారత చరిత్ర పరిచయ వ్యాసాలు, హె.ఆర్.కె అనువాదం, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ) లో మనకు తెగలు ఏవిధంగా కులాలుగా రూపాంతరం చెందాయో కొంత వివరణ కనిపిస్తుంది. "కుల నామాలు, లైంగిక సంబంధాలలో బాహ్య నిషేధం, అంతర్నిషేధం తాలూకు కట్టుబాట్లు.... సహపంక్తి భోజనం, కుల సభలు - సమస్తం గణ వ్యవస్థ నుంచి వచ్చినవే,.. (పేజి 1). పైన ఇచ్చిన కోశాంబి ఉటంకింపు స్పష్టంగానే ఉంది. తెగలు కులాలుగా మారాయని దీని వలన మనకు తెలుస్తుంది. బాహ్య నిషేధం, అంతర్‌నిషేధం అన్న విషయాలను కొత్త పాఠకుడి కొరకు కొద్దిగా వివరించుకుందాం. ఒక కులాన్ని ఉదాహరణగా తీసుకుందాం. ఆ కులంలో వారు ఆ కులం బయట వివాహం చేసుకోకూడదు. ఇది బాహ్య నిషేధం. ఇక ఒక కులంలో అనేక ఇంటి పేర్లు ఉన్నవారు ఉంటారు. కొన్ని ఇంటి పేర్లు గ్రూపు 'ఎ' గానూ మరికొన్ని ఇంటిపేర్లు గ్రూప్ 'బి' గానూ ఉంటాయి. ఫలానా గ్రూపులో ఉన్న వారు అదే గ్రూపులో వారిని పెళ్ళి చేసుకోకూడదు. ఇది అంతర్నిషేధం. అంటే తమ కులంలోనే పెళ్ళి చేసుకోవాలి కాని తమ గ్రూపు కుటుంబాలలో వారిని పెళ్ళి చేసుకోకూడదు. ఆ విధంగా బాహ్య అంతర్ నిషేధాలు అమలు జరుగుతాయి. ఏంగెల్స్ రచన 'కుటుంబం, సొంత ఆస్థి, రాజ్యాంగ యంత్రాల పుట్టుక' లో తెలుగు రాష్ట్రాలలో ఉన్న ఈ దృగ్విషయానికి సమాంతరాలు చాలా కనిపిస్తాయి. ఈ వివరాలను ప్రక్కన పెడితే తెగలలో ఏ అంతర్, బాహ్య నిషేధాలు ఉండినాయో అవే నిషేధాలు కులాలలో కూడా ఉన్నాయన్నదీ అలాగే తెగలు కులాలుగా పునర్వ్యవస్థీకరించబడ్డాయని కోశాంబి చెప్పిందీ మనకు ఇక్కడ ప్రధానం[2].

పాదసూచి 1: చర్చలో భాగంగా మనం ఆర్యన్ అన్న పదాన్ని ఉపయోగిస్తున్నాం. చరిత్రకారులు ఆర్యన్ అన్న పదం వాడడం మానివేశారు. అందుకు బదులు ఇండో - ఇరానియన్ అనే పద బంధం వాడుతున్నారు. ప్రస్తుత చారిత్రక పరిశోధనల ప్రకారం సెంట్రల్ ఆసియా నుంచి ఒకవైపు యూరప్‌కు రెండవవైపు పశ్చిమ ఆసియాకు విస్తరించిన జన సమూహాలు తమను తాము ఏమని పిలుచుకున్నారో తెలియదు. ఆధునిక చరిత్రకారులు వారిని ప్రోటో - ఇండో - యూరోపియన్స్ అని పిలుస్తున్నారు. వారి నుంచి విడివడి ఇరాన్, ఇండియా వైపు విస్తరించినవారిని చరిత్రకారులు 'ఇండో - ఇరానియన్' ప్రజలు అని పిలుస్తున్నారు. అయితే వారినుండి ఇరాన్ వైపు విస్తరించిన వారు తమను తాము అయిర్యన్ అని ఇండియా వైపు వచ్చిన వారు తమను తాము అర్యన్ అని పిలుచుకునేవారు. ఆర్యన్ అన్న పేరు యూరప్‌కు వర్తిస్తుందనడానికి ఎటువంటి దాఖలాలు లేవు. అయితే జర్మన్ నాజీలు తాము నిఖార్సయిన ఆర్యులమని, ఇతరులను పరిపాలించడానికి దేవుడు తమను ఉన్నతమైన జాతిగా సృష్టించాడని ప్రచారం చేసుకున్న విషయం తెలిసిందే. నాజీలు ఆర్యన్ పదాన్ని ఒక జాతి (రేస్) గా ప్రచారం చేసి తమ దేశంలో ఫ్యాసిజానికి పునాది వేశారు. ఆర్యన్ అన్నది జీవ జన్యువులపై ఆధారపడిన ఒక జాతి (రేస్) కాదని అది మత భావాలు, ఆచారాలు, భాష వంటి సాంస్కృతిక లక్షణాలతో కూడుకుని ఉన్న జన సమూహం అని గుర్తించడం ప్రధానం. అయితే కొద్దిమంది చరిత్రకారులు ఆర్యన్ అన్న పదం వాడుతూనే ఉన్నారు. అవగాహన స్పష్టంగా ఉంటే మనం ఆర్యన్ అన్న పదం వాడినా పొరపాటు లేదు.)

పాదసూచి 2: పైన చర్చలో కోశంబి గణాలు కులాలుగా మారడం గురించి వివరించాడు. మనం కోశాంబిని ఉటంకిస్తూ తెగలు కులాలుగా మారాయని చెప్పాం. ఇలా గణాన్ని, తెగలను సమానార్థకాలుగా వాడడం సరియైనదేనా అంటే మన చర్చ మేరకు అది సరియైనదే. ఏంగెల్స్ తన 'కుటుంబం, ప్రైవేటు ఆస్థి, రాజ్యాంగ యంత్రాల పుట్టుక' లో ఇరాకీ తెగల గురించి వ్రాస్తూ, ఇరాకీ తెగలో రెండు ఫ్రేట్రీలు (సోదర సంఘాలు) ఉంటాయని, ప్రతి ఫ్రేట్రీలో 4 గణాలు ఉంటాయని, ఒక ఫ్రేట్రీలో పురుషుడు మరొక ఫ్రేట్రీలో స్త్రీని మాత్రమే వివాహం చేసుకోవాలని, తన తెగ బయట వివాహం చేసుకోకూడదని అదే విధంగా తన ఫ్రేట్రీ లో ఉన్న ఏ గణంలో కూడా వివాహం చేసుకోకూడదని వివరించాడు. ఇది ఇంతకు ముందే వివరించినట్లు మన కుల వ్యవస్థకు సమాంతరంగానే ఉంది. కోశాంబి గణాలు అని వాడినా గణాలు తెగలో భాగం కావున మనం గణాలు కులాలుగా మారాయని వ్రాయడం కంటే తెగలు కులాలుగా మారాయని వ్రాయడమే మెరుగ్గా ఉంటుంది. ఒక్క గణం ఒక కులం కాజాలదు. ఎందుకంటే గణంలో అంతర్‌వివాహం నిషిద్ధం. అసలు కోశాంబి తెగ అని వ్రాయకుండా గణం అని ఎందుకు వ్రాసాడు అన్నది ఇంకా వివరమైన చర్చ. ఆ చర్చతో ఈ రచయితకు పరిచయం లేదు. అంతేకాక ప్రస్తుత విషయానికి అది అంత ప్రధానం కూడా కాదు. ఈ చర్చమేరకు తెగలు, గణాలు అన్న పదాలను మనం సమానార్థకాలుగానే వాడవచ్చు.

ప్రతి కులం ఒక వృత్తి చేయడం మనకు తెలుసు. కాగా ప్రతి కులం అంతకు ముందు ఒక తెగ నుంచి ఏర్పడిందని ముందుపేరాలో తెలుసుకున్నాం. ఇక అన్ని కులాలు తెగల రూపాంతీరణ ద్వారా మాత్రమే ఏర్పడ్డాయా, ఇంకా ప్రతి తెగ కూడా కులంగానే రూపాంతరం చెందిందా అని అంటే అలా కాకపోవచ్చు. కాని అనేక తెగలు కులాలుగా రూపాంతరం చెందడం మాత్రం మనకు చరిత్రలో కనిపిస్తుంది. డి.డి కోశాంబి రచన 'భారత చరిత్ర పరిచయ వ్యాసాల' నుండి మరొక ఉటంకింపు చూడండి: "గణం నుంచి శ్రేణుల నుంచి మాత్రమే కాకుండా వృత్తిని బట్టి కులం రూపొందిన ఉదాహరణలున్నాయి. కాయస్థులు రాజుల వద్ద రాయసగాళ్ళుగా ఉండేవారు. వాళ్ళు మొదట విభిన్న కులాల నుంచి వచ్చిన వారు. క్రమేణా ఒక కులంగా రూపొందారు. ఈ కులాల చట్రం బిగుసుకుపోవడానికి నూతన ఉత్పత్తి ప్రాతిపదిక కారణం.... (పేజీ 11) " ఈ ఉటంకింపులో వృత్తిని బట్టి కులం ఏర్పడడం ఒక నియమంగా కాక ఒక మినహాయింపుగా చెప్పబడిన విషయం పాఠకుడు గుర్తించి ఉంటాడు. అంటే తెగలు కులాలుగా పునర్వ్యవస్థీకరించబడి వృత్తి చేపట్టడం సాధారణం కాగా వృత్తి పరంగా సంఘటితపడి ఒక కులంగా మారడం అరుదుగా జరిగేవిషయం అన్నమాట. ఇక తెగలు కులాలుగా మారేక్రమంలో ఆయా తెగలే వృత్తిని ఎంచుకున్నాయా, లేక ఆయా తెగలపై వృత్తులు రుద్దబడ్డాయా అనేది ప్రధానమైన సమస్య. ఈ ప్రశ్నకు సమాధానం ఆర్థిక రాజకీయ పరిణామాలలో దొరుకుతుంది.

ఆర్య తెగల మధ్య, ఆర్య అనార్య తెగల మధ్య, అనార్య తెగల మధ్య యుద్ధాలు జరిగాయి. కనీసం మొదటి దశలో అనార్య తెగలపై ఆర్యతెగలు విజయం సాధించాయి. వేగంగా పరుగెత్తే గుర్రం అందుకు ఉపకరించింది. ఈ యుద్ధాలలో ఓడించబడిన వారు ఆ మైదాన ప్రాంతాన్ని, గ్రామాలను, నీటివనరులను, అనేక సందర్భాలలో గోవులను విడిచిపెట్టి వెళ్ళిపోయేవారు. ఒక తెగకు మరొక తెగ దాస్యం చేయడం, లేదా వారిచే పరిపాలించబడడం కనీసం తొలినాళ్ళలో లేదు. తరువాత

కాలంలో ఓడించబడిన తెగ వారికి ఒక వృత్తి కేటాయించి వారిచే తమకు కావలసిన వస్తు సేవలు పొందేవారు. వారి కనీస అవసరాలు తీరుస్తూ వారిచే గరిష్ట శ్రమ చేయించేవారు. డి.డి కోశాంబి 'భారత చరిత్ర పరిచయ వ్యాసాలు' రచన నుండి ఇప్పటివరకు రెండు ఉటంకింపులు ఇచ్చాము మరి మూడు ఉటంకింపులు చూడదండి. మూడవది: "ఆర్యుల ఆధిపత్యంలో కొత్త సామాజిక వ్యవస్థ నిర్మాణం సాధ్యమైనదంటే అది ఒక పరిణామ క్రమం ఫలితం. ఆర్యేతర గణాలలో బలమైన వాటికి ఆహార ఉత్పత్తినీ, ఇనుము వాడకాన్నీ అలవాటు చేసి వారిలో సైతం వర్గ విభజనను ప్రవేశపెట్టి ఆర్య సమాజంలోనికి కలుపుకోవడం ఒక దశ. ఈ దశలో అర్యులు బలమైన ఆర్యేతర గణాలను లొంగతీసుకోడానికి సామాజిక సాంస్కృతిక సమ్మేళనాన్ని ఒక సాధనంగా ఉపయోగించారు. ఈ క్రమంలో లొంగిపోయిన గణాల అలవాట్లు, ఆచారాలు, పూజా విధానం సామాజిక నిర్మాణం అర్య సమాజంలోనికి వచ్చి చేరినట్లే ఆర్య సాంస్కృతి లక్షణాలలో ప్రధానమైన వర్ణవ్యవస్థ, బ్రాహ్మణాధిక్యం, హేతురహితమైన కర్మకాండ వగైరాలు త్రివిక్రమావతారం దాల్చాయి....... (పేజి 2)." ఆర్యులు పశ్చిమాన కొన్ని నాగరికతల నుంచి వ్యవసాయం నేర్చుకున్న మాట, నాగలిని ఉపయోగించిన మాట వాస్తవమే కాని వారు తూర్పుకు ప్రధానంగా దిగువ గంగా మైదానానికి రాకపూర్వమే, క్రీ.పూ 2000 కు ముందే బీహారులో, బెంగాలులో ఉన్న స్థానిక తెగలు వ్యవసాయం చేస్తున్నట్లు తెలుస్తుంది. ఈ విషయాలు భారత ప్రజా చరిత్ర సీరీస్‌లో భాగంగా ఇర్ఫాన్ హబీబ్ వ్రాసిన మోనోగ్రాఫ్ 'సింధూ నాగరికత' పేజి 89లో ఉన్నాయి: "ఇంకా దక్షిణ భారత దేశంలో కూడా వివిధ ప్రాంతాలలో ఆర్యుల రాకపూర్వమే (క్రీ.పూ 3000) వ్యవసాయం ఉందని తెలుస్తుంది. ఈ విషయాలు అదే భారత ప్రజా చరిత్ర సీరీస్‌లో భాగంగా ఇర్ఫాన్ హబీబ్ వ్రాసిన మరొక మోనోగ్రాఫ్ 'చరిత్ర పూర్వయుగం' పేజి 68లో ఉన్నాయి. కాబట్టి ఆర్యులు స్థానిక తెగలన్నింటికీ వ్యవసాయం నేర్పారని చెప్పలేం. ఇక్కడ మనకు ఆర్యులు తమ వర్ణ వ్యవస్థను, బ్రాహ్మణాధిక్యతను, కర్మకాండను స్థానికులకు 'ప్రధానం' చేసారన్నది ప్రధానమైన విషయం. ఆర్థిక రంగంలో వచ్చిన మార్పుల కారణంగానే స్థానిక తెగలు ఈ వర్ణ సంస్కృతిని, వర్గ దోపిడీని ఆమోదించి ఉండవచ్చు. కె.యం, శ్రీమాలి వ్రాసిన ఇనుప యుగం (క్రీ.పూ 700 – 350) అనే మోనోగ్రాఫ్‌లో మనకు ఈ విషయమై మరింత వివరాలూ, విశ్లేషణా లభ్యమవుతాయి. క్రీ.పూ 1500 నుండి క్రీ.పూ 500 మధ్యలో అంటే తొలి, మలి వేదకాలాలలో వర్ణవ్యవస్థ సుమారు ఉత్తర భారత దేశమంతా విస్తరించింది అని చరిత్రకారులు చెప్తున్నారు.

కోశాంబి నుండి నాలుగవ ఉటంకింపు: "ఓడిపోయిన ఆటవికులలో ఎక్కువమంది శూద్ర, పంచమ కులాలుగా కూలిచేసే రైతాంగంగా మారారు. కుదురు చిహ్నాలు, ఆటవిక గణాల ఆచారాల స్థానంలో కులాలు, స్మృతులు వచ్చి చేరాయి......ఒక్కొక్క ఆటవిక గణాన్ని లేదా కుదురును లోబర్చుకోవడానికి ఒక కులాన్ని, ఒక పురాణాన్ని, కర్మ కాండ సంబంధమైన మార్పును సృష్టించాల్సి వచ్చింది"..... (పేజి 2). కోశాంబి నుండి ఐదవ ఉటంకింపు: "గణం లేదా శ్రేణి నుంచి కులంలోకి మార్పు అంటే ఆటవిక కుదురును బ్రాహ్మణామోదంతో గ్రామ సమాజం తాలూకు వర్గ విభజన క్రమంలోనికి ప్రవేశపెట్టడం అన్నమాట. ఆటవిక గణాలకు స్వయం పోషక గ్రామ సమాజంలోనికి కలుపుకునే క్రమంలో కుల వ్యవస్థ ఏర్పడింది".... (పేజి 9). అంటే ఓడింవబడిన తెగలు ప్రధానంగా వివిధ కులాలుగా వ్యవస్థీకరించబడ్డాయి. వాటికి పాలక వర్గాల అవసరాలు, అందుబాటులో ఉన్న వనరులు, కొన్ని సందర్భాలలో వారి వారి నైపుణ్యాలు దృష్టిలో ఉంచుకుని వివిధ వృత్తులు కేటాయించబడ్డాయి. ఒక తెగలో అత్యధికులకు ఒకే వృత్తి కేటాయించడంతో ఆ తెగ ఒక వృత్తి కులంగా వ్యవస్థీకరించబడింది. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రతి తెగ ఒక వృత్తి కులంగా మారిపోయింది. గెలుపొందిన తెగలలో మెజారిటీ వ్యక్తులు కూడా క్రమంగా వివిధ వృత్తులు చేపట్టవలసి వచ్చింది. అంటే గెలుపొందిన తెగలు కూడా కులాలుగా పరిణామం చెందాయి. మొదటి పరిణామం రాజకీయ కారణాల వలన జరిగితే (యుద్ధంలో ఓడిపోవడం వలన) రెండవ పరిణామం ఆర్థిక ఒత్తిడి వలన జరిగి ఉంటుంది. విశాల భారత దేశంలో ఇందుకు కొన్ని శతాబ్దాలు పట్టి ఉండవచ్చు. మన చర్చ అవసరాల మేరకు సంగ్రహంగా చెప్పుకుంటే తెగలపై వృత్తులు రుద్దబడి కులాలుగా మార్చబడ్డాయి. దానికి ఆమోదం పొందడం కొరకు పురాణాలు వ్రాసారు, వారి దేవతలకు ఆర్య దేవతలతో వరుసలు కట్టారు, కర్మకాండ నిర్వహించారు, కొన్ని సందర్భాలలో ఆ తెగ పూజారులకు, నాయకులకు కుంభగర్భ ప్రక్రియ ద్వారా బ్రాహ్మణ, క్షత్రియ స్థానాలు ఇచ్చారు. మరొక విషయం ఏమంటే, ఆర్యుల కంటే వారి ఆచార వ్యవహారాలు ఎక్కువగా విస్తరించాయని చరిత్రకారులు వివరిస్తున్నారు. అదలా ఉండగా వృత్తుల కంటే తెగలు ఎక్కువగా ఉన్నందున ఒక వృత్తిని ఒకటి కంటే ఎక్కువ తెగలకు కేటాయించి వాటిని కులాలుగా వ్యవస్థీకరించినందున వృత్తుల కంటే కులాలు ఎక్కువగా ఉన్నాయి. ఒకే వృత్తి చేసే రెండు కులాలు ఒక కులంగా మారవు ఎందుకంటే వాటికి తెగకాలం నుండి వచ్చిన వివాహ విధి నిషేధాలే కారణం. తెగకు, వృత్తికి, కులానికి ఉన్న సంబంధాన్ని ఇంతవరకు పరిశీలించాం. అయితే ఆధునిక పారిశ్రామికీకరణ ఫలితంగా సాంప్రదాయక వృత్తులన్నీ రద్దయిపోతే కులాలకు మనుగడ ఉండదు. కాని వృత్తులన్నీ పోవడం అంత సులభం కాదు. చేనేత, తోళ్ళు శుభ్రం చేయడం, బట్టలుతకడం, క్షవరం చేయడం, రహదారులు ఇతర ప్రజా ఆవరణలు శుభ్రం చేయడం వంటి వృత్తులు చాలా కాలం కొనసాగే పరిస్థితి కనిపిస్తుంది. ఇంకా ప్రధానంగా వ్యవసాయం ఒక వృత్తిగా కొనసాగడం అన్నింటికంటే పెద్ద విషయం. కుల నిర్మూలనకు వ్యవసాయ కులాల నిర్మూలన అత్యంత ప్రధానమైన విషయమని ఈ క్రింది పేరాలలో ప్రతిపాదిస్తున్నాం.

వృత్తులన్నీ పోతున్నందుకు కులం పోవాలికదా అంటున్నారు. గ్రామాలలో వ్యవసాయం చేసే కుటుంబాలు పెద్ద సంఖ్యలో ఉంటున్నాయి. వ్యవసాయం కూడా ఒక వృత్తే. బట్టల నేత వలే, కుండలు తయారుచేయడం వలే వ్యవసాయం కూడా కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్‌గా ఉండే వృత్తి. వృష్టి వ్యవసాయాన్ని ఉత్పత్తి యూనిట్‌గా గుర్తించకపోవడం, వ్యవసాయ కుటుంబాన్ని వృత్తి కుటుంబంగా గుర్తించకపోవడం వలననే వృత్తులు పోయినా కులం మిగిలింది అనే ప్రశ్న వస్తుంది. గ్రామంలో వృత్తుల చేసే కుటుంబాలను గణించినప్పుడు మనం వ్యవసాయేతర వృత్తులను మాత్రమే దృష్టిలోనికి తీసుకుంటాం. వ్యవసాయ కుటుంబాలను వృత్తి కుటుంబాలుగా పరిగణించం. అందుకే వృత్తులు కనుమరుగైపోయాయని పొరపాటుగా అనుకుంటున్నాం. వ్యవసాయ కుటుంబం ఒక వృత్తి కుటుంబం, అది ఒక ఉత్పత్తి యూనిట్ అన్న భావనను ఎవరూ వ్యతిరేకించకపోవచ్చు. అటువంటి భావన మన మస్తిష్కంలో లోపలి పొరలలో ఉండవచ్చు. అయితే వ్యవసాయ

కుటుంబం ఒక వృత్తి కుటుంబం అవునా కాదా అలాగే ఆ కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్ అవునా కాదా అన్న ప్రశ్నలు వేసుకుని సమాధానం రాబడితేనేగాని మనకు ఒక స్పష్టమైన భావన ఏర్పడదు. ఒక స్పష్టమైన భావన ఏర్పడకుండా దానిని మనం సామాజిక విశ్లేషణలో సమర్ధవంతంగా ఉపయోగించలేం.

కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్‌గా ఉండడం: కుటీర పరిశ్రమలు, లఘు పరిశ్రమలు వేరు కాగా కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్‌గా ఉండడం వేరు. కుటీర పరిశ్రమ ప్రతి సందర్భంలో సంప్రదాయ కుల వృత్తి కాకపోవచ్చు. ఇంకా ప్రధానంగా కుటీర పరిశ్రమలో లేదా లఘు పరిశ్రమలో కుటుంబ సభ్యులే పనిచేయాలని లేదు. బయట వారు కూడా పనిచేయవచ్చు. కుటుంబ సభ్యులలో ఒకరు, అత్యధిక సందర్భాలలో కుటుంబ యజమాని ఒక కుటీర పరిశ్రమ నడిపి దానిలో ఇతరులను పనికి నియమించుకోవచ్చు. ఆయన పిల్లలు చిన్నప్పుడు విద్యాభ్యాసాంగాన్ని చేపట్టి పెద్దయిన తరువాత ఇతర ఉద్యోగాలకు లేదా వ్యాపారాలకు వెళ్ళ వచ్చు, లేదా కొడుకులలో ఒకరు తండ్రి స్థానాన్ని చేపట్టవచ్చు. ఇక్కడ కుటంబ శ్రమ మీద పరిశ్రమ ఆధారపడిలేదు, కుటుంబ సభ్యులు కుటుంబ యజమాని క్రింద పనిచేయడం లేదు. దీనిని మనం కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్‌గా ఉండడం అని చెప్పలేం. కుటుంబ సభ్యులు పనిచేస్తూ ఇతర కూలీలను పరిమితంగా నియమించబడినప్పుడు అటువంటి కుటుంబాన్ని ఒక ఉత్పత్తి యూనిట్ అని చెప్పవచ్చు. కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్‌గా ఉండాలంటే కుటంబ శ్రమ ప్రధానం కావాలి. కుటంబ సభ్యులు కుటుంబ యజమాని అదుపు ఆజ్ఞలలో ఉత్పాదక శ్రమ చేయాలి. చిన్న ఉత్పత్తి రంగంలో కుటుంబ ఉత్పత్తి ఒక ప్రత్యేక స్థానాన్ని కలిగి ఉంటుంది. చిన్న ఉత్పత్తి యూనిట్లు అవి కుటుంబ ఉత్పత్తి యూనిట్లు కానప్పుడు కులానికి ఆధారంగా ఉండలేవని. చిన్న ఉత్పత్తి యూనిట్లు కుటుంబ ఉత్పత్తి యూనిట్లుగా ఉంటేనే అవి కులానికి ఆధారం కాగలవనేది ఇక్కడ ప్రతిపాదన.

వ్యవసాయం ఇతర వృత్తుల వలే ఒక సంప్రదాయ వృత్తి, అలాగే వ్యవసాయ కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్ అన్న అవగాహనతో చర్చలో ముందుకు వెళదాం. కుటుంబం అనేది ఒక సాంప్రదాయ ఉత్పత్తి యూనిట్‌గా ఉన్నన్నాళ్ళూ, అది ఒకానొక కులానికి చెందినదిగానే ఉంటుంది. అది కుల వ్యవస్థను బలపరిచే ప్రాథమిక యూనిట్‌గా ఉంటుంది. తమ స్తోమత వలన ఇంకా సంఖ్యాబలం వలన గ్రామంపై ప్రభావం కలుగజేయగల వ్యవసాయ కుటుంబాలు కుల కుటుంబాలుగా ఉన్నప్పుడు ఇతర కులాలు దుల్లిపోతున్నా గ్రామంలో ప్రధానంగా కుల వ్యవస్థ నిలబడుతుంది. ఒకానొక గ్రామంలో వస్తూత్పత్తి కులాలన్నీ చెదరిపోయినా, వ్యవసాయ కుటుంబాలతో పాటు ఆ గ్రామంలో దళిత కులాలు, చాకలి, మంగలి వంటి సేవక కులాలు, కంసాలి వంటి వ్యవసాయ పనిముట్లు తయారుచేసే కులాలు ప్రధానంగా కొనసాగడం, అలాగే చుట్టుపట్ల గ్రామాలలో కుల వ్యవస్థ కొనసాగడం వలన ఆ గ్రామంలో కూడా కుల వ్యవస్థ కొనసాగుతుంది. గిరిజన తండాలను ప్రక్కన పెడితే వ్యవసాయ కులం లేని గ్రామాలు సుమారు ఉండవు. అందుకే వ్యవసాయ కులం లేని గ్రామలను మనం ప్రత్యేకంగా చర్చించడం లేదు. వ్యవసాయ కులానికి ఉన్న స్తోమత వలన ఇంకా సంఖ్యా బలం వలన గ్రామంపై దానికి ఉన్న ప్రభావం, కుల వ్యవస్థను కొనసాగించగల దాని శక్తి ఇక్కడ ప్రధాన విషయం. ఆ కారణంగా వ్యవసాయ కులాలపైన మన చర్చ కొనసాగుతుంది.

కుటుంబం - అంతర్గత ఆస్థి, ఉత్పత్తి సంబంధాలు

ప్రస్తుత కాలంలో కుటుంబానికి ఉన్న లక్షణాలు ఏమిటి? కుటుంబం ఎ) ఒక సామాజిక యూనిట్‌గా ఉండడం, బి) ఒక ఆర్థిక యూనిట్‌గా ఉండడం సర్వత్రా కనిపిస్తుంది, సి) ఒక సొంత ఆస్థి సంబంధ యూనిట్‌గా ఉండడం, డి) ఒక ఉత్పత్తి యూనిట్‌గా ఉండడం అనే విషయాలను ఇక్కడ మనం పరిశీలిద్దాం. ముందుగా గ్రామీణ వ్యవసాయ కుటుంబాన్ని ఉదాహరణగా తీసుకుందాం. భూమి అనే ఉత్పత్తి సాధనం వీరి సొంత ఆస్థిగా ఉంటుంది. దీనిచుట్టూ కుటుంబ సంబంధాలు నిర్మితమై ఉంటాయి. భర్త ఆస్థి పరుడు. ఆయన ఆస్తియే కుటుంబానికి ప్రధానం. తండ్రి మాట వినకపోతే తనకు ఆస్థి నిరాకరిస్తాడనే భయం కొడుకుకు ఉంటుంది. ఇక్కడ తండ్రి కొడుకుల సంబంధం ఒక సామాజిక సంబంధం మాత్రమే కాదు. ఇది ఆస్థిపరమైన సంబంధం కూడా. అందుకే ఈ కుటుంబాన్ని ఒక ఆస్థిపర యూనిట్ అనాలి. ఈ కుటుంబ ఆదాయ వ్యవయాలు ఒకే కేంద్రంగా జరుగుతాయి. ఆ కారణంగా ఇది ఒక ఆర్థిక యూనిట్ కూడా. రైతు కుటుంబాలలో మధ్యతరగతి రైతు విషయాన్ని ప్రత్యేకంగా పరిశీలిస్తే, ఇక్కడ కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్ కూడా. కుటుంబ సభ్యులందరూ అదే పొలంలో పనిచేస్తారు. పొలం పండించాలా, కౌలుకివ్వాలా, పండిస్తే ఏం పండించాలి, ఎలా పండించాలి, ఎరువులు, పురుగుమందులు ఏవి వాడాలి ఎంతమేరకు వాడాలి, పంట అమ్మడం వంటి నిర్ణయాలనన్నింటిపైన కుటుంబ యజమానిదే చివరి మాట. అంతేకాదు, వ్యవసాయంలో ఆయన నిర్దేశించినట్లే మిగిలిన కుటుంబ సభ్యులు పనిచేయాలి. కాబట్టి ఇక్కడ పురుషుడు సామాజిక అర్థంలో కుటుంబ యజమాని మాత్రమే కాదు ఉత్పత్తి యూనిట్ అనే అర్థంలో కూడా యజమానే. అంటే, ఇక్కడ కుటుంబ యజమానికి మరియు ఆయన భార్య పిల్లలకు మధ్య ఒక ఉత్పత్తి సంబంధం కూడా ఉంటుంది. ఉత్పత్తి సాధనాలలో సొంత ఆస్థి ప్రధాన లక్షణం ఇతరుల శ్రమను నిర్దేశించగలగడం అని జర్మన్ ఐడియాలజీ అనే తమ రచనలో మార్క్స్, ఏంగెల్స్ వ్రాస్తారు. పితృస్వామ్యపు సమాజంలో కుటుంబ యజమానిని బానిస యజమానితో పోలుస్తారు. ఆ అర్థంలో ఇంటి యజమాని ఉత్పత్తి యూనిట్‌కు కూడా యజమాని, కుటుంబ సభ్యులు శ్రామికులు. కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్. అయితే ఇక్కడ దోపిడీ ఉండదు. కుటుంబ యజమాని సొంత లాభం కొరకు కాక కుటుంబ ప్రయోజనం కొరకు పనిచేస్తాడు, చేయిస్తాడు. అయినప్పటికీ ఉత్పాదక శ్రమలో పనిచేసిన వ్యక్తికి స్వేచ్ఛ లేకపోవడం, ఇంకా ప్రధానంగా ఉత్పత్తికి సంబంధించిన నిర్ణయాలలో శ్రమచేసే వ్యక్తుల మాటలకు విలువ లేకపోవడంవలన తండ్రిలో ఒక యజమాని కనిపిస్తాడు. ఒక గ్రామీణ మధ్యతరగతి రైతు కుటుంబంలో ఉత్పాదక శ్రమచేసే కుటుంబ సభ్యులకు నిర్ణయాలలో పాత్రలేకపోవడం వలన శ్రమ ఒక అర్థంలో పరాయీకరణ లక్షణాలు కలిగి ఉంటుంది. కుటుంబ సంబంధాలు ఆధిపత్య సంబంధాలుగా ఉంటాయి.

మనం పరిశీలిస్తున్న మధ్యతరగతి రైతు విషయంలో కుటుంబ సభ్యుల శ్రమ ఫలితంగా చేకూరిన ఆదాయం కుటుంబం క్రింద మాత్రమే ఖర్చు అవుతుంది. ఈ మధ్యతరగతి రైతు తన ఆదాయాన్ని మొత్తం తన కుటుంబానికే ఖర్చు చేస్తాడు లేదా తన కుటుంబం కొరకే పొదుపు చేస్తాడు. అందుకే ఆదాయ వ్యయాల విషయంలో ఈ కుటుంబం ఒక ఆర్థిక యూనిట్‌గా ఉంటుందని కూడా గమనించాలి. ఒక్క మాటలో

చెప్పాలంటే గ్రామంలో మధ్యతరగతి రైతు కుటుంబం ఒక సామాజిక యూనిట్‌గా మాత్రమే కాక, ఒక ఆస్థి సంబంధ యూనిట్‌గా, ఒక ఉత్పత్తి యూనిట్‌గా, ఇంకా ఒక ఆర్థిక యూనిట్‌గా ఉంటుంది. అంటే గ్రామంలో మధ్య తరగతి రైతు కుటుంబం ఎ) సామాజిక, బి) ఆస్థిపర, సి) ఉత్పత్తి సంబంధిత, డి) ఆర్థిక అనే నాలుగు బంధనాలు కలిగి ఉంటుంది. ఒక రైతు తన భూమిని పూర్తిగా కౌలుకి ఇచ్చివేస్తే ఆ కుటుంబం ఒక ఆస్థిపర యూనిట్‌గా ఉంటుంది కాని ఉత్పత్తి యూనిట్‌గా ఉండదు. అలాగే భూమి లేని రైతు భూమిని కౌలుకు తీసుకుని కుటుంబ శ్రమతో వ్యవసాయం చేస్తే ఆ కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్‌గా ఉంటుంది గాని ఆస్థిపర యూనిట్‌గా ఉండదు. కొడుకుకు ఆయన ఇవ్వగల ఆస్థి ఏమీ ఉండదు. సొంత భూమిలో సొంత కుటుంబ శ్రమతో వ్యవసాయం చేసే మధ్య తరగతి రైతే మనకు మంచి ఉదాహరణ. అటువంటి కుటుంబమే ఎ) సామాజిక, బి) ఆస్థిపర, సి) ఉత్పత్తి సంబంధిత, డి) ఆర్థిక అనే నాలుగు బంధనాలు కలిగి ఉంటుంది. ఈ రైతు ఫ్యూడల్ దాసుడు కాదు. స్వతంత్ర రైతే అయితే తానే తన కుటుంబానికి ఒక అధిపతిగా ఉంటాడు. కుటంబంలో ఆధిపత్య సంబంధాలు ఉంటాయి.

ధనిక రైతు విషయానికి వస్తే ఈయన కుటుంబం కూడా ఎన్ని లోటుపాట్లు ఉన్నా ఒక సామాజిక యూనిట్‌గా ఉంటుంది. ఈ కుటుంబం ఒక ఆస్తిపర యూనిట్ అని వేరుగా చెప్పనవసరం లేదు. తండ్రి ఆస్థి వారసత్వంగా కొడుకులకు వస్తుంది. అలాగే ఈ ధనిక రైతు కుటంబం ఒక ఆర్థిక యూనిట్ కూడా. ఎందుకంటే ఆ కుటుంబ ఆదాయ వ్యవయాలు ఆ కుటుంబానికే చెందుతాయి. ధనిక రైతు తన వ్యవసాయంపై తనే యాజమాన్యం చేస్తాడు లేదా చేయిస్తాడు. అయితే ధనిక రైతు కుటుంబాన్ని ఒక ఉత్పత్తి యూనిట్ అనలేం. ఆ కుటుంబ సభ్యులు ఆ యింటి యజమాని క్రింద శ్రమ చేయరు. ఇక్కడ, వ్యవసాయం కుటుంబ శ్రమతో నడవదు. అందుకు కుటుంబంగా అది ఒక ఉత్పత్తి యూనిట్ కాదు. ఇక ఈ కుటుంబాలలో స్త్రీలపై అణచివేత ఎక్కువగా ఉంటుంది. ఇంకా ప్రధానంగా కొడుకుల, కూతుర్ల పెళ్ళిళ్ళ విషయంలో ఈ కుటుంబాలవారు ఎక్కువ అభివృద్ధి నిరోధక భావాలు అమలుచేస్తారు. ముక్తాయింపుగా చెప్పుకోవాలంటే ధనిక రైతు కుటుంబం ఒక సామాజిక యూనిట్‌గా, ఒక సొంత ఆస్థిపర యూనిట్‌గా, ఒక ఆర్థిక యూనిట్‌గా ఉంటుంది. కాని, ఒక ఉత్పత్తి యూనిట్‌గా ఉండదు. ధనిక రైతు కుటుంబం ఊరిపై వీలయినంతవరకు ఫ్యూడల్ పెద్దరికం చలాయిస్తుంది. అయితే ఉత్పత్తి సంబంధాలలో ఫ్యూడలిజం క్షీణించిపోయినందువలన, రాజకీయ ప్రత్యర్థుల వలన, అంటే ఒకే ఊరిలో ఒక ధనిక రైతుకు మరొక ధనిక రైతు ప్రత్యర్థిగా ఉండడం వలన ఈ పెద్దరికం బాగా అడుగంటింది. ప్రజలు ఓట్లు స్వతంత్రంగా వేసుకోవడం లేదా స్వతంత్రంగా అమ్ముకోవడం దీనికి ఋజువు.

ఇప్పుడు మనం పట్టణంలో ఒక అసంఘటిత కార్మిక కుటుంబానికి వద్దాం. ఈ కుటుంబం ఒక సామాజిక యూనిట్. ఆపైన, ఈ కుటంబంలో భార్య కూడా పనిచేస్తుంది. బాల కార్మికులు, ఇంకా పెళ్ళి కావలసినవారు ఉంటే వారి సంపాదన కూడా ఇంటికే వస్తుంది. అంతా కలిపినా ఎందుకూ చాలదు అన్నది వేరే విషయం. ఆ స్త్రీ తన సంపాదన, భర్త ఇంటికి ఇచ్చింది, పిల్లలు ఇంటికి తెచ్చింది కలిపి కుటుంబాన్ని నడుపుతుంది. కుటుంబ సభ్యుల సంపాదన, ప్రధానంగా కుటుంబం కొరకే ఖర్చు అవుతుంది. ఈ కుటుంబాన్ని ఒక ఆదాయ వ్యయాల కేంద్రంగా, ఒక ఆర్థిక యూనిట్‌గా చెప్పవచ్చు. అయితే ఈ పట్టణ కార్మిక కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్ కాదు. భార్య, పిల్లలు పని చేస్తుండవచ్చు కాని. వారు తమ భర్త/ తండ్రి వద్ద పనిచేయరు. ఆయన ఒక దగ్గర, భార్య ఒక దగ్గర, పిల్లలు వేరొక దగ్గర పనిచేస్తారు, వేరువేరు యజమానుల క్రింద పనిచేస్తారు. కొన్ని సందర్భాలలో కుటుంబ సభ్యులందరూ లేక అధికులు ఒకే పరిశ్రమలో పనిచేసినా పరిశ్రమ యజమాని తమ కుటుంబ సభ్యుడు కాదు. కాబట్టి తమ కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్ కాదు. ఇంకా ఈ కుటుంబం ఆస్థిపర సంబంధాలపై ఆధారపడి ఉన్న యూనిట్ కూడా కాదు. ఈ కార్మికుడికి ఎటువంటి ఆస్థి లేదు. తన తండ్రి మాట వినకపోతే తనకు ఆస్తి ఇవ్వడు అనే ఆందోళన ఈయన కొడుకులకుగాని కూతుర్లకుగాని లేదు. అంటే భార్య పిల్లలపై ఆయనకు సామాజిక యాజమాన్యం మాత్రమే ఉంటుంది. ఆ వ్యక్తికి కుటుంబంపై నియంత్రణ, సామాజికమైనదే కాని, ఆస్థి సంబంధాల, ఉత్తత్తి సంబంధాలపరమైనది కాదు. గ్రామ మధ్య తరగతి రైతు కుటుంబానికి పట్టణ అసంఘిటిత కార్మిక కుటుంబానికి మధ్య ఎంతటి వ్యత్యాసం ఉందో గమనించాం. మధ్య తరగతి రైతు కుటుంబం నాలుగు బంధనాలు కలిగి ఉంది. కాగా పట్టణ అసంఘటిత కార్మిక కుటుంబంలో రెండు బంధాలే కనిపిస్తాయి. ఒకటి సామాజికం, రెండు ఆదాయ వ్యయాల యూనిట్‌గా ఉండడం. ఇవి కూడా గ్రామంలో ఉన్నంత పటిష్టంగా ఉండవు. అందుకే వీటిని బంధనాలు అనడం కంటే సంప్రదాయ బంధాలు అనడం సరిగా ఉండవచ్చు. పట్టణ అసంఘటిత కార్మిక కుటుంబాలు నిరంతరంగా పనిదొరకని అలజడి, పనికి తగిన వేతనం దొరకని పరిస్థితి, కూడు, గుడ్డ, నీడలకు కూడా అవస్థ పడడం, అనారోగ్యం వచ్చినప్పుడు పెరిగిన ఖర్చు, తరిగిన ఆదాయం వంటి విషయాలు మనం ఇక్కడ చర్చించడం లేదు. ఈ కుటుంబాలు ఆర్థికేతర సంబంధాలపై మాత్రమే కొనసాగుతున్నందున అదే సందర్భంలో ఆర్థికేతర సంబంధాల ఔన్నత్యాన్ని గ్రహించే అభివృద్ధి స్థాయి వీటికి లేనందున ఈ కుటుంబాలు చాలా సందర్భాలలో అస్థిరంగా ఉంటున్నాయి, కొన్ని సందర్భాలలో విచ్ఛిన్నమవుతున్నాయి కూడా. అయితే ఏ వర్గ కుటుంబంలోనైనా తరతమ భేదాలతో స్త్రీ అణచివేతకు గురి అవుతుందన్న విషయం వేరుగా చెప్పనవసరం లేదు.

పట్టణ మధ్య తరగతి, దిగువ మధ్య తరగతి కుటుంబాలలో కొన్ని పూర్తిగా భర్త ఆదాయంపైననే ఆధారపడి ఉంటాయి. ఈ కుటుంబంలో పనిచేసేది ఒక్కరే. ఆ ఒక్క వ్యక్తి వేరే యజమాని వద్ద పనిచేస్తాడు. కావున ఈ కుటుంబం ఒక ఉత్పత్తి యూనిట్ కాదు. మరొక విషయం, ఇక్కడ భర్త కుటుంబానికి ఏకైక ఆదాయ వనరు అయినందున సామాజిక అర్థంలో మాత్రమే కాక ఆర్థిక అర్థంలోకూడా కుటుంబానికి ఆ వ్యక్తి యజమానే. ఇక్కడ స్త్రీకి స్వేచ్ఛ ఉన్నట్లే ఉంటుంది కాని సారాంశంలో ఉండదు. భార్య భర్తల సాపేక్ష సైకలాజికల్ స్థాయిలను బట్టి లేక చాలా తక్కువ సందర్భాలలో భర్త ప్రజాస్వామిక భావాలు కలిగి ఉండడం వంటి కారణాలు వలన స్త్రీకి స్వేచ్ఛ దొరకవచ్చు లేదా ఇవ్వబడవచ్చు. ఈ కుటుంబానికి ఆస్తిపాస్తులు ఉంటే ఈ కుటుంబం ఒక ఆస్తి సంబంధ యూనిట్‌గా కూడా ఉంటుంది. అయితే ఈ ఆస్థి సాధారణంగా ఉత్పత్తి సాధనాలుగా కాక ఇల్లు, ఇంటి స్థలాల, బ్యాంకు డిపాజిట్లు, బాండ్లు రూపంలో ఉంటుంది. ఈ కుటుంబ ఆదాయం ఈ కుటుంబం క్రింద మాత్రమే ఖర్చు అవుతుంది కావున దీనిని ఒక ఆర్థిక యూనిట్ అనవచ్చు. ఇది ఒక సామాజిక యూనిట్, ఒక ఆర్థిక యూనిట్. కొన్ని సందర్భాలలో ఒక ఆస్తి పరమైన యూనిట్ కూడా. కాని ఒక ఉత్పత్తి యూనిట్ మాత్రం కాదు. (ఇంకా ఉంది)

# నిర్మాణాలకు దూరమయినా.. భావజాలానికి కాలేదు

నల్లూరి రుక్మిణి



కొందరంతే! ఊరూ పేరూ కలిసిపోయి వుంటారు.

విప్లవాభిమానులకు నెల్లూరు అంటే పద్మా, పురందర్‌లే కనపడేది. అంతా తామే అయి, అంతటా తామే అయి పనిచేసిన కాలమది.

పురందర్ చనిపోయినప్పుడు మిత్రబృందంలో ఓ చర్చ నడిచిందట- ఇప్పుడు అతను మన సంఘాలలో లేడుగదా! మనమెంతవరకు ఆయన సంస్మరణలో పాల్గొనవచ్చు...! అని. ఇలాంటి ప్రశ్నలు కొందరు చనిపోయినప్పుడు వస్తూనే వుంటాయి. దానిమీద చర్చలు జరుగుతూనే వుంటాయి.

అయితే ఈ ప్రశ్నలు ఈసారి నా మనసులో కొంత ఆలోచనలను రేకెత్తించాయి. ఒక యాభైఏళ్ళ కాలంగా ఉద్యమాలతో వెనకగానో, పక్కగానో నడుస్తూ వస్తున్న నేను చాలా మంది అమరులవడం చూశాను. అయితే అన్ని సందర్భాలలోనూ అందరికీ ఒకేరకమైన నివాళులు దక్కవు. వాటికి వారివారి కుటుంబ స్థితిగతులతోపాటు, అప్పటికి ఉద్యమాలతో వారికున్న సంబంధాలు కూడా కారణమవుతాయి.

ఈ సందర్భంలో శివరాత్రి మహత్యంలో శివభక్తుల కథలు గుర్తుకు వచ్చాయి. ఇలాంటివి శ్రీనాథుడు కూడా చాలా రాశాడు. తాగుబోతు, తిరుగుబోతు, దుర్మార్గుడు అయినవాడు కూడా శివరాత్రి రోజు చనిపోతే, లేదూ, తాగుతూ తాగుతూ రాత్రంతా శివరాత్రి రోజు మేల్కొంటే చాలు చచ్చిపోయినవాడు కైలాసానికి పోయిన కథలెన్నో!

అంటే, జీవితకాలంలో వాళ్ళ బతుకులు వాళ్ళు సవరించుకుని నింపాదిగా ప్రజాసేవ చేయడం, అదో ఆదర్శమనుకోండి- అలా కాక తమ ప్రైమ్ ఏజ్‌ని అంటే మనిషి జీవితంలో ముఖ్యమైన యవ్వనకాలాన్ని ఆ కాలంలో కుటుంబాలను తాకి తల్చుకోకుండా పనిచేసి;... తరవాత ఇతరేతర కారణాలతో దూరమైన వాళ్ళ గురించి తర్కబద్ధమైన దృష్టిని అనుసరించాల్సిన అవసరం లేదా?- అట్లానే భిన్నాభిప్రాయాలతో దూరమైన వాళ్ళ గురించి కూడా!... అంటే ఉద్యమాలకు వ్యతిరేకంగా తయారయిన వాళ్ల గురించిన చర్చ కాదు ఇది.

అలా ఆలోచించినప్పుడు పురందర్‌లాంటి వాళ్ల పట్ల మనం ఎలా అంచనావేసుకోవాలన్నదే నా జిజ్ఞాస.

అదలావుంచి, పురందర్ ఏమి చేశాడు? అతని కార్యాచరణ ఏమిటీ?లోకి వద్దాం!-

పురందర్ నెల్లూరు వాసి. మార్చి 11న అనారోగ్యంతో చనిపోయేదాకా కూడా మనుషుల కోసం తపనపడినవాడు. తను బతకనని అర్థమయిపోయింది- అందుకే 'చచ్చిపోయినప్పుడు ఎర్రజెండా కప్పుతారు కదా'! అని మరీ మరీ అడిగాడు. అతనికి ఎర్రజెండా మీద గుండెలనిండా వున్న ప్రేమకు ఆ ప్రశ్నే నిదర్శనం. ఆ మాట ఆయన అడిగింది, లేని గౌరవం కోసం ఆరాటపడి కాదు. ఆ జెండా కోసం, ఆ జెండా కింద- చేసినన్నాళ్ళూ అరమరికలు లేకుండానే చేశాడు. అభిమానించాడు కనుకనే.

ఆయన కమ్యూనిస్టు పార్టీ అభిమాని. కొండపల్లి సీతారామయ్య భక్తుడు. ఆరడుగుల పైబడి భారీ విగ్రహం, కానీ మర్మమెరుగని పసిపిల్లవాడు. నిర్మలమైన ప్రేమ, అవ్యాజమైన అనురాగం అతని సొత్తు. నోటి నిండా నవ్వు, కంటి నిండా కాంతులు, మొహం నిండా వెలుగులు అతని రూపం. పురందర్ వీటినన్నిటినీ అందరికీ పంచాడు. అందులో అరమరికలు లేవు. మనిషి కనబడితే సందిట వాటేసుకోవడమే అతని ఆహ్వానపు తీరు.

అందువల్లే ఆయన చనిపోయిన రోజు పాతకాలంనాటి మిత్రులు దూరప్రాంతాలనుండి కూడా వచ్చారు. గద్దర్, డాక్టరు మిత్ర, డాక్టరు జయకుమార్, సుమిత్ర, సుమతి వంటివాళ్ళు రాగలిగి వచ్చారు. రాలేని ఎల్‌యస్ఎన్ మూర్తి, కాకరాల వంటివాళ్ళు రాలేకపోయారు.

ఇది కరోనా కాలమే కాదు, కాని కాలం కూడా అయినప్పటికీ ఆయన సంస్మరణ సభకు నెల్లూరు చుట్టుపక్కల గ్రామాల నుండి ఐదారువందల మంది జనం వచ్చారంటే, పురందర్ జనంతో

కలిసిపోయిన తీరుకు, వారిపై చూపించిన మమతానురాగాలకు అదే నిదర్శనం. పురందర్, పద్మలు సంఘాలలో పనిచేయడం తగ్గిపోయాక కూడా తమ వ్యక్తిగత సమస్యలు చెప్పుకొని ఓదార్పు పొందడం కోసం, సలహాలు, సహాయం కోసం ఊళ్ళనుండి జనం రావడం అలవాటుగా ఇటీవల వరకూ సాగుతూనే వుండేది. ఇక ఇద్దరి ఆరోగ్యాలు అనుకోని రీతిలో ఒడిదుడుకులకు లోనయ్యాక, అప్పటి నుండి ఒక రకంగా నిశ్శబ్దంలోకి వెళ్ళిపోయారు.

ఇది పురందర్ వ్యక్తిత్వం అయితే!- అతను నడిచిన దారి భారత విప్లవోద్యమంలో అంతర్భాగం. నక్సల్బరీ బాటలో తానూ ఓ చిదుగై దాని వెలుగులకు తోడయ్యాడు. తొలిదశలో ఆంధ్రదేశంలో, ముఖ్యంగా కోస్తా జిల్లాల్లో విప్లవోద్యమం పాదుకొనడానికి తపన పడుతున్న కాలంలో ఆసరా అందించిన కొద్దిమందిలో ఆయనా ఒకరు.

అయితే, ఆయన ఇటువైపు రావడానికి ప్రేరణను ఇచ్చిందెవరు? ఏమిటి?

చిన్ననాడు అతను అడుగులు వేసింది బాబాయ్ నెల్లూరు కాంతారావు ఆసరాతోనే. ఆయనకు కాంతారావు ఆదర్శం. కాంతారావు నడిపిన 'తాలింఖానా'లో శిక్షణ పొందడం దగ్గరి నుండి ఆయన చూపించిన కమ్యూనిస్టుపార్టీ దాకా బాబాయ్‌ని అనుసరించాడు పురందర్.

70వ దశకం నాటికే 'కనకమహల్' నెల్లూరులో ప్రతిష్ట కలిగిన సినిమాహాల్. ఆ కనకమహల్ చుట్టుకునే ఆ కుటుంబమూ ఆ వూరిలో గౌరవాన్ని పొందింది. సినిమా ప్రపంచంతో పరిచయం వారి హోదాను మరో మెట్టు పెంచింది. అయినా కాంతారావూ, అతని ననుసరించి పురందరూ కమ్యూనిస్టు పార్టీని వదలలేదు.

అందువల్లే నెల్లూరు టౌన్‌లో ఓ దశలో కమ్యూనిస్టులకూ, ఆర్‌యస్‌యస్ వాళ్ళకూ ఉద్రిక్తతలు ఏర్పడినప్పుడు, ఆర్‌యస్‌యస్ గుంపు కనకమహల్‌ని ధ్వంసం చేయడానికి ప్రయత్నించింది. అయితే ఆ దాడి తమ స్వంత ఆస్తిమీద జరుగుతున్న దాడిగా కాక, కమ్యూనిస్టు ఉద్యమం మీద దాడిగా భావించి కమ్యూనిస్టు పార్టీ సహకారంతో ఆర్‌యస్‌యస్‌కు వ్యతిరేకంగా నిలబడి ఆ దాడిని సమర్థవంతంగా ఎదుర్కొన్నారు కాంతారావు, పురందర్‌ల బృందం. ఇది ఆ రోజు నెల్లూరులో గొప్ప ప్రభావాన్ని చూపించింది. కమ్యూనిస్టు పార్టీకీ ఆ కుటుంబానికీ వున్న గాఢమైన అనుబంధాన్ని మనం ఈ సంఘటన ద్వారా అర్థం చేసుకోవచ్చు. ఆర్‌యస్‌యస్ దాడికి ప్రతిఘటనను పురందర్ సమర్థవంతంగా ఆర్గనైజ్ చేయడం గమనించవచ్చు.

నక్సల్బరీ తొలి గర్జనకు భారతదేశపు యువతరం ఎంతగా స్పందించిందో చరిత్రే దానికి తార్కాణం. ఆ ఉద్వేగ, ఉద్రిక్త యువ రక్తం వర్గ శత్రువుతో పోరాటమే మార్గమనుకున్నారు. యువకుడైన పురందర్ కూడా దానికి ఆకర్షితుడయ్యాడు. ఫలితంగా కొడవలూరు కుట్ర కేసు ఎదుర్కొన్నాడు. జైలు జీవితమూ గడిపాడు. ఆ జైలులోనే కలిసిన కామ్రేడ్ మహదేవన్ స్నేహం ఆయనను మరింత దీక్షాపరుడిని చేసింది.

అదేగాక నెల్లూరు జిల్లాలో డాక్టర్ రామచంద్రారెడ్డి ప్రజావైద్యశాల, దాని చుట్టూ కమ్యూనిస్టు సానుభూతిపరులేకాక, జక్కా వెంకయ్య, పాండురంగారావు, పులి రామకృష్ణయ్య, దేవినేని మల్లికార్జున్, శివరామిరెడ్డి, నారాయణరెడ్డి, ఇంతా రమణారెడ్డి, శంకరరెడ్డి వంటి ఎంతోమంది ఆ జిల్లాను ప్రభావితం చేసినవాళ్ళు వున్నారు. ఈ సానుకూల వాతావరణం పురందర్ లాంటి కార్యకర్తలకు ఎంతో వెన్నుదన్నుగా వుందని చెప్పవచ్చు.

నక్సల్బరీ ప్రథమ విస్ఫోటనపు శబ్దాలు తగ్గుముఖం పట్టి ప్రజాచైతన్యం, ప్రజాసంఘాల అవసరం గుర్తించిన ఆంధ్రప్రదేశ్ ఎమ్ఎల్ పార్టీ ప్రజాసంఘాల నిర్మాణంవైపు అడుగులు వేసింది. అట్లా తొలి అడుగుల్లో దారి వెతుక్కుంటున్న క్రమంలో ఊరికొకరు, వాడొకకరు అన్నట్టుగా దొరికిన కార్యకర్తలను పట్టుకొని "కొండకు వెంట్రుక వేసినట్టు"- ఆంధ్రరాష్ట్రంలో సి.ఓ.సి ఏర్పడడానికి పనికివచ్చిన వాళ్లలో పురందరూ ఒకడయ్యాడు. మహదేవన్ సారథి అయ్యాడు.

ఇక అక్కడి నుండి, అంటే 1972ల నుండి ఆయన జీవితం రెండు పాయలుగా నడిచింది, బహిరంగ జీవితం, లోపలి జీవితాలుగా!. నిజానికి పురందర్ చిరునామా ఏ సంఘంలో వుంది? అంటే, చెప్పలేం- కానీ, ఆయన అన్ని సంఘాలకూ కావల్సినవాడు. అన్ని సంఘాలూ ఆయన సేవలను అందుకున్నాయి. ఈ కీలక దశలో పురందర్ కృషి విలువ కట్టలేనిది. అది బయటికి తెలిసేదీ కాదు, కనిపించేదీ కాదు. ఈయనే కాదు, ఉద్యమం నిర్మాణం పొడవునా ఇలాంటి కార్యకర్తలు ఎందరో!.

ఆ దశ నుండి క్రియాశీలక రాజకీయాల నుండి తప్పుకొనేదాకా నడుస్తున్నా నిద్రపోతున్నా ఆయన చేసిన పని ఇదే!. ఏనాడూ గుర్తింపు కోసం ఆలోచించేవాడు కాదు. అన్నీ ఆయనే అయి చేసేవాడు, తెరవెనకనే వుండిపోయేవాడు.

ప్రజా సంఘాలు ఏర్పాటు చేయాలన్న తొలిదశలో మొదటగా ఏర్పాటు చేసింది కళాబృందాలనే. అలా కళాబృందాలను తయారుచేయడం కోసం అక్కడొకరూ, అక్కొడొకరూ దొరికిన వాళ్ళను పట్టుకుని మొదటిసారిగా నెల్లూరు జిల్లాలో గద్దర్ ఆధ్వర్యంలో నెల రోజులు ట్రైనింగ్ ప్రోగ్రాం నిర్వహించారు. నెల్లూరంటే బాధ్యత పురందర్‌దేనని చెప్పాల్సిన పనిలేదు. పైగా అప్పటిలో చారు గ్రూపు పట్ల జనంలో ప్రేమా, భయం రెండూ వుండేవి. గద్దర్‌నీ, దాదాపు ఇరవైమంది ఔత్సాహికులను కలిపి నెలరోజులపాటు ట్రైనింగ్ ప్రోగ్రామ్ నిర్వహణ అంటే మాటలు కాదు. పాటలు, ఒగ్గుకథ, భూమి భాగోతం వంటివి నేర్పి, ఈ కళా బృందాలతోపాటు విద్యార్థులను కలిపి 'గ్రామాలకు తరలండి' ప్రోగ్రాంలు నిర్వహించాలి. అదీ ఆనాటి పార్టీ ఆలోచన. ఆ ఆలోచన అందుకున్న పురందర్ 'భూమి భాగోతం'లో స్వయంగా భూస్వామి వేషం వేశాడు. భార్య పద్మతో స్త్రీ పాత్రను వేయించాడు.

అక్కడి నుండి జననాట్య మండలి బాధ్యుడని చెప్పలేంగానీ! ఆ రోజుల్లో నెల్లూరు నుండి రాయలసీమ దాకా ఆయా గ్రామాలకు ఆ కళా బృందాల వెంట ఆ జంట నిర్విరామంగా తిరిగింది. జననాట్యమండలి కళాకారులకూ, గ్రామాలకు వెళ్ళే విద్యార్థి యువజనులకు సంధాన కర్తగా- ఆ ప్రాంతాలలో వారి అవసరాలు నెరవేర్చే బాధ్యతను ఆయనే మీదేసుకున్నాడో, ఎవరైనా వేశారో తెలిసినవాళ్ళు చెప్పాల్సిందే.

అలా, '78లో గుంటూరులో జరిగిన ఆర్‌వైయల్ రాష్ట్ర మహాసభలు, అదే సంవత్సరం రాడికల్ విద్యార్థుల మహాసభల దగ్గర నుండి 1981లో నెల్లూరులోనే జరిగిన రైతుకూలీ మహాసభలు, '82లో కరీంనగర్ రెండవ రైతుకూలీ మహాసభల దాకా ఎన్నో రాష్ట్రస్థాయి మీటింగులు ఆయన ఆధ్వర్యంలో అని అనలేంగానీ- ఆయన లేకుండా జరగలేదు.

అలా ఆనాటి సిఓసికి, ఆ తరవాత 'పీపుల్స్‌వార్'గా మారినాక ఆ

పార్టీకి బలమైన కార్యకర్తగా పనిచేశాడు. కొండపల్లి సీతారామయ్య భక్తుడు స్థాయిలో ఆయన అభిమానం వుండేది. అందువల్లే అనేకసార్లు అవసరమయిన సందర్భాలలో పురందర్, పద్మ దంపతులను కెయస్ పిలిపించుకునేవాడంటారు. అందువల్లే వీరికి ద్రోణవల్లి అనసూయమ్మ గారితో గాఢమైన అనుబంధాలు కుటుంబస్థాయిలో వుండేవి.

ఇలా వారు పనిచేసినంతకాలం వ్యక్తిగత జీవితానికి, కమ్యూనిస్టు ఆచరణకూ మధ్య గీతలు వుండేవి కావు. సంఘాల కార్యకర్తలు ఎవరు వాళ్ళింటికి వెళ్ళినా పద్మకు ఆరోగ్యం సహకరించినన్నాళ్ళూ, ఎంతో ఆప్యాయతతో ఎట్లా ఆతిథ్యమిచ్చే వాళ్ళో, వాళ్ళతో గడిపిన వాళ్ళు చెప్పాల్సినవి.

మాకు పరిచయం అయింది 1978లో. అప్పటి నుండీ తెలిసిన విషయాలే చెప్పుకున్నా ఆ కాలంలో విప్లవపార్టీ నిర్మాణ చరిత్రకు పనికివచ్చే శకలాలను పురందర్ జీవితం నుండి ఏరుకోవచ్చు అనుకుంటాను.

మొదటిసారిగా '78లో జరిగిన రాడికల్ యువజన సంఘం ప్రథమ మహాసభలకు పద్మ, పురందర్ మా ఇంటికి వచ్చారు. ఆ సభల నిమిత్తం ప్రచారానికై హైదరాబాదు నుండి పద్మాకర్, సంధ్య వాళ్ళ బృందం దాదాపు పదిహేను మంది అప్పటికే వచ్చి వున్నారు. (ఆర్‌వైయల్ సభల కోసం ఎమర్జన్సీకి ముందు '74లో ఒక ప్రయత్నం చేసి- ఎమర్జన్సీ, పోలీసుల నిర్బంధం వల్ల ఆగిపోయాయి. అప్పుడూ కళాబృందం వచ్చింది. ఆ బృందంలో భూపాల్ కూడా వున్నాడు.) ఆ నెల రోజుల్లో ప్రోగ్రాం లేని రోజుల్లో మా ఇంట్లోనే వుండేవాళ్ళు,- అంటే మా కాలనీ స్థావరంగా చుట్టుపక్కల గ్రామాలలో ప్రచారం సాగుతుండేది. అట్లా పద్మ, నిమ్మి, సంధ్య మాకు మంచి మిత్రులయ్యారు.

అది మొదలు కరీంనగర్ రెండవ రాష్ట్ర రైతుకూలీ మహాసభల నిర్వహణ [illegible] బాధ్యుడిగా దాదాపు నెలరోజులు ముందే అక్కడికి వెళ్ళిన వం[illegible]కర్తల టీంకి పురందరే బాధ్యుడు. ఆ నెల రోజుల నిర[illegible]యన కనబరిచిన సమన్వయం, కృషి- ఆ మీటింగులు నిర్వహించిన తీరు మీద, వరవరరావు 'శ్రీకాకుళ కమ్యూన్' గేయం ఓ పెద్ద ఉదాహరణ. ఆ సభల్లో ప్రతి ఒక్కరూ ఎంతగా మమేకమయ్యారో నాకిప్పటికీ కళ్ళల్లో వుంది. జాపా లక్ష్మారెడ్డి, గంజి రామారావు, రవీందర్, యాదగిరి- ఎందరో పేర్లు గుర్తులేని కామ్రేడ్స్. అవేకాదు అనేక రాష్ట్ర మహాసభల్లో ఆయన నిర్వహించిన పాత్ర తక్కువేం కాదు.

అట్లా నెల్లూరు రైతుకూలీ మహాసభలు, ఆర్‌వైయల్ సభలు, ఆర్‌యస్‌యు సభలు ఒకటేమిటి 1978 మొదలు పీపుల్స్‌వార్‌కి స్వర్ణయుగమన్నంతగా సాగిన ఆ ఐదారేళ్ళపాటు ఎక్కడ రాష్ట్రస్థాయి మీటింగులయితే అక్కడికల్లా ముందుగా వెళ్ళే "సర్కస్ టెంట్ల" బాచ్‌కింద కొందరిని హాస్యమాడేవారు. అందులో పురందర్ ఒకడు. ఆ కాలంలో పురందర్ పాత్ర చిన్నది కాదు.

అయితే ఆయన నాయకుడా? రచయితనా? ఉపన్యాసకుడా? మేధావా? ఏదీ కాదు. ఆయన మామూలు కార్యకర్తే, అయితే అదే అతనా?... ఆనాటి పార్టీకి తలలో నాలుకయ్యాడు, తనకు అప్పగించిన కత్తిమీద సాములాంటి బాధ్యతలను నిర్భయంగా చాకచక్యంగా నిర్వహించాడు. అయితే ఇలాంటి వారి గురించి చరిత్ర ఏం అక్షరాలు రాల్చగలదూ? మరుపు పుటల్లోకి పోయే ఇలాంటి వారెందరూ?.

పురందర్ పెద్ద చదువుకున్నవాడు కాదు, కానీ అతనికి పరిచయస్తులూ, స్నేహితులూ ఎంత విస్తృతమో? చెప్పలేం!. అందువల్లే నెల్లూరు టౌన్‌లో ఏ సంఘం విరసం, ఏపిసియల్‌సి, ఏదైనా కావచ్చు;- సభలు నిర్వహిస్తున్నారూ! అంటే- అతని సహాయ సహకారాలు లేకుండా వుండేది కాదు. చలసాని ప్రసాద్, పురందర్ ఒక కోవకు చెందిన వ్యక్తులు- మనుషులను ఏ శషభిషలూ లేకుండా ఆలింగనం చేసుకోవడం వారి ప్రవృత్తి. అందువల్లే వారు ఎవరి దగ్గరకైనా వెళ్ళగలిగేవాళ్ళు, తమకు కావలసిన పనిని నెరవేర్చుకుని వచ్చేవాళ్ళు.

కనకనే AILRC, AIRSF వంటి ఆలిండియా సభలు మద్రాసులో జరిగినపుడు కూడా ముందుగా వెళ్ళి సభల సన్నాహాలు చేయడంలో పురందరూ వున్నాడు. పురందర్‌కి సినిమా ప్రపంచంతో పరిచయం, నెల్లూరుకు దగ్గర కావడం అందుకు ఉపకరించింది. అదేకాదు ఆనాడు పార్టీకూడా స్వయంగా తానుగా జరిపిన అనేక కార్యక్రమాలకు పురందర్ వాళ్ళ సహాయం తీసుకున్నారనేది వినికిడిగా వినిపించేమాట- నిజమేమిటో తెలియదు. కొండపల్లికి బాడీగార్డ్‌గా ఆయన ఏ ఆజ్ఞ ఇస్తే అది చేయడం పురందర్ దంపతుల పని అనుకోవచ్చు. చివరికి ఒక దశలో పూర్తికాలం పనిచేస్తామని ఉత్సాహంగా కొన్నాళ్ళు సంసారాన్ని సర్దుకుని వెళ్ళిపోయారుగానీ- అతికొద్ది కాలంలోనే తిరిగి వచ్చారు. అదేమంటే- మన ఒంటికి 'అజ్ఞాతం' పడదమ్మాయ్! అన్నాడు.

ఇంతగా పార్టీతో మమేకమైన మనిషి, అనంతర కాలంలో ఆ సంస్థకు దూరంగా వుండవలసి రావడం బాధే అయినా తప్పని సరైంది. ఒకటికి రెండుసార్లు గుండెకు బైపాస్ సర్జరీ జరగడం, కుటుంబ పరిస్థితులకు తోడు, రాజ్యంవైపు నుండి వత్తిడికూడా ఆయన దూరంగా వుండక తప్పని పరిస్థితి ఏర్పడింది. రాజకీయాలలో పనిచేస్తున్నంత కాలం అవసరాల కోసం వారసత్వంగా వచ్చిన ఆస్తిని ఎప్పటికప్పుడు ఒక్కొక్కటిగా అమ్మివేయడంతో చివరి దశలో ఆర్థిక అవసరాలకోసం తిరిగి ఏదో ఒక పనిచేయక తప్పలేదు. ఆ క్రమంలో ఏవో కాంట్రాక్టు పనులూ చేశాడు.

అయితే ఆ తరవాత కాలంలో తనకు చిరకాల పరిచయస్తుడూ రాజకీయ నాయకుడూ అయిన వ్యక్తి స్థాపించిన 'ట్రస్ట్' కోసం పనిచేయడం కొంత వివాదాస్పదమయింది. అయితే దానిలో వాళ్ళు ఆర్థిక వెసులుబాటుకంటే పేదల కోసం పనిచేయడం కూడా వుందనే మాటతో సంతృప్తి పడ్డారు. ఇది ఒక వాస్తవం. అది బయటివాళ్ళు అంగీకరించాలనేం లేదు. నిజమే, ఆయన ప్రజా సంఘాలకు దూరమయ్యాడు. కానీ కమ్యూనిస్టు భావజాలాన్ని వ్యతిరేకించలేదు. అంతేగాదు, ఆ ఆశయాలకు విరుద్ధంగా ఎక్కడా ప్రవర్తించలేదు, నష్టమూ కలిగించలేదు. అయితే కమ్యూనిస్టు పార్టీ కింద కొనసాగలేకపోయాడు, అంతే తప్ప పురందర్ మనసు నిండా పార్టీ పట్ల వున్న ప్రేమ, స్పిరిట్ తూలిపోలేదు. 2005లో 'కావలి'లో జరిగిన విరసం సాహిత్య పాఠశాల- అలిపిరి సంఘటనతో- పోలీసుల పహారాలో ఎంత ఉద్రిక్త స్థితిలో జరిగిందో అందరికీ తెలిసిందే, ఆయన అప్పటికే నిర్మాణాలకు దూరమై వున్నా అప్పుడు కూడా పురందర్ వెనుదీయకుండా నిలబడి తన సహకారాన్ని అందించాడు.

అందుకే విరసం ఆయనకు నివాళి అర్పిస్తోంది.



## 11 ఏప్రిల్ 2021, విజయవాడ - విరసం సాహిత్య పాఠశాలలో పుస్తకావిష్కరణలు



బ్రాహ్మణవాదం - ఆవిష్కర్త : వరలక్ష్మి    అరుణతార - ఆవిష్కర్త : సింగంపల్లి అశోక్‌కుమార్    తంగేడుపూల పాట - ఆవిష్కర్త : శాఖమూరి రవి



తూరుపు ముఖాన - ఆవిష్కర్త : మందరపు హైమవతి    సబ్జెక్ట్ కరెక్షన్ - ఆవిష్కర్త : వంశీకృష్ణ



ఊడల మర్రి - ఆవిష్కర్త : శివరాత్రి సుధాకర్    లేఖా సాహిత్యం - ఆవిష్కర్త : వేణుగోపాల్    కాషాయ ఫాసిజం - ఆవిష్కర్త : రమా సుందరి



పిడికిళ్లు మొలిచిన పంటచేలు - ఆవిష్కర్త : జగదీశ్    వసంతగానం - ఆవిష్కర్త : మల్లీశ్వరి    ధైర్యవచనం - ఆవిష్కర్త : కోడం కుమారస్వామి

BC1



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M108 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | vedavathi. |
| పేజీలు విడదీసినది | vedavathi |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |